



ఖర సంపుటము 28
కార్తికము సంచిక 11

# భారతి

## గుండెలో దీపాలు



శ్రీ దాశరథి

ఈ శిథిలాలయమ్మున జనించిన చిక్కని శర్వరీ తమో
రాశి శిఖాగ్రసీమ పదరా! ఒకదీపము పెట్టివత్తమా;
వేశము లేని ఈ బ్రదుకు వీథుల వెచ్చని దీపమాలికా
పేశలకాంతి నింపుదము, పిండుము రా! నవకాంతి దుగ్ధముల్.

ఈదీపమ్ములచుట్టు చీకటులు పోనేలేదు; దయ్యాలటుల్
పాదుల్ కట్టుక కూరుచున్నవి: నిశాపక్షీంద్ర పక్షమ్ము లెం
తో దూరానకు గాలివీచినవి: ముద్దుల్ గుల్కు దీపమ్ములం
దేదో చల్లదనమ్ము ప్రాకినది, లెమ్మా! వేడి పుట్టింపగన్

దూరదూరాల దీపాల తోరణాల
భరతవీరుల నెత్తుటి వరద కలదు;
అందులో విచ్చె బంగారు టంబుజములు
భరతమాతృ పదమ్ముల వ్రాలుకొఱకు

గుండెలను పిండి ప్రమిదలనిండ స్నేహ
మొలికి ప్రేమాగ్నికళికలు నిలుపరమ్మ!

చీకటులు త్రావి మత్తిల్లి జీర్ణకుటిని
గుఱక పెట్టెడి జనుల మేల్కొలుపలెమ్ము.

ఇచట నిరుపేదవాడు కోపించినాడు
దివ్యదీపావళీ దీపదీధితులటు;
ప్రేయసీ హృదయాంతర వీధులందు
ప్రియుడు వెలిగించినాడు దీపికలు నేడు

కోటిమందార పుష్పాల తోటవోలె
దీపికాతోరణమ్ముల తేజరిల్లె;
యుగయుగమ్ముల చీకటిపొగల అరలు
తగులబడిపోయె దీపాల సెగలలోన

అస్మదంగనా రుధిరాధరాంగణమున
మొలకనవ్వులవోలె దివ్వెలు లసించె;
నీల కాసారమున రమణీయ కమల
కళికలటు దీపమాల చీకటుల దోచె.

నవయువక రక్తనాళాల నడుమ పారు
నూత్న చైతన్యధారయే నూనెగాగ
చీకటులు నింపుకొన్న మృత్స్నాకరండ
మీ ఇలాగోళకమ్ము వెల్గింతు నేను.



# ఆంగ్లో - ఈజిప్షియన్ సమస్య



శ్రీ సీతారామ్

సూయజ్, సూడాన్‌లపై ఆధిపత్యంకోసం నేడు బ్రిటన్ ఈజిప్టులమధ్య వచ్చిన కలహం అట్లాంటిక్ పాక్టు దేశాల వ్యూహాలకు భంగపాటు కలిగిస్తున్నది. అయితే పర్షియాలో పెట్రోలియం పరిశ్రమ సమస్యవలె శాంతియుతంగా పరిష్కారం కాకపోతే ప్రపంచ యుద్ధ ప్రమాదం పొడచూపినట్లు, ఈజిప్టు సమస్యలో కనపడదు. పర్షియాలో రష్యన్ సేనల ప్రవేశానికి అవకాశమిచ్చే ౧౯౩౬ ఒడంబడికవంటిది కాని మరొక ఒడంబడిక గాని ఈజిప్టు రష్యాల మధ్య లేదు. రష్యా ఈజిప్టుల మధ్య మైత్రిగాని శత్రుత్వం గాని లేవు.

చిరకాలం బ్రిటిష్ వారి ఆక్రమణలో రాజకీయ ఆర్థిక సైనిక దాస్యం అనుభవించిన ఈజిప్టుకు బ్రిటిష్ సైనిక బలాన్ని నిర్లక్ష్యపెట్టి సూయజ్ సూడాన్ ప్రాంతాలపై ఆధిపత్యం వహించడానికి కృషి చెయ్యగల ధైర్యం కేవలం నేటి ప్రపంచపరిస్థితులవల్లనే సమకూరింది. ఈజిప్టు సైనిక బలం బొత్తిగా స్వల్పం. అయినప్పటికీ బ్రిటన్ వంటి సామ్రాజ్య ప్రభుత్వాన్ని ఎదిరించడానికి సాహసం ఈజిప్టుకు పర్షియాకువలెనే ప్రపంచ రాజకీయ పరిస్థితుల వల్లనే చిక్కింది. పూర్వంవలె పరరాజ్యాలను ఆక్రమించుకోగల అవకాశం గాని ధైర్యం గాని యూరోపియన్ సామ్రాజ్యాలకు నేడు లేదు. ఈ సత్యాన్ని గ్రహించి క్రమక్రమంగా రాజకీయ ఆర్థిక స్వాతంత్ర్యాలను ఆర్జించుకోడానికి యత్నిస్తున్న చిన్న చిన్న రాజ్యాలలో ఈజిప్టు ఒకటి. (రాజ్యవిస్తీర్ణతను బట్టిగాక సైనిక ఆర్థిక బలాలనుబట్టి రాజ్యాలు చిన్నవిగాను పెద్దవిగానూ పరిగణింపబడుతున్నాయి.)

ఈజిప్టుకు సంబంధించినంతవరకూ ఒబ్రహయోగంవల్ల విధించబడిన రాజకీయ ఆర్థిక సైనిక దాస్యం నుంచి విముక్తి పొందాలంటే సూయజ్ కాలువ సూడాన్ దేశమూ బ్రిటిష్‌వారి హస్తాలనుంచి తొలగి తమ ఆధిపత్యం ఏర్పడ్డం అవసరమని ఈజిప్టునాయకుల అభిప్రాయం.

కాని సూయజ్ కాలువ నౌకావాణిజ్యానికీ, నైల్ నదీ దేవత ప్రసాదమని పేరు పొందిన ఈజిప్టుకూ ఆర్థికసౌష్ఠవం చేకూరాలంటే సూడాన్ దేశంపై ఆధిపత్యం అవసరమని ఈజిప్టునాయకుల అభిప్రాయం. వర్షాలు ఏ ఋతువులోనూ కావలసినంతగా లభించక, వ్యవసాయానికి కేవలం నైల్ నదీ జలాలపైనే ఆధారపడే ఈజిప్టు, సూడాన్‌దేశంపై ఆధిపత్యం కోరడంలో ఆశ్చర్యం లేదు. ఈజిప్టు ఆర్థిక జీవనానికి సూడాన్ అవసరమనే విషయాన్ని పూర్వం బ్రిటిష్ పరిపాలకులే నిరూపించారు.

టర్కిష్ సుల్తాన్‌కింద సామంత ప్రతిపత్తి అంగీకరిస్తూ, క్రియలో సర్వస్వతంత్రుడై ఈజిప్టును స్వతంత్రరాజ్యంగా పరిపాలించినమహమ్మద్ ఆలీ నైల్ నదీ లోయప్రాంతమంతా ఒకేపరిపాలనలో ఉండవలసిన అవసరాన్ని గ్రహించి సూడాన్‌దేశాన్ని జయించాడు. ౧౮౨౧ లో సూడాన్ ఈజిప్టుఆధిపత్యం క్రిందికి వచ్చింది. ౧౮౮౧లో సూడాన్‌నాయకుడు మహదీ ఈజిప్టును ధిక్కరించి సూడాన్‌లో స్వతంత్ర పరిపాలన నెలకొల్పాడు. అదే సంవత్సరం బ్రిటిష్, ఫ్రెంచి వ్యాపారుల ఆర్థిక దాస్యానికి లోబడిన ఈజిప్షియన్ ఖెదీవ్ పైన (టర్కీ సుల్తాన్ నియామకం లోని వైస్రాయి) ఈజిప్టు జాతీయనాయకులు తిరుగుబాటు చేశారు. బ్రిటిష్ సైన్యాలు వెంటనే తిరుగుబాటు పణిచివేసి ఈజిప్టును ఆక్రమించుకుని ఖెదీవ్‌ను తమ చేతి కీలుబొమ్మగా చేసుకున్నాయి. ఈజిప్టులో కల్లోలాన్ని అణిచి వేసిన బ్రిటిష్‌వ్యాపారులు సూడాన్ విషయంలో ఈజిప్టు పరిపాలకునితో ఏకీభవించారు. ౧౮౯౮ లో లార్డ్ కిచెనర్ నాయకత్వం కింద బ్రిటిష్, ఈజిప్షియన్ సేనలు సూడాన్‌పై దండెత్తి ఆక్రమించుకున్నాయి. ౧౮౯౯ లో బ్రిటిష్, ఈజిప్టు

యన్ ప్రభుత్వాల ద్వంద్వ పరిపాలన సూడాన్‌లో నెలకొల్పబడింది. పేరుకి ఇది ద్వంద్వ పరిపాలనే కాని వాస్తవంగా ఆ నాటినుంచి ఈనాటివరకూ సూడాన్‌లో పరిపాలిస్తున్నది బ్రిటిష్ వారే.

ఈజిప్టుఆర్థిక వ్యవస్థను తమగుప్పిటలో పెట్టుకున్న బ్రిటిష్‌వారికిసూడాన్ ఈజిప్టుల ఆర్థిక సహకారావశ్య కతపూర్తిగా బోధపడినందువల్లనే లార్డ్ కిచెనర్ దూర దృష్టితో ఇట్టి ఏర్పాటు చేశాడు. ఇప్పుడు నైల్ నదీ లోయ ప్రాంతమంతా ఆర్థికంగా ఏకాధిపత్యం కింద కాని పరిపూర్ణ సహకారాన్ని చేకూర్చే వ్యవస్థ కింద కాని ఉంచడం అవసరంకాదని బ్రిటిష్‌వారు వాది స్తున్నారంటే, ఇది బూటకం. ఇట్టి వాదనలోని అంతర్యం బోధపడుతూనే ఉంది. ఆర్థికంగా సర్వ స్వతంత్రవ్యవస్థను పొందాలని ప్రయత్నిస్తున్న ఈజిప్టునుంచి తమ సైన్యాలను ఉపసంహరించుకున్న ప్పటికీ, ఆ దేశాన్ని ఆర్థికంగా తమ గుప్పిటలో ఉంచు కోడానికే బ్రిటిష్‌వారు సూడాన్ దేశాన్ని తమ ఆధిపత్యంలోనే ఉంచుకోవాలని కోరుతున్నారు.

నైల్ నదీప్రాంత దేశాలైన ఈజిప్టు, సూడాన్ దేశాల మధ్య రాజకీయసమస్యను పరిష్కరించా లంటే బ్రిటిష్ వారు సూడాన్ దేశం నుంచి నిష్క్ర మించడం అత్యంతావశ్యకం. సూడాన్ దేశానికి ఎట్టి రాజకీయవ్యవస్థ నిచ్చినా, ఎంతవరకూ రాజకీయ స్వాతంత్ర్యాన్ని ఇచ్చినా, ఆర్థికంగా ఈజిప్టుతో సహకారంకోసం రెండు దేశాల మధ్యనూ ఏదో ఒక విధమైన బాంధవ్యం అవసరం కాక తప్పదు. అందు వల్ల ఉభయదేశాలకూ క్షేమకరమైన రాజకీయ బాంధ వ్యాలను ఏర్పాటు చేసుకోడానికి సూడాన్ నుంచి బ్రిటిష్ సేనలు, బ్రిటిష్‌పరిపాలకులు నిష్క్రమిం చడం అవసరమౌతుంది. బ్రిటిష్ వారి ప్రాబల్యం తొలగనిదే ఈజిప్టు స్వాతంత్ర్యవ్యవస్థ నామ మాత్రంగానే ఉండిపోతుంది.

ఇది సాధించడం కోసమే ఈజిప్టుప్రభుత్వం ౧౯౩౬ లో బ్రిటిష్‌ప్రభుత్వంతో చేసుకొన్న ఒడంబడికను రద్దు చెయ్యడానికి కృషి చేసింది. కాని ఈజిప్టువంటి బలహీనమైన రాజ్యం, బ్రిటన్‌వంటి బలవత్తర సామ్రాజ్యాన్ని ఎదిరించి అట్టిది సాధించ డం దుర్లభం. అందువల్లనే నేటికి ప్రపంచ పరిస్థితులు అనుకూలంగా బ్రిటిష్ సామ్రాజ్యానికి ఆయువు పట్టు వంటిదైన సూయజ్ కాలువ వద్ద బ్రిటిష్ వారిని సాధించాలని ఈజిప్టు ప్రయత్నిస్తున్నది.

వాస్తవానికి సూయజ్ కాలువ వ్యాపారరీత్యా మిగతా వ్యాపార దేశాల కంటె ఈజిప్టుకు ప్రధానం కాదు. సర్వదేశాలకూ ప్రయాణ యోగ్యాలైన ప్రపంచ రహదారులు ప్రత్యేక దేశాల అధీనంలో ఉండడం కంటె అంతర్జాతీయసంస్థల ఆధిపత్యంలో కాని, ప్రపంచ రాజ్యాల ఒప్పందాలప్రకారం కాని నిర్వహించ బడవలసిన అగత్యాన్ని నేడు సర్వ రాజ్యాలూ గుర్తించవలసిన మాట నిజమే. సూయజ్ కాలువ ప్రాంతాన్ని తమ కొప్పగించాలని ఈజిప్టు కోరడం సక్రమం కాదు. కాని ఇదే కారణం ఆధా రంగా, సూయజ్ ప్రాంతంనుంచి బ్రిటిష్ సైనిక కేంద్రాన్ని కూడా తొలగించడం అవసరమనిచెప్పాలి. ముఖ్యంగా మూడో ప్రపంచ యుద్ధం పొంచుకొని ఉన్న నేటిపరిస్థితులలో ఇట్టి ప్రాంతాలను అగ్ర రాజ్యాల అధీనంలో ఉంచడంవల్ల, సమీపంలోని చిన్న రాజ్యాలకు ముప్పు అధికం.

ఒక విధంగా సూయజ్ కాలువ చరిత్ర ప్రపంచ రాజకీయాల పరిణామంలో చూస్తే చిత్రంగా కనపడు తుంది. మొట్టమొదట ఆలోచిస్తే, ఈ కాలువ నిర్మించబడినదిమొదలూ బ్రిటిష్‌వారి ఒత్తిడిలోనే ఉంది. కాని ఈ కాలువ నిర్మాణాన్ని మొట్టమొదట నిరోధించినది బ్రిటిష్ ప్రభుత్వమే. నేటి ప్రపంచ రాజకీయాలలోనూ, అగ్రరాజ్యాల యుద్ధ వ్యూహాల లోనూ, పూర్వయుద్ధాలూ రాజకీయ తంత్రాల లోనూ బ్రిటన్ అవసరాలనుబట్టే సూయజ్ కాలువ ప్రాధాన్యం పరిగణించబడుతోంది.

క్రీస్తు పూర్వం ౧౩౮౦ ప్రాంతాల నైల్ నది నుంచి సూయజ్ దక్షిణకొసకు ఒక కాలువ ఉండే దనీ, ఈజిప్టులో మహమ్మదీయులు మొదట పరిపాలన స్థాపించినప్పుడు కైరోనుంచి ఒక కాలువ ఉండేదనీ కొందరు చరిత్రకారులు వ్రాశారు. అయితే సముద్రం దక్షిణానికి తీసిపోయినందువల్ల అది పూడిపోయిం దిట.

వాస్కో-డిగామా యూరప్ నుంచి భారతదేశా నికి ఆఫ్రికాను చుట్టివచ్చే సముద్రమార్గాన్ని కని పెట్టినప్పుడు, భారతదేశానికి భూమార్గాన్ని నిర్మించా లని ఫ్రెంచి వారు జర్మనులు తీవ్ర కృషి చేశారు.

సూయజ్ వద్ద కాలువను త్రవ్వాలని ఈజిప్షియన్లు ప్రయత్నించారు. టర్కీష్ సుల్తాన్ ఈ యత్నాన్ని నిరోధించాడు. ఫ్రెంచి రాజు పధ్నాలుగవ లూయీ ౧౭ వ శతాబ్దంలో తిరిగి ప్రయత్నించాడు. కాని అప్పుడు కూడా కొనసాగలేదు.

భారతదేశాన్ని జయించాలని కలలు కన్న నెపోలియన్ ఈజిప్టును ఆక్రమించుకున్నప్పుడు (౧౭౯౮) కాలువ త్రవ్వడానికి ఆ ప్రాంతాన్ని సర్వే చేయించాడు. కాని నెపోలియన్ నౌకాబలం బ్రిటిష్ నౌకాదళాధిపతి నెల్సన్‌వల్ల పరాజయం పొందడంతో ఈయత్నం కొనసాగలేదు.

అప్పటికి ప్రపంచవాణిజ్యం విరివిగా వృద్ధి చెందింది. సకల సంపద్సమృద్ధమైన ఆసియాలో సామ్రాజ్యాలను విస్తరింప చేసుకోవాలనీ, వాణిజ్యాభివృద్ధివల్ల తమ దేశాల సంపద వృద్ధిచేసుకోవాలనీ కాంక్షించిన యూరోపియన్లకు సూయజ్ ప్రాంతం యూరప్‌నుంచి ఆసియాకు సమీపమార్గం చూపింది. యూరప్‌నుంచి భారత దేశానికి మార్గాన్ని కనిపెట్టడం ఎంత ప్రధాన ప్రపంచ చరిత్ర ఘట్టమో, సూయజ్ కాలువ మార్గాన్ని లభింపచేసుకోవడంకూడా అంతటి ప్రధానమైనదని అప్పుడు భావించబడింది.

ప్రపంచ వాణిజ్యాభివృద్ధికీ, 'ప్రపంచ పునరుద్ధరణకూ' దీక్ష వహించిన సెంట్ సైమనిస్ట్ సొసైటీ సూయజ్ కాలువ ప్రాధాన్యాన్ని గ్రహించి, ౧౮౪౬ నుంచీ కృషిచెయ్యనా రంభించింది. ౧౮౫౪లో సొసైటీకి చెందిన లెస్సెప్ అనే ఫ్రెంచి ఇంజనీరు ఈజిప్టు ఖెడీవ్ అనుమతి పొంది సూయజ్ కెనాల్ కంపెనీ స్థాపించాడు. అప్పుడు బ్రిటిష్ ప్రధానిగా ఉన్న లార్డ్ పామర్‌స్టన్ టర్కిష్ సుల్తాన్‌పై ఒత్తిడి తెచ్చి ఈ యత్నాన్ని విరమింప చెయ్యాలని చూశాడు. ఈ కాలువ త్రవ్వినట్లయితే బ్రిటిష్‌వారి నౌకాబలాధిక్యత క్షీణించగలదనీ, బ్రిటిష్ వారిపై వైరం సాధిస్తున్న ఫ్రెంచివారు కుట్రపన్ని ఈ పన్నాగం వేశారనీ పామర్‌స్టన్ అన్నాడు. టర్కీ సుల్తాన్ సమ్మతించనప్పటికీ లెస్సెప్ సూయజ్ కెనాల్ కంపెనీని స్థాపించి వాటాలు అమ్మాడు. ఫ్రాన్స్, టర్కీ, ఈజిప్టు ప్రభుత్వాలు వాటాలను కొన్నాయి. బ్రిటన్, రష్యా, అమెరికా, ఆస్ట్రేలియా ప్రభుత్వాలు ఈ నిర్మాణంలో జోక్యం కలుగచేసుకోలేదు. ౧౮౫౯ లో టర్కీ ఈజిప్టుల అనుమతితో సూయజ్ కాలువ నిర్మాణం ప్రారంభమయింది. ఈజిప్టుప్రభుత్వంవద్ద ౯౯ ఏళ్ళకు కంపెనీ కంట్రాక్టు తీసుకుంది. (౧౯౬౮ లో కాలువ ఈజిప్టు ప్రభుత్వం అధీనమౌతుంది.) ౧౮౬౯ నవంబరు ౧౭ వ తేదీని కాలువలో నౌకాయానం ప్రారంభమయింది. మధ్యధరాసముద్రపు రేవు పోర్ట్‌సయిద్ నుంచి, ఎర్రసముద్రపు రేవు సూయజ్ రేవువరకూ కాలువపొడుగు నూరుమైళ్ళు. క్రమ క్రమంగా కాలువ వెడల్పు చెయ్యబడింది.

నిర్మాణమైనది మొదలు నౌకాయానం నానాటికి వృద్ధిచెంది టోల్ పన్ను ద్వారా కంపెనీకి ఆదాయం అధికమయింది. సూయజ్ కాలువనుండా అన్ని రాజ్యాల నౌకలకూ ప్రయాణసౌకర్యం లభించింది. భారత దేశంలో తమ సామ్రాజ్య రక్షణకు సూయజ్ కాలువ ప్రాధాన్యాన్ని గ్రహించిన లార్డ్ కిచెనర్ బ్రిటిష్‌ప్రభుత్వానికి చేసిన సూచనల్ని అప్పటి బ్రిటిష్ ప్రధాని డిశ్రేలీ గ్రహించాడు. ఈజిప్టు ప్రభుత్వం ఆర్థికంగా చిక్కులలోపడి ధనంకోసం బ్రిటిష్ ఫ్రెంచి వ్యాపారుల సహాయం కోరిన సమయాన్ని కనిపెట్టి, ౧౮౭౫లో సూయజ్ కెనాల్ కంపెనీలోని ఈజిప్టు ప్రభుత్వవాటాలను బ్రిటిష్‌ప్రభుత్వం కొనివేసింది. దీనితో కంపెనీ పైన బ్రిటిష్‌వారికి పూర్తి అధికారం లభించింది. అయితే ఈనాటికీ కంపెనీ కార్యాలయం ఫ్రెంచిఉద్యోగుల చేతిలోనే ఉంది.

ప్రపంచ వాణిజ్యంలో ప్రధానస్థానం అలంకరించిన సూయజ్ కాలువను ఏ ఒక్క ప్రభుత్వం అధీనంలోను ఉండనివ్వరాదని అన్నిరాజ్యాలూ ప్రయత్నించాయి. రాజ్యాలమధ్య వైరాలతోనూ యుద్ధాలతో నిమిత్తం లేకుండా యుద్ధ సమయంలో కాని శాంతి సమయంలో కాని అన్నిదేశాల నౌకలకూ సమాన ప్రయాణ సౌకర్యాలను ఏర్పాటు చేస్తూ ౧౮౮౮లో బ్రిటన్, రష్యా, ఫ్రాన్స్, జర్మనీ మొదలైన దేశాలు కాన్‌స్టాంటినోపిల్ ఒడంబడిక చేసుకున్నాయి. కాని క్రియలో ఇదెన్నడూ జరగలేదు. రెండు ప్రపంచ యుద్ధాలలోనూ కాలువకు రెండు వైపులా అలెగ్జాండ్రియా రేవులోనూ, ఎర్రసముద్రంలోనూ బ్రిటిష్ యుద్ధనౌకలు కాపలావేసి, శత్రు రాజ్యాల నౌకలను సూయజ్ కాలువను ప్రవేశించనివ్వలేదు.

ఆసియాలోని వారి సామ్రాజ్య రహదారి కావడంవల్లనూ, బ్రిటిష్ పెట్రోలియం పరిశ్రమ ప్రాంతాలకు అతిసమీపంలో ఉన్నందువల్లనూ, బ్రిటిష్‌వారికి సూయజ్ కాలువ ఆయువుపట్టయింది. ఆసియానుంచి పెట్రోలియం, పత్తి, జనపనార మొదలైన ముడి పదార్థాలు బ్రిటన్‌కు ఈ కాలువద్వారానే రవానా కావాలి. తిరిగి బ్రిటిష్‌వారు తయారుచేసిన పారిశ్రామికోత్పత్తి ఈ కాలువద్వారానే ఆసియా దేశాలకు రవానా కావాలి. పర్షియన్ పెట్రోల్ ఈ కాలువద్వారానే బ్రిటిష్ నౌకాబలాలకూ ప్రపంచ వ్యాపారానికీ రవానా అవుతుంది.

పందొమ్మిదవ శతాబ్దంలో బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వం తన నౌకాబలంలో అత్యధికభాగాన్ని మధ్యధరాప్రాంతంలో కేంద్రీకరించింది. ద్వితీయ ప్రపంచ సంగ్రామకాలంవరకూ మధ్యధరా సముద్ర ప్రాంతం బ్రిటిష్ నౌకాబలం అధీనంలోనే ఉంది. ఇప్పుడు అమెరికన్ నౌకాబలానికి చెందిన బలీయమైన ఆరవ అమెరికన్ నౌకాదళం మధ్యధరా సముద్రంలో కేంద్రీకరించబడి ఉంది. ద్వితీయ ప్రపంచ సంగ్రామం ప్రారంభంలో అమెరికన్ నౌకాదళం అత్యధికభాగం పసిఫిక్ మహాసాగరంలో మాత్రమే కేంద్రీకరించబడింది. సంగ్రామం అనంతరం పసిఫిక్ మహాసాగరం, అట్లాంటిక్ మహాసాగరాలలో కంటె పెద్ద నౌకాదళాన్ని మధ్యధరాసముద్రంలో అమెరికా కేంద్రీకరించింది. జపాన్ సామ్రాజ్య ప్రభుత్వం పాశ్చాత్యుల ఆసియా రాజ్యాలకు ముప్పు తెచ్చిన ఉభయ సంగ్రామాల మధ్యకాలంలో పెర్ల్ హార్బర్ (హవాయ్ దీవులు), సింగపూర్ నౌకాశ్రయాలు ప్రాధాన్యత వహించినప్పటికీ, ప్రపంచ చరిత్రలో అనేక శతాబ్దాలుగా తూర్పు మధ్యధరాతీర ప్రాంతంలోనే అగ్రరాజ్యాల బలాబలాలు పరీక్షించుకోబడుతూ వచ్చాయి.

పందొమ్మిదవ శతాబ్దం ఉత్తరార్థంలో మధ్యధరా సముద్రంలోనికి రష్యన్లకు ప్రవేశమివ్వకుండా నిరోధించడానికే బ్రిటిష్ నౌకాబలం కృషిచేసింది. ౧౯౪౦ లో బ్రిటన్‌పై జర్మన్లు దండయాత్ర జరుపుతారనే భయం అధికంగా ఉన్నప్పటికీ లక్ష్యపెట్టక, ప్రధాని విన్‌స్టన్ చర్చిల్ మాతృదేశాన్ని రక్షిస్తున్న సైన్యంలో రెండు పెద్ద దళాల్ని ఈజిప్టుకు పంపాడు. నెపోలియన్‌కి నౌకాబలాలు లోపించినందువల్లనే అతని బలాలు పరాజయం పొందాయి. ప్రపంచ సంగ్రామాలలో జర్మన్లు బ్రిటిష్ నౌకాబలాన్ని కేవలం సబ్‌మెరైన్‌లవల్ల క్షీణింపచెయ్యాలని ప్రయత్నించారు. కాని జర్మన్లకు గాని రష్యన్లకుగాని ఏనాడూ మధ్యధరాసముద్రంలో గెలుపు చిక్కలేదు.

రష్యాతో ఆంగ్లో-అమెరికన్ రాజ్యకూటానికి గల వైరాలలో మధ్యధరా సముద్ర ప్రాంతానికి గల ప్రాముఖ్యతను గ్రహించడానికి చరిత్రలో మూడు ముఖ్య ఘట్టాలను పరిశీలిస్తే చాలు.

౧. రష్యన్ చక్రవర్తికి చెందిన క్రిమియాపైన ౧౮౫౪ లో బ్రిటిష్, ఫ్రెంచి నౌకాబలాలు దాడి చేశాయి. ౨. మొదటి ప్రపంచయుద్ధం అనంతరం బ్రిటిష్ నౌకాబలం రష్యాకుచెందిన కాకసస్ పెట్రోలియంగనులప్రాంతాన్ని ఆక్రమించాయి. ౩. రెండవ ప్రపంచయుద్ధంలో జర్మన్ సేనలు ఇటు ఈజిప్టుపైనా అటు క్రిమియాపైనా దండయాత్ర జరిపాయి. ౧౯౧౪ నుంచీ పందొమ్మిదవ శతాబ్దంలో ప్రపంచాధిపత్యానికీ, సామ్రాజ్యవిస్తరణకూ పోటీ చేసిన యూరోపియన్ రాజ్యాలు ముఖ్యమైనవి బ్రిటన్, ఫ్రాన్సు, జర్మనీ, రష్యాలు. ఈ రాజ్యాలన్నీ మధ్యధరా సముద్రప్రాంతం, ముఖ్యంగా తూర్పుతీరప్రాంతం ఎవరి అధీనంలో ఉంటే వారికే ప్రపంచాధిపత్యం లభించగలదనే విశ్వాసంతో రాజకీయతంత్రాలు నెరపాయి. టర్కీ కాని గ్రీస్ కాని రష్యన్ల ప్రభావానికి లోబడినట్లయితే బ్రిటిష్ సామ్రాజ్యపు రహదారులకు, ఈజిప్టులో బ్రిటిష్‌ఆధిపత్యానికీ ప్రమాదం సంభవించగలదనే భయంతో రష్యన్లను మధ్యధరా సముద్రంలోకి రానివ్వకుండా బ్రిటన్ కాపాడుకుంటూ వచ్చింది. టర్కిష్ సామ్రాజ్యానికి చెందిన అరబ్ దేశాలు జర్మన్, ఫ్రెంచి, రష్యన్ రాజ్యాల ప్రభావానికి లోనుకాకుండా చెయ్యడానికి బ్రిటన్ పన్నిన తంత్రాలు చరిత్రప్రసిద్ధాలు.

నేడు సూయజ్ ప్రాంతమూ, తూర్పు మధ్యధరా తీరప్రాంతమూ ఆంగ్లో-అమెరికన్ రాజ్యాల అధీనంలో ఉన్నాయి. రష్యాతో యుద్ధం సంభవించినట్లయితే బ్రిటిష్, అమెరికన్ విమానబలాలు సులువుగా దక్షిణ రష్యాపైన దాడిచేసి రష్యన్ పెట్రో




లియం పరిశ్రమలనూ, ఇతర పరిశ్రమలనూ ధ్వంసం చెయ్యడానికి వీలుంటుంది. ప్రపంచయుద్ధం మళ్ళీ సంభవించే పక్షంలో పాశ్చాత్య రాజ్యాలకు, ముఖ్యంగా బ్రిటన్‌కు ఆయువు పట్టు వంటి మధ్య ప్రాచ్య దేశాలపైన రష్యా దాడి చేస్తుందని అమెరికన్ల అంచనా. ఇదే జరిగినట్లయితే యుద్ధకాలానికి ప్రాణావసరమైన పెట్రోల్ సప్లై దక్కి పోవడమే కాక, ఆసియా దక్షిణాఫ్రికాలలోని వలస దేశాలకు బ్రిటన్ నుంచి కల రహదారి కట్టివెయ్య బడుతుంది. అందువల్లనే మధ్యప్రాచ్యదేశాల కోసం అట్లాంటిక్ పాక్టుకు అనుబంధంగా మరొక సమిష్టి రక్షణ వ్యవస్థను ఏర్పాటు చెయ్యడానికి అమెరికా యత్నిస్తున్నది.

సూయజ్ కాలువ బ్రిటిష్‌వారు చేజిక్కించు కున్నది మొదలు, వారికి పోటీగా జర్మను బెర్లిన నగరంనుంచి బాగ్దాద్ వరకూ రైలుమార్గం నిర్మించాలని ప్రయత్నిస్తూవచ్చారు. ప్రథమ ప్రపంచ సంగ్రామానికి ముందు బలహీనపడిపోయిన టర్కీ ప్రభుత్వంపైన జర్మనీ ప్రాబల్యం అధికమౌతున్నకొద్దీ బ్రిటన్ ఆందోళన పడసాగింది. అప్పటికే ఇరాక్‌లో పెట్రోలియంపరిశ్రమ స్థాపనకు విరివిగా పరిశోధనలు ప్రారంభమై కంపెనీల పెట్టుబడులు నిండ నారంభించాయి. బ్రిటన్ జర్మనీలు పోటీపడి టర్కీ వద్ద కన్సెషను సంపాదించాయి. చివరికి బ్రిటిష్ జర్మన్ కంపెనీలు కలిసి పెట్టుబడిపెట్టి టర్కిష్ పెట్రోలియం కంపెనీని స్థాపించాయి. పర్షియాలో పెట్రోల్ పరిశ్రమ ౧౯౧౩లోనే స్థాపించబడినప్పటికీ, ఇరాక్‌లో పెట్రోలియమ్ పరిశ్రమ స్థాపనకు అంతకు ముంచే ఆరేళ్ళుగా కృషి జరిగింది. అయితే ప్రథమ ప్రపంచ సంగ్రామం అనంతరంగాని ఇరాక్‌లో పరిశ్రమ ప్రారంభం కాలేదు. ఇరాక్ పెట్రోలియంను దృష్టిలో పెట్టుకునే జర్మనీ టర్కిష్ ప్రభుత్వాన్ని లోబరుచుకోడానికీ, బ్రిటన్ అరబ్ జాతులవారిని

టర్కీపై తిరుగుబాటుకు పురిగొల్పడానికి ప్రయత్నించాయి. తరువాత ఫ్రాన్స్ బ్రిటన్‌ల మధ్య జరిగిన పోటీకికూడా పెట్రోలియం పరిశ్రమ, సూయజ్ ప్రాంతమూ ముఖ్యహేతువులు. టర్కీకి దక్షిణంగా కల అరబ్ దేశాలన్నిటికీ స్వాతంత్ర్య మివ్వగలరని చెప్పికూడా బ్రిటన్ వాగ్దానభంగం చేసి, తమ సంరక్షకత్వాన్ని నెలకొల్పుకోడానికి పెట్రోలియం, సూయజ్‌లే కారణాలైనాయి.

పాలస్తీనాలో స్థిరనిలయ మేర్పరచుకోడానికి బ్రిటన్ పన్నిన తంత్రం చరిత్రప్రసిద్ధం. మొదటి ప్రపంచయుద్ధకాలంలో సిరియా, పాలస్తీనాలలో బ్రిటన్ సేనల ఆక్రమణలు సుస్పష్టంగా మోసుల్ — హైఫా పైప్‌లైన్ నిర్మించాలనే దృష్టితోనే నడప బడినాయి. చివరికి యుద్ధానంతరం లెబనన్, సిరియాలను ఫ్రెంచివారికి పంచియిచ్చి, ఇరాక్ పాలస్తీనాలను బ్రిటన్ ఆక్రమించుకుంది.

పద్దెనిమిది, పందొమ్మిదవ శతాబ్దాలలో రష్యా ఫ్రెంచి దేశాలతోనూ, పందొమ్మిది ఇరవై (పూర్వార్ధ)శతాబ్దాలలో జర్మనీ రష్యా దేశాలతోనూ చేసిన పోటీలో బ్రిటన్ తన సామ్రాజ్య సంరక్షణ కోసం మధ్యధరాసముద్రప్రాంతంలో అద్వితీయమైన తన నౌకాబలంతో ఆధిపత్యాన్ని చలాయించింది. బ్రిటిష్ నౌకాబలానికి మధ్యధరా సముద్రం పూర్తిగా లోబడిపోయిందని చెప్పవచ్చును. మొదటి ప్రపంచ యుద్ధం అనంతరం బ్రిటిష్ మధ్యధరా నౌకాదళానికి మాల్టా, బ్రిటిష్ మధ్యప్రాచ్య సైనికసమూహానికి సూయజ్ కేంద్రాలైనాయి. సైప్రస్ ద్వీపాన్ని టర్కీ వద్ద ౧౮౭౮లో తీసుకుని అక్కడ బలీయమైన నౌకా సైనిక కేంద్రాలను నిర్మించింది. పాలస్తీనా సంరక్షకత్వంలో హైఫాలో ఒక కేంద్రం నిర్మించబడింది.

మొదటి ప్రపంచయుద్ధం తరవాత జాతీయ స్వాతంత్ర్యోద్యమాల ఫలితంగా ౧౯౨౨లో బ్రిటన్ ఈజిప్టుపై సంరక్షకత్వాన్ని వొదులుకోవలసి వచ్చింది. టర్కీష్ సామంతం పోగానే ఈజిప్టు పరిపాలకునికి సుల్తాన్ బిరుదు ఇవ్వబడింది. ౧౯౨౨లో సుల్తాన్‌గా ఉన్న ఫూఆద్ రాజైనాడు. కాని సూయజ్ సంరక్షణ నిమిత్తం బ్రిటిష్ సేనలు ఈజిప్టు దేశాన్ని విడిచి పోలేదు. ఈ సేనలుకూడా తొలగిపోవాలని బయలు దేరిన ఉద్యమంవల్ల ౧౯౩౬లో బ్రిటన్ ఈజిప్టుతో ఒక ఒడంబడిక చేసుకుంది. ఇరవై ఏళ్ళపాటు అమలులో ఉండాలని నిర్ణయించబడిన ఈ ఒడంబడిక ప్రకారం, అలెగ్జాండ్రియా, పోర్ట్ సయిద్ రేవులు బ్రిటిష్‌వారికి నౌకాశ్రయాలుగా ఉపయోగపడ్డానికి అనుమతివ్వబడింది. సూయజ్ ప్రాంతంలో పదివేల నాలుగు వందలమంది బ్రిటిష్ సైనికుల్ని నిలకరించు కోడానికి అనుమతివ్వబడింది. యుద్ధ సమయంలో ఈజిప్టుదేశంలో బ్రిటిష్ సేనలు స్వేచ్ఛగా ప్రయాణం చెయ్యడానికి ఈజిప్టు సమ్మతించింది. ఈజిప్టుపై దురాక్రమణ జరిగేపక్షంలో బ్రిటన్ ఈజిప్టు పక్షాన పోరాడాలని విధించబడింది. ఈజిప్టు సైనికబలం తగినంత వృద్ధిపొందేవరకూ సూయజ్ రక్షణ బ్రిటిష్ సైన్యానికి ఒప్పగించబడింది.

రెండో ప్రపంచ యుద్ధంలో ఇటాలియన్లు, జర్మన్లు ఈజిప్టునుంచి బ్రిటిష్‌వారిని తరిమివెయ్యడానికి యత్నించారు. ఈజిప్టు యుద్ధాలే సూయజ్ కాలువ ప్రాధాన్యాన్ని నిరూపిస్తాయి. బెర్లిన్ — బాగ్దాద్ రైల్వే నిర్మాణానికి కెయిజర్ ప్రయత్నించినట్లే, ఇరాక్ ప్రభుత్వంతో మైత్రి నెరపి రైల్వేను నిర్మించ డానికి హిట్లర్ కూడా కృషిచేశాడు. కాని పాలస్తీనా, ఇరాక్‌లలో బ్రిటిష్ సైన్యాల ఒత్తిడివల్ల హిట్లర్ కృషి ఆదిలోనే అంతరించింది. అల్బేనియన్ జాతికి చెందిన మహమ్మద్ అలీ (మొట్టమొదటి ఈజిప్టు ఖెదీవ్) సంతతివాడే ఈజిప్టు రాజైనందువల్ల, హిట్లర్ ఈజిప్టుతో మైత్రికి కృషిచేశాడు. రెండో ప్రపంచ యుద్ధంలో ఈజిప్టు ప్రభుత్వం తటస్థంగా ఉండిపో యింది.

అరబ్ రాజ్యాలలో, ముఖ్యంగా ఇరాక్, ట్రాన్స్‌జోర్డన్, పాలస్తీనాలలో బ్రిటిష్ ప్రాబల్యాన్ని క్షీణింపచెయ్యడానికి అరబ్ నాయకుల ఉద్యమానికి కైరోనగరమే కేంద్రమైనప్పటికీ, ఈజిప్టుపై బ్రిటిష్ సైన్యాలకున్న బలంవల్లనే అరబ్ ఉద్యమం విఫలమౌతున్నది. బ్రిటిష్‌వారు బలవంతాన ఒప్పింపచేసిన ౧౯౩౬ ఆంగ్లో-ఈజిప్షియన్ ఒడంబడికను సవరణ చెయ్యాలనీ, తద్వారా ఈజిప్టుపై బ్రిటిష్ ప్రాబల్యాన్ని తొలగించాలనీ ఈజిప్టుప్రభుత్వం ప్రయత్నించింది. ౧౯౨౨లో ఇవ్వబడిన స్వాతంత్ర్యం నిజమైనది కాదనీ, బ్రిటిష్‌సేనలు ఈజిప్టునుంచీ, సూడాన్‌నుంచీ, సూయజ్‌నుంచీ నిష్క్రమించి

నప్పుడే స్వాతంత్ర్యం సార్థకమౌతుందనీ ఈజిప్టు వాదన. రెండో ప్రపంచయుద్ధకాలంలో ఈజిప్టు రాజు ఫరూఖ్ రాజభవనం చుట్టూ బ్రిటిష్ సేనలు కాపుదల వేసినందుకు ఈజిప్టు ప్రజలకు బ్రిటిష్‌వారి పట్ల ద్వేషం పెచ్చుమీరింది. తరువాత పాలస్తీనా సమస్యలో బ్రిటిష్‌వారి ప్రవర్తనవల్ల బ్రిటిష్‌వారిని తరిమివెయ్యడం అవసరమని ఈజిప్టు భావించింది. ౧౯౪౮ మే లో పాలస్తీనా నుంచి బ్రిటిష్ సేనలు తరలిపోగానే ౧౪వ తేదీని ఇజ్రాయల్ రాజ్యస్థాపన ప్రకటించబడినప్పుడు, పాలస్తీనాపై పశ్చిమంనుంచి ట్రాన్స్‌జోర్డన్, ఉత్తరంనుంచి సిరియా, ఇరాక్, దక్షిణంనుంచి ఈజిప్టుదేశాల సైన్యాలు దాడిచేశాయి. పాలస్తీనాలోని యూదులకు సూయజ్ కాలువ, హైఫా రేవులద్వారా నౌకలలో ఆయుధాలు అమెరికా రష్యా, తూర్పుయూరప్ దేశాలనుంచి విరివిగా సరఫరా చెయ్యబడినాయి. అన్యదేశాల జోక్యం లేకపోతే పాలస్తీనాలో యూదు రాజ్యం ఏర్పడేదే కాదని ఈజిప్టు అభిప్రాయం. ఇంతేకాక పాలస్తీనా గురించి బ్రిటిష్ ప్రభుత్వం తన విధానాన్ని అమెరికా ఒత్తిడివల్ల మార్చుకున్నదనీ, ఇజ్రాయిల్ ప్రభుత్వ స్థాపనకు మొదట అంగీకరించకపోయినా తరవాత అంగీకరించినందువల్లనే దేశంలో అంతర్యుద్ధప్రమాదం సంభవించినప్పటికీ బ్రిటిష్ సేనలు హఠాత్తుగా ఉపసంహరించబడినాయనీ, తరవాత అరబ్ రాజ్యాల మధ్య తగవుల నాధారం చేసుకుని ట్రాన్స్‌జోర్డన్ రాజు చాటున కుట్రలు పన్నారనీ బ్రిటిష్‌వారిపైన ఈజిప్టు ఆరోపించింది. సూయజ్ కాలువ గుండా పాలస్తీనా యూదులకు ఆయుధాలు సరఫరా చెయ్యరాదని ఈజిప్టు ఎంత వాదించినా పెడచెవినిపెట్టి బ్రిటిష్ అధికారులు సరఫరాను నిలపలేదని ఈజిప్టు ఆరోపించింది. ఆతరవాత దక్షిణ పాలస్తీనాలో ఘాజా పట్టణంలో గ్రాండ్ ముఫ్తీ అధిపత్యంకింద ఈజిప్టు స్థాపించిన ప్రభుత్వాన్ని గుర్తించక, కుట్రపన్ని పాలస్తీనాలో యూదులు ఆక్రమించగా మిగిలిన అరబ్ ప్రాంతాన్ని ట్రాన్స్‌జోర్డన్ రాజుకి బ్రిటిష్‌వారే ఒప్పగించినందుకు ఈజిప్టు బ్రిటన్ పట్ల తీవ్రవైరం వహించింది.

రెండో ప్రపంచయుద్ధం అనంతరం ఆంగ్లో - ఈజిప్షియన్ ఒడంబడిక సవరణకు ౧౯౪౬లో రాయబారాలు ప్రారంభమైనాయి. బ్రిటిష్‌వారు కైరో, అలెగ్జాండ్రియాలనుంచీ నైల్ డెల్టాప్రాంతంనుంచీ సైన్యాలను ఉపసంహరించుకున్నారు. సూడాన్‌లో బ్రిటిష్ సేనలు బలపరచబడినాయి. ౧౯౩౬ ఒడంబడిక ప్రకారం సూయజ్‌లో పదివేల నాలుగు వందల సైనికుల్ని మాత్రం ఉంచడానికి నిర్ణయించబడినప్పటికీ, వాస్తవానికి ౬౦ వేలమంది సైనికుల్ని బ్రిటిష్‌వారు నిలవరించారు.

సూయజ్ ప్రాంతంలో బ్రిటిష్ సైనిక కేంద్రం ఉండడానికి ఈజిప్టు సమ్మతించ సిద్ధంగానే ఉంది. ఈజిప్టు సైనికంగా బలపడినప్పుడు గాని, లేక సూయజ్ రక్షణకు మరొక ఏర్పాటు జరిగినప్పుడు గాని బ్రిటిష్ సైన్యాలను తొలగించడానికి బ్రిటన్ కూడా సిద్ధంగానే ఉంది. కాని సూడాన్ గురించి అంగీకారం కుదరనందువల్లనే రాయబారాలు విఫలమౌతూ వచ్చాయి. పాలస్తీనా యుద్ధాల అనంతరం సూయజ్‌లో బ్రిటిష్ సేనల్ని గురించికూడా ఈజిప్టు పట్టుదల వహించింది.

భారతదేశాన్ని విభజించి బలహీన పరిచినట్లే, నైల్ నదీ లోయప్రాంతాన్ని విభజించినట్లయితే తమ ఆర్థిక ప్రాబల్యానికి పోటీ ఉండదని భావిస్తున్న బ్రిటన్, సూడాన్ దేశానికి స్వాతంత్ర్య ప్రతిపత్తి నివ్వడానికి సిద్ధంగా ఉన్నట్లు చెప్తున్నది. సూడాన్‌లో అరబ్ నీగ్రో జాతివైషమ్యాలను రెచ్చగొట్టి, ఈజిప్టుతో చేరాలని ఉద్యమం నడిపే నేషనల్ ఫ్రంట్‌కు పోటీగా స్వాతంత్ర్యంకోసం ఉద్యమం నడిపే ఇండిపెండెంట్ ఫ్రంట్‌ను బ్రిటిష్ పాలకులు బలపరుస్తున్నారు. సూడాన్ దేశంనుంచి బ్రిటిష్‌వారు నిష్క్రమించేవరకూ ఎట్టి ఒప్పందమూ (తాత్కాలికంగా ఏదో ఒకటి కుదిరినప్పటికీ) ఈజిప్టు ప్రజలను తృప్తి పరచదు.

అట్లాంటిక్ పాక్టుకు అనుబంధంగా మధ్య ప్రాచ్యదేశాల సైనికసంరక్షణవ్యవస్థను స్థాపించే ఉద్దేశంతో అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్, టర్కీలు పంపిన ఆహ్వానాన్ని ఈజిప్టు తిరస్కరించింది. సూడాన్‌పై ఈజిప్టు అధిపత్యానికి బ్రిటన్ అంగీకరించి సూయజ్ ప్రాంతాన్ని బ్రిటిష్ సైన్యాలు విడిచి

వెళ్లిపోయినట్లయితే, మిగతా రాజ్యాలతో సమాన ప్రతిపత్తితో అట్టి రక్షణవ్యవస్థలో పాల్గొనడానికి సమ్మతించగలదని ఈజిప్టుప్రభుత్వం ప్రకటించింది. కాని సూయజ్ ప్రాంతాన్ని విడిచిపెట్టడం జరగబోదని బ్రిటిష్‌ప్రభుత్వం ప్రకటించింది. సూయజ్ ప్రాంతంలో సంఘర్షణలు జరుగుతున్నాయి. ఇవి ఈజిప్టు బ్రిటన్ల మధ్య ప్రత్యక్ష సంఘర్షణగా పరిణమించినా పరిణమించకపోయినా, మధ్యప్రాచ్యంలో క్రమక్రమంగా వృద్ధిఅవుతున్న సంచలనంలో ఇదొక ముఖ్య ఘట్టమనీ, రక్షణ వ్యవస్థ స్థాపనతో ఈ సమస్య పరిష్కారం కాదనీ భావించాలి.

అగ్రరాజ్యాల మధ్య యుద్ధతంత్రాలలో చిన్న రాజ్యాలు తమకు సంభవించగల ప్రమాదాన్ని కనిపెట్టి జాగ్రత్తపడుతున్నాయి. మధ్యధరా సముద్ర తీరదేశాలలో రష్యాకు పొరుగునున్న దేశాల భయం మరింత అధికంగా ఉంది. కొరియా యుద్ధగతినిబట్టి అగ్రరాజ్యాలతో యుద్ధవ్యూహంలో చేరకుండా ఉండడానికి చిన్నరాజ్యాలు ప్రయత్నిస్తున్నాయి. ఇదివరలో బలవత్తరదేశాలు విధించిన ఒడంబడికలను రద్దుపరిచి సమాన ప్రతిపత్తితో ప్రపంచ వ్యవహారాలలో వ్యవహరించడానికి నేటి అంతర్జాతీయ పరిస్థితులు అనుకూలపడుతున్నాయి. మధ్యప్రాచ్యంలో నేటి సంచలనానికి ఇదే ముఖ్య హేతువు. ఈ సంచలనంవల్లనే మధ్య ప్రాచ్యదేశాల సమిష్టి రక్షణకు అమెరికా చేస్తున్న కృషిఫలితం సందేహాస్పదమౌతున్నది.



# కాళిదాసమహాకవి-కవితాపరిశీలన

*

శ్రీ పి. గణపతిశాస్త్రి

ప్రాచీన సంస్కృతకవులు, అలంకారిక విమర్శకులు మాత్రమే కాక ప్రపంచ మహాకవులనేకులు కాళిదాసకవితను బహువిధాలుగా ప్రశంసించారు. ఈవిధమైన ప్రశంసలందుకొన్న కాళిదాసకవితలోగల ప్రత్యేక స్వభావమేదో పరిశీలిద్దాము.

ఒక కవి కావ్యపరిశీలన చేసేటప్పుడు ఆ కవితలోగల కొన్ని ప్రత్యేక లక్షణాలు వివరించి ఈ కారణంచేత ఈ కవిత ఇంత ఆహ్లాదకరంగా ఉన్నదని చెప్పవచ్చును. కాని ఈవిధమయిన కేవల బాహ్య కారణాలు ఏకరువు పెట్టినంత మాత్రాన ఆ కవితానుభూతి పాఠకులకు సంపూర్ణంగా కలగడం చాలా కష్టము. అందులోను కాళిదాసుని కవితలో ఇటువంటి క్లిష్టత మరీ ఎక్కువగా కనిపిస్తున్నది. కవితానుభూతిగాని, ఇలాంటి మరి ఏకళానుభూతిగాని కేవలము ఆత్మానుభవ సాక్షికము. విమర్శకుకు ఈ అనుభూతికి కొన్ని కొన్ని కొలబద్దలు ఏర్పరిచి, తద్వారా కవితకు విలువలు కట్టవలసిఉంటుంది. ఈ విధమయిన కొలబద్దలు సాధారణంగా జనాంగీకృతి పొందినప్పుడు ఆ విమర్శకు సార్థకత ఏర్పడుతుంది. అయితే కాళిదాసువంటి మహాకవుల కవిత ఎంతగా ఈ కొలబద్దలతో కొలుచుకుంటూ వెళ్ళినా కవితా తత్త్వమేదో చేతికందకూడా దూరదూరంగా పోతూన్నట్టనిపిస్తుంది.

కాళిదాసకవితకు ఇంతవరకు తెలుగులో బయలుదేరిన అనువాదాలయినా ఈ విషయంలో అంతగా సహాయకారులు కావడంలేదు. దురదృష్టవశాత్తు ఇంతవరకు వచ్చిన ఆంధ్రానువాదాలు ఛాయామాత్రంగానే ఉండిపోయాయి. వీటివల్ల మూలకవితా మాధుర్యం పదోవంతైనా పాఠకులకు అందడంలేదంటే అది అతిశయోక్తి కాదు. నన్నయవంటి మహాకవి ఎవరైనా ఈ అనువాదానికి పూనుకొనిఉంటే తెలుగులో కాళిదాస కవిత సర్వాంగసుందరంగా అవతరించిఉండేది—అయితే ఇలాంటి ఊహావాదాలవల్లా ప్రయోజనం శూన్యమే!

ఇందుచేత, ఏవో కొన్ని ప్రమాణాలతో కాళిదాస కవితా పరిశీలనం కంటె గత్యంతరం ఏమీ లేదు. ఈ విషయంలో ప్రాచీనులు అవలంబించిన పద్ధతులు ఎంతవరకు సహాయకారులుగా ఉన్నాయో చూదాము.

ప్రాచీనకాలంనుంచి కాళిదాసుని ఉపమాలంకారం ప్రశస్తమైనదని ఒక విమర్శకసంప్రదాయం ఏర్పడ్డది. దీనికి ఆధారభూతమైనది ఉద్భటుని శ్లోకము.

ఈ శ్లోకం ఇది—

ఉపమా కాళిదాసస్య భారవే రర్థ గౌరవమ్
దండినః పదలాలిత్యమ్ మాఘే సంతి త్రయోగుణాః

'కాళిదాసుని ఉపమాలంకారము, భారవికవి అర్థగౌరవము, దండిపదలాలిత్యము, ఈ మూడు గుణాలు మాఘునిలో ఉన్నవి' అని దీని అర్థము.

ఈ శ్లోకం మొదటిపాదంలోని 'కాళిదాసుని ఉపమాలంకారము ప్రశస్తమైన' దన్న వాక్యభాగం ఒకటే నిశితమైన విమర్శక దృష్టితో వ్రాసినట్లు కనిపిస్తున్నది. కాళిదాసునిలో ఉపమాశక్తి మాఘునిలో ఉన్న దనడం అతిశయోక్తిగా కనిపిస్తున్నది. కాని కాళిదాసుని ఉపమలో ఒక విశిష్టత కలదని మొట్టమొదటగా గుర్తించినవాడీ ఉద్భటుడే. ఈ క్రింది ఉదాహరణవల్ల కాళిదాసుని ఉపమాస్వభావం కొంతవరకు గ్రహించవచ్చును. ఇది రఘువంశంలో ఇందుమతీ స్వయంవర ఘట్టంలోని శ్లోకము. స్వయంవరంలో రాజులందరు బారులుతీర్చి కూర్చున్నారు. ఇందుమతి సంచరించే దీపశిఖలా వారి మధ్యనించి నడిచిపోతున్నది. ఆమె అతిక్రమించిపోగానే వెనకబడిపోయిన రాజులలో ఆమె ఇక తమరిని వరింపగలదనే ఆశ అంతరించిపోయింది. ఈవిధంగా నిరాశోపహతులైన రాజులందరు రాజమార్గంలో ఒక దీప

ణ్యాల సాగిపోతున్నప్పుడు వెనకబడిపోయిన గృహ శ్రేణిలా ఉన్నారని కవి ఈ శ్లోకంలో వర్ణిస్తున్నాడు.

రఘువంశంలో ఈ అభిప్రాయంగల శ్లోకం ఇది:—

సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ
యం యం వ్యతీయాయ పతింవరా సా
నరేంద్ర మార్గాట్ట ఇవ ప్రపేదే
వివర్ణభావం స స భూమిపాల:

ఇక్కడ కవి ఇందుమతిని దీపశిఖతోను, రాజ శ్రేణిని గృహశ్రేణితోను పోలుస్తున్నాడు. ఇక్కడి అత్యాసక్తితో నిరీక్షిస్తున్న రాజుల చిత్తవృత్తి, ఇందుమతి దాటిపోగానే వారిలో కలిగిన నైరాశ్యము, ఇందుమతీసౌందర్యము, నిశ్చలంగా నిరీక్షిస్తున్న రాజుల ఏకాగ్రత, మొదలైన భావాలెన్నో కవి వ్యంగ్యంగా సూచిస్తున్నాడు. ఇక్కడ కవి వాడి ఉపమాలంకారం బలంవల్ల రాజశ్రేణి, ఇందుమతీసంచారము, రాజుల మనఃప్రవృత్తి, వారి ముఖవికారాలు మొదలైన వన్నో క్షణంలో మన భావనానేత్రాలయెదుట గోచరిస్తున్నాయి. ఈవిధంగా కాళిదాసుని ఉపమాలంకారం నిమిత్త మాత్రంగా ఉండి మనలో భావనామయమైన విచిత్ర జగత్తును సృష్టిస్తున్నది.

కాళిదాసుని ఉపమాలంకారం ఉదాత్తమైనది అని చెప్పినంతమాత్రాన అతని కవితాస్వభావం సంపూర్ణంగా చిత్రింపబడడం లేదు. ఉద్భటుడు మాఘుని గురించి చెప్పిన వెనక శ్లోకం అతిశయోక్తిపూరితంగా ఉన్నదని అనుకున్నాము. మాఘుడేకాక ఇంకా ఇతర సంస్కృతకవులు అనేకులు ఉపమాలంకారాలు వాడారు. ఆలంకారికులు చెప్పిన ఉపమానము, ఉపమేయము, సమానధర్మము, వాచకపదము ఉంటే అది ఉపమాలంకారం అవుతుంది. కాళిదాసులోని ఉపమ ప్రశస్తంగా ఉన్నదన్నప్పుడు మిగిలిన కవులలో లేని ఈ ప్రాశస్త్యానికి కారణాలన్వేషించవలసి ఉన్నది. ఈ ప్రాశస్త్యం వివరిస్తేతప్ప కాళిదాస కవితా స్వభావం సంపూర్ణంగా విశదం కాదు. అందుచేత ఉద్భటసూక్తి ఇంచుమించుగా అర్థోక్తిగానే ఉండి పోయింది.

## ప్రకృతి వర్ణనం

నేటికాలంలో ప్రకృతిని ప్రత్యేకంగా వర్ణించడం ఒక కవితా సంప్రదాయంగా మారింది. కాళిదాసుకంటె ప్రాచీనులయిన వాల్మీకి వ్యాసాది కవులలో ఉదాత్తమయిన ప్రకృతివర్ణన కనిపిస్తుంది. కాని వారు చేసే ఈ ప్రకృతివర్ణన అక్కడక్కడ కథాభాగంలో ఒక ఉపాంగంగానే కనిపిస్తుంది.

ఇలా కథాభాగంతో సంబంధం లేకుండా ప్రకృతిని సహజమయిన స్వచ్ఛస్వరూపంలో దర్శించి, ప్రప్రథమంగా ప్రకృతికావ్యం రచించిన గౌరవం సంస్కృతంలో ఒక కాళిదాసకవికే దక్కింది. ఇతని ఋతుసంహారంలో కేవలం ప్రకృతి వర్ణనమే కావ్యవస్తువు. అంతకు పూర్వమేగాక ఆ తరవాత కూడా ఇలాంటి కావ్యాలింక సంస్కృతివాఙ్మయంలో బయలుదేర నేలేదు. ఈ కవి ప్రారంభించిన ఈ సంప్రదాయం మిగిలిన సంస్కృతకవులు అనుసరించకపోవడంలో కారణమేమో తెలియడం లేదు. ఈ సంప్రదాయం పోవడం క్రమంగా ఆ తరవాత బయలుదేరిన సంస్కృత కవితకొక తీరని లోపంగా పరిణమించింది. క్రమక్రమంగా సంస్కృత కావ్యాలలోని ప్రకృతివర్ణనలలో కృత్రిమత్వం ఎక్కువై సహజ సరళత్వం సన్నగిలిపోయింది.

ఋతుసంహారం గ్రీష్మర్తువర్ణనంతో ప్రారంభించి వసంత ఋతువర్ణనంతో ముగిసిపోతుంది. కవి ఈ కావ్యంలో అక్కడక్కడ ఒకేభావం అనేక సారులు వర్ణించడంవల్ల, ఇంకా కొన్ని శాబ్దికలోపాలవల్ల ఇది కాళిదాస విరచితం కాదేమో నని అనుమానం కొందరు విమర్శకులకు కలిగింది. కాని అరవిందులు - మరికొందరు సుప్రసిద్ధ విమర్శకులు ఈ కావ్యం కవి ప్రథమ రచన అయి ఉండవచ్చునని దీనిలో కాళిదాస కవితా లక్షణాలు ప్రాథమికావస్థలో ఉన్నాయనీ నిరూపించారు.

ఋతుసంహార ప్రకృతి వర్ణనలో ఒక ప్రత్యేకత ఉన్నది. కవి ఆయా ఋతువులలో సహజమైన ప్రకృతి స్వభావాన్నే ఎక్కువగా వర్ణించాడు. అక్కడక్కడ కవివర్ణన అలంకార యుక్తంగా ఉన్నా, ఈ అలంకారాలు సహజ ప్రకృతి సౌందర్యం కప్పివుచ్చవు. ఈ వర్ణనలలోని మృగపక్ష్యాదుల స్వభావాల సునిశిత పరిశీలన కవికి వీటియెడగల పరిపూర్ణ దాక్షిణ్యం స్ఫురింపజేస్తుంది. ఇది ఈతని ప్రకృతి కవితలో కనిపించే ప్రత్యేక స్వభావము.

కాళిదాసకవి ప్రకృతి వర్ణనలో ముఖ్యంగా స్మరింపదగినగుణం ఇంకొకటి ఉన్నది. సామాన్య కవులు ఏదైనా ఒక ఋతుస్వభావం చిత్రించదలిచి నప్పుడు ఆ ఋతువులో కనబడే స్వభావాలన్నీ గుచ్చి గుచ్చి ఏకరువు పెడతారు. కాని కాళిదాసకవి ఈ పంథా అవలంబించక ఆ ప్రత్యేక సమయంలోని ఒక అత్యంత ప్రత్యేక స్వభావం పాఠకుల ఎదట ఒకే రేఖలో కన్నులకు కట్టేటట్టు చేస్తాడు. ఈ సందర్భంలో గ్రీష్మర్తుతాపాధిక్యం ఒక మెరపులో హృదయానికి హత్తించే ఈ క్రిందిశ్లోకం పరిశీలింపదగినది. దీనిలో కవి, తీవ్రమైన ఎండవేడిమివల్ల కళకళ ఉడుకుతున్న బురదలోనుండి ఎగిరివచ్చిన కప్ప, దప్పిగొన్న పాము పడగనీడకు వచ్చి చేరుకున్నదని వర్ణిస్తున్నాడు. ఎండ తీవ్రతవల్ల దృష్టికూడా దీనికి తిన్నగా ఆనడంలేదనీ, ఈ పరిస్థితిలో కప్ప సహజంగా తన శత్రువైన పాముపడగ నీడక్రిందికే చేరిందనీ, కవి వర్ణిస్తున్నాడు. దీనివల్ల గ్రీష్మాతప తీవ్రత ఒక్క మెరపులో పాఠకుల కళ్లయెదుట ప్రత్యక్షం అవుతున్నది. ఇక్కడ ఈ సన్నివేశం వర్ణించే మూల శ్లోకం ఉదాహరిస్తున్నాను.

"వివస్వతా తీక్ష్ణతరాంశుమాలినా
సపంకతోయాత్సరసోభితాపితః
ఉత్ప్లుత్య భేకః తృషితస్య భోగినః
ఫణాతపత్రస్య తలే నిషీదతి"

కాళిదాస ప్రకృతి వర్ణనంలో ఇంకొక విశేషం ఉన్నది. ఇతడు సహజ ప్రకృతినే వర్ణించినా స్వభావ సుందరములయిన ప్రకృతి సన్నివేశాలే వర్ణిస్తాడు గాని, అసుందరములయిన ప్రకృతి సన్నివేశాల వర్ణన కుపక్రమించడు.

కాళిదాస కావ్యాలన్నింటిలోను కవికిగల సహజ ప్రకృతి దాక్షిణ్యము, మృగపక్షి స్వభావ పరిశీలనము ఆయా ఘట్టాలలో కనిపిస్తూనే ఉంటాయి. అయినా ప్రత్యేకంగా ప్రకృతి వర్ణన పరమైన ఖండకావ్య రచనబట్టి ఈ కవికిగల ప్రకృతి రామణీయకాభినివేశం గ్రహించవచ్చును.

ఈ కావ్యంలో ఇంకా విశేషం ఉన్నది. ఇది కవి తన ప్రియురాలిని గురించి సంబోధిస్తూ వ్రాసిన కావ్యము. అనేక శ్లోకాలలో 'ప్రియే' అనే సంబోధన కనిపిస్తున్నది. ఈవిధంగా కవి ఉత్తమ పురుషలో ప్రకృతిని వర్ణిస్తూ ఆత్మగతమైన కావ్యం చెప్పడం సంస్కృతంలో మొట్టమొదటగా ఋతుసంహారంతోనే ప్రారంభమయింది. దీనినిబట్టి ఆ కాలంలోనే ఈ కవి కవితారచనలో ఎలాంటి నూతనమార్గం అవలంబించినదీ గ్రహించుకోవచ్చును.

వస్తువర్ణనలో కాళిదాసు విశిష్టమైన సూక్ష్మ పద్ధతి అవలంబిస్తున్నాడని అనుకున్నాము. ఇతని కావ్యాలలో అంతటా ఇలాంటి సూక్ష్మపద్ధతి కనిపిస్తూనే ఉంటుంది.

ఉదాహరణకు రఘువంశంలో ౧౬ వ సర్గలో పాడుపడిపోయిన అయోధ్యాపురవర్ణనం తీసుకుందాము. దీనిలో మొత్తం పన్నెండు శ్లోకాలుమాత్రమే ఉన్నాయి. ఈఘట్టం అంతా ఉజ్జ్వలమైన కాళిదాస వస్తువర్ణనకు ఉత్తమోదాహరణము. దీనిలో నుంచి ఒక శ్లోకంమాత్రమే ఈ క్రింద ఉదాహరిస్తున్నాను.

దీనిలో కవి ప్రస్తుతం పాడుపడిపోయి ఉన్న దీనావస్థతోపాటు ప్రాచీననగరసౌందర్యం కూడా ఒకే రేఖలో భాసింపచేస్తాడు. ఈ క్రింది శ్లోకంలో కవి పెంపుడునెమళ్లు తిరిగి అడవినెమళ్ళుగా మారిపోయాయని వర్ణిస్తున్నాడు. ఇవి శయనించే పీఠాలు విరిగిపోయాయి. అందుచేత ఇవి చెట్ల కొమ్మలమీదనే నిద్రిస్తున్నాయి. పూర్వం నగరం సజీవంగా ఉండే టప్పుడు వీటిని పెంచే వారులు మద్దెల ధ్వనులతో వీటిచేత నృత్యం చేయించేవారు. ఇప్పు డది లేక పోవడంవల్ల వీటికి నృత్యంచేసే అలవాటే తప్పిపోయింది. అదిగాక దావాగ్నికణం సోకి వీటి పింఛాలు చాలావరకు కాలిపోయి కొంచెం కొంచెం మాత్రమే మిగిలిఉన్నాయి. ఇలాంటి పరిస్థితులలో ఇవి క్రమంగా అడవినెమళ్ళుగా మారిపోయాయని కవివర్ణన. పాఠకుల పరిశీలనార్థం ఇక్కడ ఈ అభిప్రాయంగల శ్లోకం ఉదాహరిస్తున్నాను.

"వృత్తేశయా యష్టినివాస భంగా
న్మృదంగశబ్దాపగమా దలాస్యాః
ప్రాప్తా దవోల్కాహత శేషబర్హాః
క్రీడామయూరా వనబర్హిణత్వమ్."

ఇక్కడ "దవోల్కాహితశేషబర్హాః" అనే విశేషణం ప్రత్యేకంగా పరిశీలింపదగినది. ఈ

నెమళ్లపురులు దావాగ్నికణాలవల్ల కాలిపోయి, శేషించియున్నాయని దీని అర్థము.

అడవిలో పుట్టి పెరిగిన నెమళ్ళకు సహజంగా దావాగ్నికణాలు పడకుండా తమ పింఛాలు సంరక్షించుకునే శక్తి ఉంటుంది. కాని ఇవి చిన్నప్పటి నించీ పట్టణంలో పెంచిన నెమళ్లు. అందుచేత వీటికి దావాగ్నిపరిజ్ఞానమే. లేదు. ఇందుచేతనే వీటి పింఛాలు దావాగ్నికి ఆహుతిఅయిపోయి, ఇవి అత్యంత దీనావస్థలో పడిపోయాయని కవి ధ్వనింపచేస్తున్నాడు.

కుశుడు అయోధ్యానగరం విడిచి వెళ్లిన తరవాత ఆ పురదేవత కుశుని శయనాగారంలో ప్రత్యక్షమై పాడుపడిపోయిన అయోధ్యాపుర దీనావస్థ వర్ణించి, తిరిగి ఆ పట్టణానికి రావలసినదని అతన్ని ఆహ్వానిస్తుంది. ఈ ఘట్టంలోని ఈ శ్లోకంతో అయోధ్యాపురం దైన్యంఅంతా కవి ఈవిధమైన నెమళ్ల దుర్దశవర్ణనద్వారా సూక్ష్మంగా మన కళ్ళయెదుట ప్రదర్శిస్తున్నాడు.

ఇక్కడ నెమళ్ళపరిస్థితిలో కలిగే విశేషాలన్నీ సామాన్యంగా ఏ కవి అయినా వర్ణించి ఉండవచ్చును. కాని "దవోల్కాహతశేషబర్హాః" అనే విశేషణం మాత్రం అనితర సాధారణమైనది. ఈ విధమైన సూక్ష్మప్రకృతి పరిశీలనద్వారా వస్తువును ప్రదర్శించడమే కాళిదాసులోగల ప్రత్యేకత.

ఇంతేకాక ఒక్కొక్కప్పుడు ఏక పదప్రయోగంలోకూడా ఈ కవి అత్యాశ్చర్యకరంగా అనేక విషయాలు ధ్వనింపచెయ్యడం ఈతని కావ్యాలలో అనేక స్థలాలలో గమనింపవచ్చును.

పదాలు తూచితూచి వాడడము, అవి అతి సంక్షేపంగా వాడడము కాళిదాసకవితలో ప్రత్యేకంగా పేర్కొనదగిన విశేషాలు. ఈ క్రింది శ్లోకంలోని ఒక పదం దీనికి ఉదాహరణగా ఇవ్వవచ్చును.

ఈ క్రిందిది సీతాపరిత్యాగం జరిగిన తరవాత రాముడు వాల్మీకి ఆశ్రమం సందర్శించిన ఘట్టము. అప్పుడు వాల్మీకి కుశలవుల నిద్దరినీ రామునికి చూపించి, వీరు నీ కుమారులే అని చెప్పి, సీతాదేవిని తిరిగి స్వీకరించవలసిందని అర్థిస్తాడు. ఆ శ్లోకం ఇది:

"సతా వాఖ్యాయ రామస్య
మైథిలే యౌ తదాత్మజౌ
కవిః కారుణికో వవ్రే
సీతాయాః సంపరిగ్రహమ్."

రాముని సీతాపరిత్యాగకారణాలు వాల్మీకికి తెలియనివి కావు. రాముడు కూడా సీత నిర్దోషురాలని ఎరుగును. ఇదన్నీ వాల్మీకికి అవగతమే. ఈ విషయంలో రాముడు కేవలం ధార్మికుడైన ఒక నృపతిదృక్పథంతో వ్యవహరిస్తున్నాడని కూడా వాల్మీకికి తెలిసిన విషయమే. మరి వాల్మీకిమహర్షి రామునికి రాజకార్యోపదేష్ట అయిన గురువుగా వ్యవహరించవలసినదే గాని మరి ఒక విధంగా వ్యవహరించడానికి వీలులేదు. ఈ పరిస్థితులలో వాల్మీకి ఏ ముఖంతో రాముని తిరిగి సీతను స్వీకరించవలసిందని అర్థించగలడు? అయినా అతడు రాముని సీతను తిరిగి స్వీకరించవలసిందని అర్థిస్తున్నాడు. మరి దీనిలో వాల్మీకికి ధర్మవిరోధం స్ఫురించలేదా? అన్న అనుమానం ఎవరికైనా కలగవచ్చును. కనకనే కాళిదా సిక్కడ వాల్మీకికి విశేషణంగా మహర్షి అనిగాని, మరి ఏ పదంగాని వాడక "కవిః కారుణికః" అని నిర్దేశించాడు. ఇక్కడ వాల్మీకిని కాళిదాసు కవిగానే నిర్దేశించాడు. అపైన అతనికి 'కారుణికః = దయాశీలి' అనే విశేషణం వాడాడు.

కవి దయాశీలి. అతనికి ధర్మసూక్ష్మంలో ఉన్న హేతుశక్తి తెలియకపోలేదు. కాని అతడు కరుణాశీలుడు. ప్రజాధర్మనిర్వహణం అమాయికఅయిన సీత విషయంలో కేవలం క్రౌర్యంగా పరిణమించినదన్న ఆర్ద్రదృష్టితోనే అతడు తిరిగి సీతను స్వీకరించవలసిందని అర్థించాడు. కారుణికుడైన కవి వాల్మీకి సామాన్య ధర్మదృష్టికి అతీతమైన కారుణికదృష్టితో వ్యవహరిస్తున్నాడని సూచించడానికే కాళిదా సీ ఘట్టంలో కవికి 'కారుణిక' విశేషణం వాడి సూక్ష్మంగా ఈ విషయాలన్నీ ధ్వనింపచేస్తున్నాడు.

ఈ విధంగా సంక్షిప్త పదాలతో ప్రకృత్యాది వర్ణనలలోనే కాక, సంభాషణాదులలోనూ పాత్ర మనోభావ వివరణం ప్రదర్శించడంలో ఈ కవి సిద్ధహస్తుడు. ఈ విషయంలో రఘువంశంలో లక్ష్మణుడు సీతాదేవిని అడవిలో విడిచిపెట్టి వెళ్లబోతున్నప్పుడు ఆమె లక్ష్మణునితో అన్న

మాటలు గంభీరమైన సీతాదేవి హృదయవేదనను, సహజౌన్నత్యానికీ నిశితవ్యంగ్యానికీ తార్కాణంగా ఉన్నాయి. లక్ష్మణునితో ఆమె అన్న మాటలన్నీ కవి తొమ్మిది చిన్న శ్లోకాలలోనే ముగించివేశాడు. ఈ సంభాషణలో మొట్టమొదటగా ఆమె అత్తగార లందరికీ నమస్కరించి తన గర్భంలో ఉన్న శిశువునైనా స్మరిస్తూ ఉండవలసినదని వారికి సందేశం పంపిస్తుంది.

ఇది ఎంత గంభీరమైన సందేశము! వృద్ధస్త్రీలకు మనమలపై మమకారం సహజం. "నా మీద మీకు వాత్సల్యం లేకపోవచ్చునుగాని మీ పౌత్రుని విషయంలోనైనా కొంచెం వాత్సల్యం కనబరచవలసిం"దని ఆమె అభిప్రాయం! ఇల్లాగే ఈ వాక్యంలో ఎన్నో గూఢధ్వనులు పాఠకుల హృదయాలలో ప్రతిధ్వనిస్తాయి.

ఈ తరువాతి శ్లోకంలో ఆమె రామునికి సందేశం పంపిస్తూ "వాచ్యస్త్వయా మద్వచనాత్ స రాజా" అని అంటుంది. "నా మాటగా ఆ రాజుతో ఇలా చెప్పవలసింది!" అని ఈ మాట కర్థం! ఇక్కడ గూడ రాజన్న మాటలో కవి నిక్షేపించిన వ్యంగ్యం చాలా గంభీరమైనది.

రాజధర్మ నిర్వహణ విషయంలో రామునికామె పంపించిన సందేశం మరింత వ్యంగ్యపూరితమైనది.

ఈ శ్లోకంలో ఆమె "నృపులకు వర్ణాశ్రమ పరిపాలనము మనువు విధించినది. నీవు నన్ను గృహంనించి అడవుల వసింపించినా తపస్వుల రక్షణ నీకు విహితము కాబట్టి ఆ తపస్వులతో సమానంగానైనా నన్ను పరిపాలింపవలసిన"దని రామునికి సందేశం పంపిస్తుంది. ఇది ఇక్కడ ఉదాహరిస్తున్నాను.

"నృపస్య వర్ణాశ్రమ పాలనం యత్
స ఏవ ధర్మో మను నా ప్రణీతః
నిర్వాసితా ప్యేవ మతస్త్వయాహం
తపస్వి సామాన్య మవేక్షణీయా."

ఈ శ్లోకంలో పదాలన్నీ గూడా వ్యంగ్యార్థపూరితాలే. వీటిలో తపస్విపదం మరింత నిగూఢమైనది. ఈ పదానికి "తపస్సు చేసుకొనేవాడు", "దీనుడు" అని రెండర్థాలున్నాయి. "దీనరక్షణం నీకు విహితంకాబట్టి దీనురాలనైన నా రక్షణం రాజధర్మం పరిపాలించే నీకు అవశ్యకర్తవ్యము. అనే అర్థం ఈ పదంవల్ల స్ఫురిస్తున్నది. నీవు నన్ను వదలగొట్టుకొన్నా నా సంరక్షణభారము నీపై ఉన్నదనీ, నీ రాజధర్మం ఈ విధంగా పరిణమించినదనీ కూడా ఈ శ్లోకంవల్ల ద్యోతకమవుతున్నది.

వర్ణనలు, సంభాషణలు, స్వభావచిత్రణాలు, కథా కథనము మొదలైన విషయాలన్నీ అతి సంక్షిప్త పదవిన్యాసంతో నడిపించుకుపోవడంలో ఈ కవి కౌశలం వర్ణనాతీతము.

కవి కవిగా తన హృదయభావాలు వ్యక్తపరిచే ఆధునిక కవిత్వపద్ధతి ఋతుసంహారకావ్యంతోనే ప్రారంభం అయింది. ఆలంకారికుల లక్షణాలను బట్టి చూచినా ఆధునికుల నిర్వచనాన్ని బట్టి చూచినా ఋతుసంహార మేఘసందేశాలు రెండూ 'ఖండ' కావ్యాలే. ఋతుసంహారంలో ప్రత్యక్షంగా కవే ప్రకృతివర్ణన కుపక్రమిస్తున్నాడు.

కాని మేఘసందేశంలో ఒక చిన్న తెరమరుగున ఉండి తన హృదయభావం వ్యక్తీకరించినట్టు కనబడుతుంది. అందుచేతనే మేఘ సందేశనాయకుడైన యక్షుని పేరైనా చెప్పకుండా కవి అతన్ని 'ఒకానొకడు' అనే మాటతోనే నిర్దేశించి ఊరుకున్నాడు. దీనిలో కథాభాగం అంతా రెండు మూడు శ్లోకాలలో ముగిసిపోతుంది. అసలిది ఒక కథగా చెప్పాలనే ఉద్దేశంతో ప్రారంభింపబడిన కావ్యం కానేకాదు. నిజానికి కావ్యం యక్షుని సందేశంతోనే ముగిసిపోతుంది. కవి నిగూఢవ్యంగ్యం తెలియని ప్రాచీను లెవరో మేఘుడు యక్షుని భార్యకు ఆ సందేశం తీసుకుపోయాడనే కథ ఒకటి అల్లి అది రెండు శ్లోకాలతో ముగించారు. మేఘసందేశం సామాన్యంగా పఠించినవారికి శ్లోకాల అసంబద్ధత సులభంగా తెలిసిపోతుంది. కనకనే ఈ కావ్యంలో కూడా కవి ఋతుసంహారంలో మోస్తరుగానే స్వీయ భావాలే ప్రకటిస్తున్నట్లు కనిపిస్తుంది. ఋతుసంహారంలో ప్రకృతివర్ణనకే ప్రాధాన్యము. కవి ఆయా కాలాలలోని శృంగారభావవర్ణన చేసినా అది తటస్థ భావంతో చేసినదే.

## మేఘసందేశము

కాని మేఘసందేశంలో కవి యక్షుడనే యవనికాంతరితుడై తన భావాలే ప్రకటిస్తున్న విషయం

సుస్పష్టమే. అందుచేత ఋతుసంహారం ప్రకృతి వర్ణనపరమైన కావ్యంగానూ, మేఘసందేశం స్వీయ ప్రేమభావ ప్రకటనపరమైన కావ్యంగానూ కవి ఉద్దేశించినట్లు కనిపిస్తున్నది.

ఎందుచేతనో గాని ఋతుసంహారంకంటె ప్రకృతివర్ణనపరమైన కావ్యాలు సంస్కృతంలో బయలుదేరలేదని ఇదివరకే అనుకున్నాము—

కాని మేఘసందేశానికి అనేకమైన అనుకరణ కావ్యాలు బయలుదేరాయి.

ఈ అనుకరణంలో ఆయా రచయితలు అనేక విధాలుగా ఉపయోగించారు. జైనకవి ఒకడు నేమి దూతం అనే పేరుతో ఒక కావ్యం రచించాడు. కాని అది జైనధర్మపరమైన కావ్యమని తెలుస్తున్నది. ఇల్లాగే హంససందేశం మొదలైన ఇతర కావ్యాలు కూడా ఈ కావ్యానుకరణాలుగానే బయలు దేరాయి.

కాని ఇంత ఉదాత్త గంభీరమయిన ప్రేమ భావం సందేశరూపంగా మరి ఏ అనుకరణకావ్యం లోను అవతరించలేదు. అనుకరణకావ్య లీలా తీరూరవడం ఆశ్చర్య మేమీ లేదు!

మేఘసందేశ రచనకాలానికి ఋతుసంహా రంలో కనిపించిన రచనా దోషాలన్నీ తొలగిపోయి కాళిదాసశైలి సంపూర్ణమైన పరిణతి గాంభీర్యంతో ప్రవహిస్తుంది.

మొత్తంమీద కాళిదాసు రచించిన వాటను కావ్యాలలోను రెండు ఖండకావ్యాలు. మిగిలిన రఘువంశ కుమారసంభవాలు రెండు మహా కావ్యాలు. వీటిలో ఋతుసంహారం ప్రకృతివర్ణన పరమైన కావ్యము. మేఘసందేశం కవిహృదయాం తర్నిహితమైన ప్రేమభావవ్యంజకమైన కావ్యమని చెప్పవచ్చును.

రచనాపరిస్థితినిబట్టి చూస్తే ఖండ కావ్యాలు రెండు కవి యౌవనప్రాదుర్భావంలో రచించినట్లు కనిపిస్తుంది. మిగిలిన మహా కావ్యాలలో రఘువం శంలో కవి తన ధార్మికదృక్పథం సంపూర్ణంగా వివరించినట్లు కనిపిస్తున్నది. ఇక కుమారసంభవం కవి జీవితంపై తనకుగల ఆధ్యాత్మికదృక్పథం వివ రించడానికి వ్రాసినట్లు కనిపిస్తుంది.

ఇక కాళిదాస విరచితమైనదని చెప్పబడుతున్న "కుంతేశ్వర దౌత్యము" మేఘసందేశంవంటి కావ్యమే అయివుండవలెనని ఊహించవచ్చును. కాని ఈ కావ్యంలో కొన్ని శ్లోకాలే మన కిప్పుడు లభించివుండడంవల్ల దీనినిగూర్చి మన మేమీ వివ రంగా చెప్పలేము.

## వృత్తరచన

కాళిదాసు శైలీస్వభావం పరిశీలించేముందు అతడు వేర్వేరు కావ్యాలలో వాడిన వేర్వేరు వృత్తాల రచనలోని అంతరార్థం గమనించడం చాలా ముఖ్యం. నిజానికితని కవితలోని ఛందోవైవిధ్యం మన తెలుగులో కూడా ఇంతవరకు రానేలేదని చెప్పాలి.

కాళిదాసుకంటె ప్రాచీనులయిన వాల్మీకి వ్యాసాదులు తమ రచనలలో అనుష్టుప్ ఛందస్సులోని శ్లోకమే విశేషంగా వాడారు. సర్గల చివరలలో మాత్రం వీరు అక్కడక్కడ వేర్వేరు వృత్తాలు వాడారు.

కాళిదాసుమాత్రం తన కావ్యాలలో అంతటా వర్ణ్య విషయాలనుబట్టి చిత్రవిచిత్రములయిన రకరకాల ఛందస్సులు వాడడంవల్ల ఇతడీ విషయంలో సంస్కృత కవితలో ఎలాంటి కొత్త కొత్తదారులు త్రొక్కినదీ గమనించవచ్చును.

ఇతడే వృత్తం రచించినా పరిపూర్ణాభి కారంతో దాన్ని నిర్వహించుకుంటూ రచన సాగిం చుకు పోయాడు. అందులోను ఇతని మందాక్రాంతా వృత్తం పరిణతి పరాకాష్ఠ నొందిన రచన. కాళిదాసు మేఘసందేశం అంతటా మందాక్రాంతా వృత్తం వాడినసంగతి మేఘసందేశపాఠకుల కందరికీ సువి దితమే—ఈ వృత్తమాధుర్యం చవి చూపించడానికి మేఘసందేశంలోనించి ఒక ఉదాహరణం ఇస్తు న్నాను.

"విద్యుద్వన్తం లలితవనితాః
సేంద్రచాపం సచిత్రాః
సంగీతాయ ప్రహతమురజాః
స్నిగ్ధగంభీర ఘోషమ్
అంతస్తోయం మణిమయభువః
తుంగ మభ్రంలిహాగ్రాః
ప్రాసాదా స్త్వాం తులయితు
మలం యత్ర తై స్తై ర్విశేషైః"

మేఘసందేశంలోని విషయానికి ఇటువంటి వృత్తి రచన అత్యంతానుకూల మైనది.

సామాన్యంగా కథా కథనంలో కాళిదాసు చిన్న శ్లోకాలే వాడుతూంటాడు. రఘువంశంలోని ప్రథమ దశమ సర్గలు దీని కుదాహరణాలు.

కథా కథనం కొక్క ఒక మెట్టు పైకిపోయిన వర్ణ్యవిషయాలు వచ్చినప్పుడు ఇతనికి వంశస్థ వృత్తం లాంటి వృత్తాలు వాడటం అలవాటు.

రఘువంశంలో తొమ్మిదవ సర్గలో దశరథుని వేట, మునిశాపము కథాఘట్టాలు. వేట ప్రారంభించే వరకు ఇంచుమించుగా ఇతను ద్రుతవిలంబితవృత్తం వాడాడు. ఈ వృత్తం సహజంగానే కదం తొక్కినట్టు నడుస్తుంది. అందులోను కాళిదాసు చేతిలో ఇది మరింత సొగసుగా అడుగులు వేసింది. ఉదాహరణకు ఒక వృత్తం:—

పితు రనంతర ముత్తర కోసలాన్
సమధిగమ్య సమాధి జితేంద్రియః
దశరథః ప్రశశాస మహీతలీం
యమవతా మవతాం చ ధురిస్థితః.

ఇంకా ఈ సర్గలో ఆయా మృగాలవేట సందర్భంలో కాళిదాసు చిత్ర విచిత్రమైన వృత్తాలెన్నో రచించాడు.

కుమారసంభవంలో కామదహనం అయిపోయిన తరవాత రతీవిలాప ఘట్టంలో ఈ కవి వాడిన వియోగినీవృత్తం ప్రత్యేకంగా పేర్కొనదగినది.

అసలు ఈ వృత్తం పేరులోనే వియోగసూచన ఉన్నది. అదీగాక ఈ వృత్తం నడకలోనే కొంత విషాదసూచన ఉన్నది.

అథ సా పున రేవ విహ్వలా
వసుధాలింగన ధూసర స్తనీ
విలలాప వికీర్ణ మూర్ధజా
సమ దుఃఖా మివ కుర్వతీ స్థలీం."

## కావ్యశైలి

కాళిదాసుని కావ్యశైలి—మిగిలిన సంస్కృత కవుల శైలిదృష్ట్యా చూస్తే—చాలా సులభమైన శైలి. మనదేశంలో సంస్కృతం ప్రారంభించేవారు సులభ్యాసంకోసం కాళిదాసకావ్యాలు మొదట పఠించటం దీనికి తార్కాణము. ఇతని సమాసాలు సామాన్యంగా ఎక్కడో గాని రెండు మూడు పదాలకు మించవు. తెలుగుభాషలో ఉన్నట్లు సంస్కృతంలో యతి ప్రాసలు లేవన్న విషయం అందరికీ తెలిసినదే. సంస్కృతంలో యతి ఉన్నది గాని ఇది నియమిత స్థలాలలో పదాల విరుపులకు సంబంధించింది. అంతే గాని అక్షరాలకు సమానాక్షరాలు వచ్చే యతిప్రశంస సంస్కృతంలో లేనే లేదు.

కాళిదాసశైలి మాధుర్యపూర్ణమైనదే. కాని ఈ మాధుర్యం చప్పని మెత్తని పదాలతో ఏర్పడిన సారహీనమాధుర్యం కాదు. అతి కఠినమైన అక్షరాలు కూడా ఇతని కవితాధారలో దొర్లిపోతూంటాయి. కాని వీటికి సమీపాక్షర సమూహంలో వీటికి చిత్రమైన మధురధ్వని వస్తుంది.

దీనికి రఘువంశంలోని ఈ క్రింది శ్లోకం పరిశీలించదగినది.

"అథ ప్రజానా మధిపః ప్రభాతే
జాయాప్రతిగ్రాహిత గంధమాల్యాం
వనాయ పీత ప్రతిబద్ధవత్సాం
యశోధనో ధేను మృషే ర్ముమోచ."

కాళిదాసకవితలో వ్యాకరణదుష్టప్రయోగాలు లేనే లేవు. 'త్రియంబకం' వంటి ప్రయోగాలు కొన్ని అపాణినీయ ప్రయోగాలే. కాని ఇలాంటివి వేళ్ళతో లెక్క పెట్టవచ్చును.

ఈ ప్రయోగాలు దిద్దడానికి ఆ కాలపు వ్యాఖ్యాతలు సాహసించలేదు. కాళిదాస వ్యాఖ్యాత మల్లినాథుడు ఈ అపాణినీయ ప్రయోగాలే స్వీకరించి ఇవి మహాకవి ప్రయోగాలు కనక సాధువులని సమర్థించాడు.

నిజానికి కాళిదాస కవితానుభూతికి అతని కావ్యపఠనమే ప్రధాన మార్గము. విమర్శన ఎంత ప్రయత్నించినా దిగ్దర్శకంగా మాత్రమే ఉండగలదు. ఇంతవరకు కాళిదాసకావ్యాలపై వచ్చిన విమర్శన చాలా స్వల్పం. ఆధునికులు నేటికాలపు విమర్శన దృక్పథాలతో కాళిదాసకావ్యాలు పరిశీలించవలసి ఉన్నది. కేవలం దిగ్దర్శకమైన ఈ వ్యాసం కాళిదాసకవితపై నూతనాభిరుచి ప్రేరేపించగలదని ఆశిస్తున్నాను.

# *వెంపటి నాగభూషణం



శ్రీ జ. రుక్మిణీనాథశాస్త్రి

అతిద్రుత గతికల కాలాన్ని అవగాహన చేసుకోడానికే మహామహులు మల్లాగుల్లాలు పడుతూంటారు. ఆరాట మేమిగిలి—అనుకున్న దంతా హారతి కర్పూరమైపోయిన ఘట్టాలు కోకొల్లలుగా కనిపిస్తాయి. కాలగతిని—అందుకోవడం కష్టం. కాని—వెంపటి నాగభూషణం, కాలగతిని, కావాలని తీసిక్కి కొట్టాడా అనిపిస్తుంది, తీరా అయిపోయింతరువాత పరకాయించి చూస్తే—

కావలసిన హంగులు సమకూర్చుకోడానికే—పాద శతాబ్దంపైగా పడుతుంది. సాధనామార్గం, సానాక్రమం — నడుస్తూండగా— ఓపాటిదైనా— సిద్ధి అంటూ చేపట్టేసరికే—మరో దశ అయిపోతుంది.

తాను—అన్నది పదుగురి కంటపడడానికి, తాను అనుకున్నది జరపడానికి అనువైన ప్రౌఢ నిర్భర వయః పరిపాక ప్రారంభంలోనే—మృత్యువుకు అతిథి కావడం అన్యాయం. వెంపటి నాగభూషణం ఈ అన్యాయానికి గురి అయినాడు. అతని మేధా వద సాధారణ గాథలు—విద్యారంగంలో—విద్యావేత్తగా అతను కావించిన కృషి ఆ ప్రౌఢిమా మన తెలుగులకు పసిగా లేకపోయినా సుమారుగానైనా తెలియక పూర్వమే, కథకుడు భూషణం, కథావశేషుడు కావడం, దురదృష్టం.

మనస్ఫూర్తిగా మృత్యువుతో కుస్తీపట్టినా మరి ఎంతో కాలం మనగల వాడు గూడాను.

చివరికి అదే అనిపిస్తుంది. తెలిసి తెలిసి—అపరిమితమైన ద్రుతగతితో—జీవిత నౌకను నడుపుకున్నాడా అని.

మహనీయులూ, విద్యార్థి కల్పతరువూ—ధిషణాధురంధరులూ అని పేరువడసిన వెంపటి లక్ష్మీనరసింహంగారి కుమారుడు అయినందున, 'పితేవపుత్రం' అన్నట్లు—ఇతనూ విద్యారంగంలోనే విగత జీవుడైనాడు.

తండ్రిగారివలె తనయుడూ ఆజానుబాహుడు. ఎంతమందిలో ఉన్నా కొట్టవచ్చే విగ్రహం. ఆకార పుష్టికి నోచుకోని అనేకాంధ్ర సోదరులలో—పీఠికి—నాదైన మనిషి నాగభూషణం!

'అతని ఆకృతిచూసి కాయముపసంకు' అన్నట్లోక్తికి అన్వర్థమైన దేహసంపద అతనిది. స్నేహితుల మధ్యనున్నా, పదిమంది పెద్దల సమక్షంలోనైనా—ఏకొత్త వాణ్ణయినా—ఆకట్టుకలిగేది ఆ గంభీర విగ్రహం: కొంత బెదురుకలిగి కొంత చొరవను కలిగించగల సత్తావుంది!

* * * *

డి. వి. సుబ్బారావుగారు మున్నగు స్నేహితులు డింగీ షికారు పోతున్నారు. ముందూ వెనకా ఆలోచించనీయని సరదావల్ల—పడవ నడిపే కర్ణధారిని పంపించేశారు. ఒయ్యారంగా పడవ కులికి, నడక సాగించింది.

సందర్భం సరదాను మించిపోతోంది. నాగభూషణం తప్ప మిగతా మిత్రమండలికి, అనుమానం, భీతాహంగా మారే స్థితివచ్చింది. పడవ అర్భుడిలాగా అటూ యిటూ అవుతోంది. నాగభూషణం కదలకుండా మెదలకుండా, నడిమికి వచ్చి—మఠం వేసుక్కూచున్నాడు. ఎంతమంది ఉన్నా ఇతగాడి తోతంతో పడవ బాలెన్సు అయింది. ప్రాణాలు కుదుటబడ్డాయి. ఉపద్రవాన్ని ఉపాయంతో తప్పుకున్నారు. నాగభూషణం-పదిమంది మనుష్యులు పెట్టు.

ఆకారంలోనే కాక అంతరంగంలో గూడా అతను అంతే. అనుకున్న దాన్ని అంత బలంతో నూ

---

* ౧౩. ౧౦. ౧౯౫౧ న అమ్రేలీలో-*V.N.B* మరణించాడని వార్త. అంధేరీలోని భావన్ కాలేజీకి ప్రిన్సిపాల్ ఐ—అస్వస్థత పాలై—ఆరోగ్య యాత్రలో—అంతా అయిపోయిందట.

సాధించేవాడు. అంతవరకూ అతనికి తోచేది కాదు. పోటీ పడడంలో ఘనా పాటీ. పోటీ పడి పీటీచేసిగాని పట్టు విడిచే వాడు కాదు.

పల్లటూరు సోమనాథం ***Gold Smith of Godugupeta, Milton of Masulipatam,*** అని అప్పటికే ప్రచారకర్త అవుతున్నాడు.* డ్రీమర్ అని కొన్ని పద్యాలు ఆంగ్లంలో వ్రాసి ఓ చిన్న పుస్తకంగా ప్రచురించాడు. 'రవీంద్రనాథ టాగూరు' అన్న పేరును అనుసరించి, తన పేరును సోమనాథ పల్లటూరుగా మార్చుకున్నాడు. తాను ఆంగ్లకవిగా రాణించాలని దారులు కల్పించుకుంటూ ఆశలు కోరలు తీరుస్తున్నాడు.

నాగభూషణం పోటీ పడ్డాడు. ఉన్నవాడు ఉన్నట్లు—చడీ చప్పుడూ కాకుండా ఆంగ్లంలో కవనం చెప్పడానికి పూనుకున్నాడు. డ్రీమర్ గ్రంథంకంటె కూడా—బలంలో, బరువులో రెట్టింపుగా తయారుచేశాడు. పుస్తకం ప్రచురించాడు. అందాలు చందాలు, వన్నెలు, చిన్నెలతో సహా—గ్రంథం తయారైంది. ఆనంద ఏకాదశి—ముద్దు ముచ్చటలు గొలిపే గ్రంథం, గ్రంథకర్తగా నాగభూషణం మెరిశాడు ఇక సాధనా మార్గంలో అతని కతండే సాటి.

తండ్రి ఆంగ్ల విద్యా పరిచయం కుమారుడికి అబ్బింది. సాధపట్టకం ప్రారంభించాడు. తను ఇన్నాళ్లవలె కాదు. ఆంగ్లం కవీంద్రుడు, తన వేషం, తన భాష, తన ఉనికి తన తాలూకు ప్రతి చిన్న విషయమూ దానికదే సాటిగా వుండాలి.

నిద్రాహారాల మాట ఎలా వున్నా, నిలువు నిలువునా మనిషి మారాడు. అగస్త్యులు సముద్రాన్ని ఆపోశనం పట్టాడన్నట్లుగా తయారైనాడు. చదవడమే పని. రాయడమే పని. పేరు ప్రతిష్ఠలను పొందడమే పని.

"హరికి మృగరాజ్య మెవ్వరు
కరుణించిరి తనకు తాన కాదా వరకుం
జరభంజనునకు, జలనిధి
కురువిక్రమ వైభవునకు ఒరులీతలె నే—"

అన్న పద్ధతే పద్ధతి! అనుకున్నది అనుకున్నట్లుచే పడాలిసిందే.

ముట్నూరి కృష్ణరావు, వేమూరి రామకృష్ణరావు, పట్టాభి సీతారామయ్యగారలు బందరుకు పెట్టని కోటలు. వీరంతా ఆంగ్ల భాషలో సెరనిగ్గలు పుణికి పుచ్చుకున్నవారు. నాగభూషణం మానసికంగా వీరినుంచి తయారీ పుచ్చుకున్నాడు. అప్రతిమానమైన సాధనతో అహర్నిశల తపస్సుతో—ఆంగ్లకవితా ప్రియం భావుకుడైనాడు. ఆంగ్ల విద్వాంసులే. "ఆంగ్ల కవనం వ్రాసే కొద్ది పాటి భారతీయులలో వీరు—" అని ప్రశంసించేదాకా అతను, శ్రమ, దమా పడి, సాధించాడు:

ఏమిటో మనవాడి హంగామా—అనుకున్న మిత్రులే—

జబరదస్తీవాడురా.

భూషణుడు

గుబులు పుట్టిస్తాడురా!

అనే ధోరణికి దిగారు.

తన పరిశ్రమాన్ని తాను చాటి తీరాడు.

**V. N. *Bhushan*!**

* * *

మల్లాది రామకృష్ణశాస్త్రి స్నేహితుడు. ఒక వింత ప్రకృతి. ఇటు దేవతార్చన చేస్తాడు. సంస్కృతం అన్నా, ఆ భాషా సౌష్ఠవం అన్నా ఆలింగనం చేసుకుంటాడు. మనస్సును—సంస్కృత, ఆంగ్ల—వాణీలతో రంగరించుకున్న వాడు. సంస్కృతంతో సాముకి ఆంగ్లంలో అభినివేశమూ ఆంధ్రంలో అంతరంగమూ శాస్త్రిది. శాస్త్రి రణ—పెంకి.

వెంపటి నాగభూషణానికి రామకృష్ణశాస్త్రి మీద రగులుకున్నది పోటీ. శాస్త్రి కథలు వ్రాస్తాడు. భూషణమూ కథలు వ్రాయడం ప్రారంభించాడు. 'స్వర్ణకుమారీదేవి' కథలతర్జుమాతో ప్రారంభమైన కథారచనకు కృష్ణా పత్రిక ఆట పట్టు అయింది. తర పరంపరలుగా కథలు రచించాడు.

శాస్త్రి ఒక వంద కథలు రచిస్తే—తాను ఓ రెండు వందలదాకా కథలు రచించాడు.

* * * *

అను నిత్యమూ కళ్లముందు మెలిగే ముట్నూరి

---

* బందరు గొడుగుపేటలో నే—ఈ మిత్రులంతా ఉండేవారు.

కృష్ణరావుగారు—పత్రికా సంపాదకుడు, స్నేహితుడు నాగేంద్రరావు పత్రికా సంపాదకుడు. తాను...?

ఉన్న అవకాశాన్ని జారవిడవటం ఉద్యోగి లక్షణం కాదు. తాను గురుకులం నోబుల్ కాలేజీ విద్యార్థి. కాలేజీ మాన్యుస్క్రైబ్ లీఫలెట్లను ఉద్ధరించడం ప్రారంభించాడు. నామకేవాస్తేగా ఉన్న కాలేజీ లీడర్‌ను చేపట్టి సుసంపన్నం చేసి—స్నేహితుల్లో C. Y. చింతామణి అయినాడు.

ఉన్నత విద్యకని బెనారస్ వెళ్లాడు. కాశీ పండితుడై తిరిగి వచ్చాడు.

ఎక్కడున్నా—భూషణం జీవితం ఒకటే—తన ఉపాధ్యాయులు తనకు స్నేహితులు! తనలోటి కవులు—ఆంగ్లం మజాలు తెలుగులోకి తెస్తే—తాను చల్ మోహనరంగా లాంటి పాటలను ఆంగ్లంలోకి తెచ్చాడు. మాలవ్యా పండితుడంతవానికి, పోతరాజు భాగవతం చదివి చెప్పి—తెనుగు మజాలను లేట వెలుగుకి తెచ్చాడు!! రవీంద్రునికి పోతరాజు భాగవత ప్రభల్ని అందించింది రాయప్రోలు సుబ్బారావు గారు; మాళవ్యాకు చెప్పింది మనవాడు.

* * * *

కాశీనుంచి కావేడు పుస్తకాలతో బందరుకు సాగినవాడు—పట్టుమని పది మాసాలయినా ఉండ లేదు. తన ఢంకా పై రాజధానులలోనే బజాయించ దలిచాడు. బికనీరుకు కాబోలు వెళ్లాడు.

రాజులలాంటి జీవితానికి అలవాటు పడ్డాడు. తాను భోగి. తిరిగి వచ్చాడు. 'పద్మపరాగం' కథలు అచ్చు వెయ్యాలంటూ—

* * * *

కలువ రేకుల కలిమినంతా
విలుచుకొన్నవి కలికి కన్నులు
జిలుగు వెన్నెల కలల వెన్నెల
నిలవనన్నవి ఎందుకో?
మల్లె మొగ్గల పరువమంతా
కొల్లలాడిన మందహాసము
పల్లవారుణ రాగరంజన
మెల్ల నన్నది ఎందుకో—?

* * * *

సుకుమార విహార
లోకైక మోహనా!
నీకోసమై ఎన్ని పోకళ్లు పోవాలో ?

* * * *

వికసించినవి జాజి
విరులు నీవేణిలో
ప్రకటించినది తనువు
సుకుమార తనువల్లి !

వనలెత్తి నవి భావనా
నవ్య వైఖరిని
అళికుమారీ గీతి
కాలస విలాసాలు—

లాంటి రచనలకు అతని మనస్సు పత్రికా రంధి పడింది. ఆంగ్లంలో ఎగరేసిన జండా ముందు, తెనుగులో తన ప్రాభవం తక్కువదిగా కనిపించసాగింది.

ఏకస్యతిష్ఠతి కవేః గృహఏవ కావ్యం
అన్యస్య తిష్ఠతి సుహృన్ భవనేషు కశ్చిత్
న్యస్యాస్య విదగ్ధవదనేషు పదా నిశత్వాత్
కస్యాపి సంచరతి విశ్వకుతూహలీవ

లాంటి సాంస్కృతి కోర్కెల పరిచయం కలిగింది. సాధించా లనుకున్నాడు. భగీరథ ప్రయత్నం చేశాడు.

అనుకున్నది అంతా చెప్పకుండా, లుప్త భావాలను ఎక్కువగా చుక్కలతో సూచిస్తూ—అటు వాడుక భాషనూ, గ్రాంథిక భాషనూ రంగరిస్తూ—లక్ష రిఫరెన్సులతో, సూచనలతో తయారైన రామకృష్ణశాస్త్రి రచనా పద్ధతిపై— నాగభూషణం కన్ను వేశాడు.

జాజులందమా రవల
గాజులందమా?
చందమామ వెలుగునీడ
సరసమందమా?

అంటూ, భూషణం కొత్త పంథా రచనలను బయట పెట్టడం ప్రారంభించాడు. "లలనీలాలు" స్వామికి చెల్లించి ప్రారంభించిన "చిలక పలుకులు" శరపరంపరలుగా అచ్చుకెక్కుతున్నై. పరువున్న పత్రిక తెరిచే సరికి—కథ కళకళ పడేది.

ముద్దుపళని తీపిదనం, వెలుగులోకి రాని విశేషాలు; క్షేత్రయ్య—లబ్బులూ, జవళీ భజానాదార్ వీణధనమ్మాళ్ పట్ల—అహల్యా చరిత్రలోని అంతరాళ్ళు—ఒకటేమిటి— తెలుగు కవితలోని పెర నిగ్గుల్ని, నాగభూషణం బయట పెట్టి చూపి, కవి ఘాయీల కళ్లకు మిరిమిట్లు గొలిపాడు.

రామకృష్ణశాస్త్రి ఏ అ-ప్రాచ్యమైన సంగతిని రంగరించినా, సంస్కృతి హృదయంతో గానీ చెప్పడు. మన సంప్రదాయాలకు గానీ హత్తుకు.

నాగభూషణం కేవలం అ-ప్రాచ్యంగా నే ఆ వాతావరణంలో నే యిక్కడి యితి వృత్తాన్ని రంగరించడం ప్రారంభించాడు. "ముత్యాలశాల" తయారైంది.

నిజంగా మంచి కథల సంపుటం!

దాదాపు ౫౦, ౬౦ కథలు, ఆణి ముత్యాల లాంటివి, నాగభూషణం తన సొమ్ము చేసుకున్నాడు!

* * * *

"సహా నానా ము త్తమల్లోకో అస్తు!" అనిగదా వేదోక్తాశీర్వచనం. నాగభూషణానికి సరిసమానులు ఆతని సోదరులే—తన అన్నలు హెడ్ మాస్టర్లు. తాను ప్రిన్సిపాల్ కావాలి. అయినాడు. చిట్టచివరకి, ఆఖరుదశలో అంధేరీలోనో అమ్రోలీలోనో కన్నులు మూసేవరకూ ప్రిన్సిపాల్. ఇంతకూ భవసారం ఆతను జీవించింది ౪౨ సంవత్సరాలే.

* * * *

పుట్టి పెరిగిందీ—చదివిందీ—బాల్య క్రీడలు చూపిందీ బందరులో. వ్యాసంగం అంతా పూనాలో-బొంబాయిలో — బెనారసులో — బికనీరులో, భావన్ కళాశాలలో. అంచేత, విద్యాశాఖలో అతని కృషి ఏమిటో—ఇక్కడి వారికి తెలీనిదై పోయుంది.

వీణ మాలిమి తెనుగురాణి ది
వాణమేలే వయసు కౌనవు
హాలాణ వాణికి మనసు నచ్చిన
జాణవోయీ భూషణా!

అన్న శ్రీమతి సుందరవర్ధని ప్రశంస వంటివి మాత్రమే—యిక్కడ మనకు దక్కినవి.

ఇంటా బయటా గెలవడం ఎవరికో కాని సంపద అయిన కాలంలో, యింటా బయటా గెలుస్తున్నవాడు, పట్టుదల గలవాడూ పట్టుపట్టి సాధించ గలవాడూ అయిన నాగభూషణం—పది కాలాలు బతికి బట్టకట్టివుంటే—కవనంలో గాని, కథా కథనంలో గాని, విద్యా వ్యాసంగాలలో గానీ—ఏమేమి సాధించేవాడో—మరి—ఇంతకూ కాలం కలిసి రాలేదు మరి!!



# వ్యవసాయ ప్రశ్నోత్తరములు

**శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి**

అధికమైన ఆహారపదార్థాల నుత్పత్తి చేయవలసిన ఈ రోజుల్లో క్రమమైన వ్యవసాయపద్ధతులను గూర్చి తెల్పే గ్రంథాలను పరిశీలింపవలసిన అవుసరముంది. ప్రాచీనకాలమునుండి భారతదేశాన సేద్యము నాగలి, బండి, ఎడ్లు మొదలైనవాని సహాయముననే జరుగుచున్నది. పాశ్చాత్యదేశాల్లో ఈ కాలాన యంత్ర సహాయమున వ్యవసాయము సాగించుచు, శీఘ్రకాలంలో విశేషాభివృద్ధి నొందుచున్ననూ, అధిక ధనములేని మనదేశంలో, పేదవారికి గూడ నందుబాటులోనున్న నాగలి, బండి మొదలైన సామగ్రులతోడనే వ్యవసాయముచేయుచూ, పల్లెటూళ్లలో చేటికిని రెండు మూడెకరాలుగల పేదరైతు మొదలు, వందలాది ఎకరాలు గల పెద్దరైతు వరకుందురూ, నాగళ్లసాయముననే, అనూచాన సంప్రదాయమున సౌకర్యంగానూ, లాభదాయకంగా కూడా సాగించుకొనుచునే ఉన్నారు. కునేరవరి క్రేమలవలెనే ఈ నాగలి వ్యవసాయ మభివృద్ధి పొందింపవలసియున్నది. వ్యవసాయ పద్ధతులను, వ్యవసాయ సామగ్రులనుగూర్చి కొన్ని గ్రంథాలు మన పూర్వులు తెలుగులో రచించారు. అట్టివానిలో బాలురకు సైతము స్పష్టంగా తెలిసేటట్లు ప్రశ్నసమాధాన రూపమున "వ్యవసాయ ప్రశ్నోత్తర"మనే గ్రంథం చెన్నపురి ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో ౧౩-౮-౩౧ నెంబరుగల సంపుటంలో ఉంది. దీని కర్త పేరిందులో లేదు. వ్యావహారిక భాషలో దీనిని వ్రాశారు. ఇందలి పారిభాషిక పదాలు అన్ని శాస్త్రాలందలి పారిభాషికపదాలవలె చిత్రంగా ఉంటాయి. ఈ గ్రంథం విడివిడి ఆకులుగా బ్రౌనుదొరగారికి యానాములో దొరికిందట.

ఈ గ్రంథాన ౧ నుండి ౧౫ ప్రశ్నోత్తరాల్లో, వ్యవసాయానికి కావలసిన పనిముట్లేవో, వాటిని సేద్యంలో ఏ ఏ సమయాల్లో, ఎట్లా ఉపయోగిస్తారో, స్పష్టంగా వివరించారు. 'వ్యవసాయానికి నాగలి, గొర్రు, గుంటక, పాపటం, పంట్లమాను, నల్లమాను, దంతె, కీలగపార, గోకుడుపార, గుద్దలి, తొల్లిక, కొడవళ్లు మొదలైనవి కావాలి.' ఈ సామానులకుంటే వివిధభాగాలు, వానిలోని రకాలు, వాటి కూర్పుకూడా తెల్పి, ఆ సామానులుచేసేవారికి గూడా సహాయమునగుచూ, మార్గదర్శకమైన సూచనలతో గూడియున్నది. ఈ నిర్మాణవిధానము శాస్త్రపద్ధతిని, ప్రాచీన సంప్రదాయము ననుసరించియున్నది.

నాగలి: 'ఇది పిడికోల, పగలే, అట్టు, మేడిసోగ, సోగపీల, నాగపీల, కఱ్ఱు, కర్రిమెల, ఇన్ని కూడితే నాగలి. నాగలిని అరక, ఈరు, మడక, అని కూడా అంటారు. నాగలి రెండురకాలు. పలిదుక్కి అనీ, రొంపిదుక్కి అనీ. పలిదుక్కి మెట్టపొలాన్ని దున్నేది. రొంపిదుక్కి మాగాణిని దున్నేది.' ఇక పొలాన్ని దున్నట మెట్లాగో తెల్పుతున్నాడు— 'ఎద్దుల మెడలమీద కాడిపెట్టి, పలుపుతో గట్టి, ఎద్దుల తలలకు పగ్గములుగట్టి, ఈ నాగలి అమర్చిన రెండికోల కాడిమానుకు వారెణపీటవేసి, వారెణమోకు తగిలించి పన్ని, నాగలిపట్టదగ్గర ఉండే మేడిసోగ ఎడమచేత పట్టుకొని, కుడిచేత ములుకోల పట్టుకొని దున్నేది' ఇట్లా ప్రతి స్వల్పవిషయం స్పష్టంగా వివరింపబడింది.

గొర్రు: అడ్డ, అడ్డకమర్చిన సోగలు ౨. అందుకు క్రింద మూడు చెక్కులు. చెక్కులకు 3 కఱ్ఱులు, మూడు కఱ్ఱులు బిగించడానకు 3 చిన్న మెలలు, 3 పెద్ద మెలలు. అడ్డకు వెనకపార్శ్వం మేడికమర్చిన సోగలకడ్డముగా, దండగాడిపట్టె దండగాడిపట్టెకు చెక్కులు బిగించడానకు మెలుముతాడు, దానికి 3 అంకెలున్నా,

౨ చిరుతపుల్లలున్నా, జడిగపుపీట తాళ్ళున్నా, ౩ జడిగపు గొట్లున్నా — గొర్రు రెండు రకాలు. జడిగము లేనిది ఆటగొర్రనీ, జడిగమమర్చి, ధాన్యం వెద చల్లేది వెదగొర్రనీ. ఇది మెట్టసాగుకు మాత్ర ముపయోగిస్తుంది.

సంటక : ఒక అడ్డ, అడ్డకు ౨ పోగలున్నా, నాగలికి వెనక పార్శ్వం రెండు సన్నపీలలున్నా, అడ్డమీద పోగ అమర్చిన మేడిన్నీ, అడ్డకొనలను, సజ్జలున్నా, సజ్జలకు తగిలించిన ఇనపఅలుగులున్నా, ఇవి కూడితే సంటక అనబడును. ఇదివరకున్న గడ్డి పోయేటందుకున్నా, గొర్రుధాన్యం వెదబెట్టిన తర్వాత ఆ గొర్రుచాళ్ళు పూడేటందుకు, పైపాలు తోలేటందుకున్నా వాడుకోబడుతుంది. మూడుజానల పలుగుండేది పొట్టిదనీ, నాలుగుజానలది పెద్ద సంటనీ రెండువిధాలు. పొట్టిది ప్రతిచేలో మాత్రం తోలేది.

పాపటం : మోకాటిఎత్తు పైరుండగా, గడ్డి పోయేటందుకు మెట్టపైరులో తోలేది. దీనికి దండె, కత్తెరమెట్ల, సంటిక, అనియు పేర్లు. దీని కూర్పు ఇట్లు ఒక అడ్డ; అడ్డకు రెండుపోగలు. పోగలకు వెనక ౨ పీలలు. అడ్డపైన పోగ అమర్చినమేడి. అడ్డకు పొన్ను అమర్చిన సజ్జలు ౩. ఆ సజ్జలకు ఇనుముతో చేసిన పలుగులు. ఇన్నీ గూడితే పాపటమౌతుంది.

పండ్లమాను : అడ్డ, అడ్డకు ౨ పోగలు, పోగలకు వెనక ౨ పీలలు. అడ్డపైన పోగ అమర్చిన మేడి. అడ్డక్రింద ౪ నుండి ౧౨ వరకు ఇనప మేకులుగానీ, లేనిపక్షాన కొయ్యమేకులుగాని అమర్చినది పండ్లమాను — ఇది మాగాణి వరిపైరులో కలుపు పోయేటందుకు తోలేది.

నల్లమాను : సుమారు ౪ మూరల పలుకు ఈ తట్టూ ఆ తట్టూ తొలిచేసి, రెంటికీ ౨ త్రాళ్లుగట్టి, కాడిమానుకు గట్టేది. — ఇది, మాగాణికి బురద దుక్కైన తర్వాత వరిమొలక చల్లేటందుకు ముందుగా దున్నిన చాళ్లు పూడి చదరమయ్యేటందుకు తోలబడును.

దంతె : ఒక చెయ్యి అడ్డ, అందుకు ౪, ౫ పండ్లున్నా, ౪ మూరల కర్రాను, అమర్చినది దంతె అనబడును. ఇది రెండు రకాలు. మొదటిది అద్దు కట్టె దంతె. ఇది మళ్ళు చదునుచేయడానికి, కాలువలు గనిమెలు తీయడానికి పనికివస్తుంది: రెండవది, సన్నదంతె. ఇది జొన్నకంకులు నూర్చిన తర్వాత ఆ గడ్డలు లాగి ప్రోగుచేయడానికి వాడబడును. అద్దుకట్టె దంతెకు బారెడు నిడుపున్నా, జెత్తెడు వెడల్పున్నా గల పండ్లు అమర్చినది. సన్నదంతె ఆదే ప్రకారంగా ఉండును, కాని ఇది మూరెడు పొడుగున, ఎడ ఎడముగా సన్న పండ్లు గలిగి ఉండును.

శిలగపార మొదలైనవాని ఉపయోగము : శిలగపారతో గోదమెట్టడమును, వరపలు తిప్పడమును, మళ్లుకు, జరీముకు మడవలు తిప్పడమున్నా; దోకుడు పారతో గడ్డి చెక్కడమున్నా, సజ్జపైరులో కలుపు తవ్వడమున్నా; సద్దలితో మెట్టపొలములో చెట్లు కొట్టడమున్నా; తొల్లికతో జరీబులో యావత్తు కలుపు తోవ్వడమున్నా, కలప తిక్కతో కలుపు తియ్యడమున్నా; కొడవళ్ళతో కొన్న కస్తైరా పైరులు కొయ్యడమున్నా అవుతుంది.

ఈ గ్రంథంలో ప్రశ్నోత్తర రచనా విధాన మెట్లా ఉందో మచ్చుకు చూద్దాం. ఇందు ౧౬ నుండి ౨౧ ప్రశ్నోత్తరాల్లో నీరు తోడే సామాను లను, తద్విధానములను గూర్చి చెప్పబడ్డది.

ప్రశ్న : నీళ్లుతోడే సాధనము లేమి ?

ఉత్తరము : తలమున్నా, కపిలెనూ.

ప్రశ్న : తలపసామాను లేవి ?

జవాబు : తలపసుంబ, దానికి కప్పలు రెండు. ఇరుసు ముందర నిలువుకొయ్యలు రెండు. వెనక నిలువు గాళ్ళు ఉండే మాను అరిగె. తోపుకోళ్ళు రెండు. పలుపులు పట్టుచారల. మెలుసులు, తలపగడ, బొవ దండెము, బానపీటలు ౨. తలపగడకు వేసిన మున పకు తగిలించే వారిణె. వారిణెకు వంటితాడు. ఇవన్నీ గూడితే తలము.

ప్రశ్న : తలము ఎన్ని విధాలు ?

సమాధానము : ఎదురు తలము లోయి రకట ఏతాము అనిన్నీ, వొగ్గాపు తలము అనిన్నీ రెండు విధాలు. ఒకటి వెనకాల ఒకటి రెండు తలములు పన్నినట్టయితే అది ఎదురు తలము. చాలా లోతులో నుంచి నీళ్ళుతోడేది వొగ్గాపు తలము. ఇవి ౧ నుంచి ౨౦ లేక ౩౦ చాలుగా తలములు వేసినచో అవి పక్కెడ తలములని చెప్పుతారు.

ప్రశ్న : కపిలె సామాను లేవి ?

జవాబు: బావి మొత్తంమీద రెండు నూతి మానులు, అందుమీద ఒక పలకరాయిగాని, రెండు అడ్డదూలాలుగాని అమర్చేది. ఆపైని రెండు ముక్కారమానులు, వానికి రెండు నిలువుకూచాలులో నీరు కాళ్ళు, వాటిపైని దోరపువక్టె, దానికి రెండు కొనలను రెండు పోటుగుంజలున్నూ, నడుమ రెండు చౌకట్లున్నూ, వానినడుమ ఇరుసు బిళ్లగాని, కండెన బిళ్లగాని అమర్చి, ఆ బిళ్ల మోకువేసి ఎద్దులుకట్టి బొక్కెన తోడేది.

ప్రశ్న: బొక్కెన అనగా ఎటువంటిది?

జవాబు: వల్లిగములో నుండు ఒకటిచేసి, దానికిపైన రెండు నాగవాసా లమర్చి, ఆ నాగవాసా లకు తూము అమర్చి, ఆ వల్లిగానికి చానవల తోలు సుట్టితే అది బొక్కెన. ఆ బొక్కెనకు తొండం అంటుకట్టేది.

ప్రశ్న: బొక్కెనతో మడికి నీరుపారకం ఎట్లా?

జవాబు: లోగడ కపిల కమర్చిన రెండు ముక్కారమానుల నడుమ మూడు మూరల తొట్టెదోనె ఉంచి, దాని కొనను మూడుమూరల పిల్లదోనె ఉంచి, ఆ పిల్లదోనెమీద పలకరాళ్లు వేస్తే, ఇది కపిలదోనె. రెండెద్దుల మెడలమీదను కాడికి నడుమగా తోలుతో వేసిన మోకుకట్టి నీళ్లలోవిడిచి, తొండాపుకొనను తాడు కట్టి, ఆ తాడు కాడిమానుకు కట్టి, ఆ ముక్కార మానులమీద పెద్దపుల్లిరుసున్నూ, దాని కొనను బుడ్డ పుల్లిరుసున్నూ అమర్చి నీళ్లు పైట తోడేది. ఒక కపిలె రెండు కాళ్లు ఎడ్లు కట్టితే అది తిరుగుడు కపిలె.

ఈ గ్రంథంలో ముఖ్యంగా మెట్ట వ్యవసాయానికి సంబంధించిన విషయాలే తెల్పబడినవి. అవి నుండి కెల ప్రశ్నోత్తరాల్లో, వివిధమైన మెట్టపైరులను పండించే కాలములు, విధానములుకూడా విపులముగ చెప్పారు.

సజ్జపంట: తొలకరివానలు కురియగానే రెండు సాళ్లు ఆటగొఱ్ఱు తోలించినతర్వాత, ఆషాఢ శుద్ధంలో పునర్వసు కార్తెలో, పెదగొఱ్ఱుతో సజ్జలు విత్తించి గుంటక తోలించేది. సజ్జపైరు మోకాలిబంటి ఎదిగిన తర్వాత పాపటం తోలించేది. తర్వాత పొట్టకఱకు వచ్చి, వెన్నుతీసి పాలుపట్టి, పూచ నియ్యం కాగానే, చేలో మంచె వేసేది. పరిగపిట్టలు తినిపోకుండా వడిసెలతో రాళ్ళురువ్వి తోలుతూ చేను కాపాడి, గింజముదిరి పరువుకు రాగానే కొడవళ్ళతో కోసి, కట్టలుకట్టి, బోదెలుపోసి, నాల్గు దినా లెండనిచ్చి అక్కడక్కడ గాలిగూళ్ళు వేసి, పనసలుకప్పి, కుప్పలువేసి, కొన్ని దినాలతర్వాత పాలేర్లతో కళ్ళంచేయించి, కుప్పల దిగవేయించి, కంకులన్నీ కోయించి, కళ్ళంలో మండె పోయించి, ఎద్దులను దామెన పలుపుతో బంతులుకట్టి మూతులకు చిక్కాలుపెట్టి సరిపిడి చేయించి, గడ్డలను వెన్నుదంతెతో పోసుచేసి, ధాన్యం రాశిచేసి, ఆ బూరగ రాశిని అడ్డరాశిచేసి, మూడుకాళ్ళతో నట్టకట్టించి అందుమీద ఒకడు నిలిచి, చేటలతో తూర్పార పెట్టుతూ ఉంటే, పాలికట్టెలతో ఉనకలు పండె కట్టెకు తోసి, మేలురాశి ధాన్యం అట్టెన పోయించి, ఆ ధాన్యం రాశిపోస్తారు.

సజ్జలు పెద్దసజ్జలనీ, పచ్చసజ్జలనీ, మండాపుసజ్జలనీ మూడువిధాలు. పెద్దసజ్జలు నాల్గునెలల పంట. పచ్చసజ్జలునూ మండాపుసజ్జలునూ మూడునెలల పంట. కొఱ్ఱ, చామ, అరుగ ఈ మూడును సజ్జచేసిన కార్తెలోనే అదినంగానే పైరుచేస్తారు. కొఱ్ఱ, చామ మూడునెలల పంట; అరుగ ఆరునెలల పంట.

జొన్నపంట: సజ్జపంటవలెనే దీనిని చేస్తారు. కాని ఇందులో కందులు, పెసలు, నువ్వులు, అలసందులు, దోసవిత్తులు, గోనువిత్తులు, కలుపుతారు. సజ్జలో కందులు, గోగులుమాత్రం కలుపుతారు. జొన్న లేడు విధాలు. ముదురుజొన్న, పెద్దజొన్న, పైరుజొన్న, పాలాపుజొన్న, గిడ్డజొన్న, ఎఱ్ఱజొన్న, మొక్కజొన్న. కాని, పైరుజొన్నలు పచ్చజొన్నలనీ, తెల్లజొన్నలనీ రెండు విధాలు. ముదురుజొన్న లారునెలల పంట. మిగిలినవన్నీ మూడునెలల పంట.

ఆముదాలు: ఇది ఆరునెలల పంట. జొన్న చేసే కార్తెలోనే దున్నకుండా, గుంటకమాత్రం తోలిఉండే పాలాన నాల్గుజానల సందువిడిచి నాగటిచాళ్ళు పోనిచ్చి, ఆ చాళ్లలో చేత ఒక టొకటిగా ఆముదాలు వేసేది. తర్వాత గడ్డి బలియకుండా సందు సందునల్లా నాగేలు, కొఱ్ఱు, గుంటక, పాపటం ఇత్యాదులు తోలించేది. గెలలువేస్తే,

కాయలు ముదిరి, గెలకు ౧, ౨ కాయ లెండగానే, ఆ గెలలకున్న కాయలను దూలించి, మండె పోసి పైన చెత్తకప్పి, సుమారు ౭ దినాలుండి, పలకలతో వాటిని గొట్టి, ఎండలో కొరిపి, తిరిగీ రాసిచేసి, పలకలతో గొట్టి, తూర్పారబట్టేది. కొన్ని గెలలు లేతగా ఉన్నట్లయితే నాలుగోజా లాగి కోసుకొనేది. కొన్నిచోట్ల ఆముదాలతో పాటు అలసందులు, అనుములు, కలిపి వేస్తారు. ఆముదాలు చిట్టాముదాలనీ, పెద్దాముదాలనీ, పైరాముదాలనీ మూడు రకాలు.

ప్రత్తి పంట:—జొన్న పైరుకు చేసినట్లుగానే చేను పక్వంచేసి, కల్లుతోలుతూ, ఆ గొర్రి చాళ్ళల్లో నడిమిచాలు విడిచి, కడచాళ్ళ రెంటిలో ప్రత్తివిత్తులు మట్టినీళ్ళతో గానీ, పేడనీళ్ళతో గానీ, రాచి చేత వేసేది. మొకాటిబంటి ఎదిగినతర్వాత పాపటంతోలి, పొట్టిసంటక తోలేది. ప్రత్తిచెట్ల కాయలు పగలగానే ప్రత్తి విసుదుకొనేది. ప్రత్తితో పాటు కందులు, గోగులు కూడ కలిపి వేస్తారు. ప్రత్తి ౬ నెలల పంట.

వరిగెలు, ఉలవలు, శెనగలు, మినుములు, జనుములు అనూరాధా జ్యేష్ఠ కార్తెలలో పెట్టేది. కొర్రా మణి, మూల పూర్వాషాఢ కార్తెలలో ఒక చాలుగున్ని చల్లేది. పునర్వసు కార్తెలో విత్తిన సజ్జలు, కొఱ్ఱలు, అలసందలు, మొదలైనవి పునాస పంట అనీన్నీ, దక్షిణపు గాలిచే పండే పెసలు, మినుములు, వరిగెలు, పైరుజొన్న, ఉలవలు, శెనగలు మొదలైనవి పైరుపంట అనీ పేరు. జొన్నలు, సజ్జలు, రాగులు, గట్టిధాన్యమనీన్నీ, వరిగెలు, అళ్ళు, చామలు, వడ్లు, గోధుమలు పొట్టుధాన్యమనీన్నీ, కందులు, పెసలు, నువ్వులు, ఉలవలు, అలసందలు, శెనగలు, అనుములు, కారామళ్ళు, మినుములు కాయధాన్యమనీన్నీ పిలుస్తారు.

ఇంతటితో ఈ గ్రంథం మధ్యలో నాగిపోయి అసంపూర్తిగా నుండుటచే మరికొంతభాగమును కర్త వ్రాసియుండవచ్చుననీ, అందు మాగాణి పంటలను గూర్చియు, వివిధమైన పాలములకు, పైరులకు తోలు పెంటలనుగూర్చియు నందు తెల్పబడి యుండుననీ యూహింపనగును. మరియు నిందలి రచన ప్రశ్నోత్తర రూపమున నుండుటచే, విద్యార్థిదశలోనున్న బాలురకు సౌకర్యముగ నుండుటకై యిది వ్రాయబడినదేమో అని కూడా యూహించుట కవకాశము గలుగుచున్నది. ఈ యూహారే సమంజసమైనచో, పూర్వకాలమున వ్యవసాయపు పాఠశాలలు గొన్ని యుండెడివని తలపవచ్చును. ఈ గ్రంథంలో మరో సాంఘికాచారం గోచరిస్తోంది. కళ్ళంలో పైరునూర్చి, ధాన్యరాసి తయారైన వెంటనే పాలేర్లకూ, సంవత్సరం పొడుగూనా పనిచేసిన చాకలి, మంగలి మొదలైన వాళ్ళందరకు, నియమప్రకారం ఏర్పాటు చేసుకొన్న ధాన్యం, వారివారికి ముందుగనే కళ్లంలో కొలిపించి యిచ్చి, వారందరు సంతృప్తిపొందిన తర్వాత యజమాని మిగతా ధాన్యమును బస్తాలకెత్తించి, బండిపై వేసి ఇంటికి చేర్చేవాడట. దీనివల్ల సంఘంలో ఏలాటి ధర్మబుద్ధి, పరస్పర సహాయ గౌరవాలూ ఉండి ప్రశాంత జీవితానికి అవకాశం గలుగుతూ ఉండేదో తెలుస్తోంది.

[ఆలిండియా రేడియో సౌజన్యంతో.]



# నేడు మీరు మెక్లీన్‌తో పళ్లు తోముకున్నారా?




మీ ముఖమండలం ఆరోగ్యానంద పూరితమైన చిరునవ్వుతో వికసించ దానికై మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టును వాడండి. మెక్లీన్స్ మీ చిగుళ్లను కాపాడి, శ్వాసను పరిశుభ్రతరమొనర్చి, పళ్లను ముత్యాలవలె మెరిసేటట్లుచేస్తుంది — ఇది వీటినన్నిటినీ ఏక కాలంలో సమకూర్చుతుంది.

మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్ పేస్టు ఒక ప్రత్యేకమైన సూత్రాన్ని అనుసరించి తయారు చేయబడినది. ఇది మిక్కిలి పరిశుభ్రమైనదని హామీ కలదు. అందుకే ప్రపంచమంతటా ప్రజలు రోజుకు రెండుసార్లు — నిత్యం మెక్లీన్స్‌ను ఉపయోగిస్తారు.

**నేడే మెక్లీన్స్‌ను కొనండి!**




MTY-4 TEL

వ్యాపార విచారణకు వీరికి వ్రాయండి :— జె. ఎల్. మారిసన్, సన్ అండ్ జోన్స్ (ఇండియా) లిమిటెడ్., మహాలక్ష్మి ఆలయమునకు ఎదురుగా, వార్డెన్ రోడ్, బొంబాయి 26.

# కొక్కొండ వేంకటరత్నం పంతులు



శ్రీ నిడుదవోలు వేంకటరావు

ఆంధ్రభాషా సంజీవని పత్రిక నిర్వహించుచు హిందూ ప్రొప్రయిటరీ పాఠశాలయందు పండితులై యుండుట వలన పంతులవారికి గ్రంథరచనకు ననుకూలములను పరిస్థితు లేర్పడెను. ౧౮౭౨ లో వారి విగ్రహతంత్రము ముద్రణభాగము నందెను. ౧౮౭౩ లో వారు ప్రత్యేకముగ సంజీవని ముద్రాక్షరశాల నేర్పఱచి యందు తనుమధ్యావ్యాఖ్యకను ముద్రించిరి. ౧౮౭౪ లో పైడిరాజు వేంకటనాథకవి రచితమైన పంచతంత్రమును సంస్కరించి ప్రకటించిరి. ఈ ప్రశస్త గ్రంథము ముద్రితమై ప్రకటిత మగుట కిదియే మొదటిసారి. కాని యింతలో ప్రొప్రయిటరీ పాఠశాలవారు ద్రవ్యాభావముచే పాఠశాల నెత్తివేయుటచేత పంతులవారి పనికి స్వస్తి యయ్యెను. కాని పత్రికను సక్రమముగ నడుపుచుండిరి.

## శ్రీ కాళహస్తి రాజాగారి సమ్మానము

ఇట్లు కొండేండ్లు గడవగా క్రీ. శ. ౧౮౭౫ లో నప్పటి కాళహస్తి రాజాగారైన శ్రీ దామెర కుమార వేంకటపతి నాయనివారు, వేంకటరత్నము పంతులవారి విద్యా విశేషములను గ్రహించి, యొక సంవత్సరకాలము తమ యాస్థానమున యాస్థాన విద్వత్పద మొసంగి, విద్వత్కవీశ్వర బిరుదము నొసంగి యత్యధికముగ సమ్మానించిరి—వేంకటపతి నాయని వారు విద్వత్పోషకులు—శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి అతని కొమారుడు సర్వశాస్త్రి వీరిని తమ యాస్థానమున గౌరవించిన దీయనరో. అచ్చట పంతులు శ్రీకాళహస్తీశ్వరునిపై సంస్కృతమున స్తుతులేకాక వేంకటపతినాయనివారిపై నవరత్నములను రచియించిరి. ఈ వృత్తాంతము—౧౮౭౫ ఆంధ్రభాషా సంజీవని పత్రికలో వివరింపబడియున్నది. విశ్వేశ్వరీయములోని "శ్రీ కాళహస్తికుచే నొసరించిరి విద్వత్కవీశాఖ్య వెలయగనను" అను పద్యపాదము తెలుపుడు చేయుచున్నది.

## ప్రిన్సుఫువేల్సు తారావళీ బహుకృతి

౧౮౭౫ లో విక్టోరియా చక్రవర్తిని కుమారుడు ఏడవ యెడ్వర్డు యువరాజుగా నున్నప్పుడు మన హిందూదేశమును సందర్శించెను. యువరాజుగారి యాగమనమును వర్ణించుచు దేశభాషలలోను నాంగ్లేయ భాషలోను కృతులు రచియించు పోటీపరీక్ష పెట్టి దానికి బహుమతు లొసగెదనని యింగ్లండులో 'లండను క్రౌన్ పెర్ఫ్యూమరీ కంపెనీ' (*The London crown Perfumery Company*) అను నొక పెద్ద సంస్థవారు ప్రకటించిరి. దానిలో మొదటిదిగా నిల్చినదాని కొసగెడి బహుమతిమొత్తము నూటయిరువదియైదు-అనగా ఇంచుమించు రెండువేల రూప్యములు. ఈ ప్రకటనకు బదులుగా, ౧౫౦ కావ్యములు ఇంగ్లీషు భాషతో కలిపి, ౨౫ భాషలలో, నాంగ్లేయ భాషాంతరీకరణములతో నా కంపెనీవారికి పంపబడినవి. అందులో తెలుగుభాషలో వేంకటరత్నము పంతులుగారు దానిలోనుండి 'ప్రిన్సుఫువేల్సు తారావళి' అనుకృతిని రచియించి ఆంగ్లభాషాంతరీకరణముతో నింగ్లండుకు పంపిరి—నిర్ణేతలను 'వ్యాయాధికారులు నాలుగింటినిమాత్రమే ప్రథమస్థానము గడించుట కర్హమైనదని తెలుపుచు, నందు తెలుగు భాషాంతరీకరణ గ్రంథము ౧ ప్రథమ బహుమానమును బడసినట్లు తీర్మానించిరి. మనదేశము నందలి యాంగ్లేయ భాషా పత్రికలేగాక, ఇంగ్లండు దేశమున పత్రికలు దీనిని శ్లాఘించినవి. లండన్ టైమ్సుపత్రిక పంతులుగారి కవితాశక్తిని నతిమాత్రముగా ప్రశంసించినది. ఆకంపెనీ ప్రొప్రయిటరు ఈ తెనుగు గ్రంథ బహుమతి భారత వర్షమున కెల్ల గర్వకారణమని టైమ్సు పత్రికాముఖమున ప్రకటించినాడు (*The result is considered as quite a triumphe for India*) కాబట్టి తొలుత పాశ్చాత్య దేశములలో తెనుగునకు కీర్తి దెచ్చినది వేంకట రత్నము పంతులుగారే యనిగ్రహింప

నగును. దీనినిగూర్చి విల్వకర్త్రీయమున "శేర్మిశ్వేత ద్వీప విద్వత్కవి పరీక్ష సత్కృతి కేసితిజానున నను "అనియు

"ప్రిన్సుఖ వేల్సు నాబరగు
   శ్వేతముఖాధిపు రాకసాకుచే
తన్నముదంచితంబుగను
   తారకహారము బంచి పెల్లడి
విన్నభవల్లనీ వెనపి విశ్రుత
   సత్కృతి సంధ్ర భాషకుణ
మున్నమకూర్చితారగుణముం
   గవిరత్న మధ్యరరత్నమా!

అనియు గలదు—మఱియు నీ 'న్న' ప్రాసతో నొక మాలికను ౩౨ చరణములను కీ. శే. మండపాక పార్వతీశ్వరశాస్త్రిలవారు వ్రాసినది యాంధ్రభాషా సంజీవనిలో ప్రకటితమైనది.

## ప్రిన్సఫ వేల్సు హిందూస్థానసందర్శనము

ఇది పైవిషయమును విపులీకరించు వచన గ్రంథము. ఇందు పూర్వోత్తర భాగములు రెండు కలవు—మొదటిభాగము. ఇంగ్లండు రాజులచరిత్ర ౨వ భాగములో నెడ్వర్డు హిందూదేశాగమనము దెలుపబడినది-వచనశైలి కమ్మచ్చున దీనినట్లుండును. ఇది సంజీవని ముద్రాక్షరశాలలో ముద్రితమై హిందు శ్రేయోభివర్ధనీ సభవారిచే ముద్రితమైనది.—తెనుగున గల ప్రశస్తవచన గ్రంథములలో నిది యొకటి. ఇది యొకసారి ఎఫ్. ఏకు పఠనీయమైయుండెను. దీనిలో హిందూదేశ చక్రవర్తినీ నవరత్నములను పేర తొమ్మిది పద్యములను పంతులుగారు రచించిరి. పై గ్రంథములు ౧౮౭౬ లో ముద్రితమై ప్రకటితములైనవి.[1]

## రాజధాని కళాశాలాంధ్ర పండితకవి

పంతులవారు జన్మముచే మధ్వ మతస్థులైనను శంకరుని యద్వైతమునందు చిన్నప్పటినుండియు నభినివేశము గలవారు ఆ మత తత్త్వమును వివరించుచు క్రీ. శ. ౧౮౭౬ లో "శంకర మతతత్త్వ ప్రకాశిక" అను వచనగ్రంథమును రచియించిరి. దానిని హిందూశ్రేయోఽభివర్ధనీ సభ వారే ముద్రించిరి. ఇదియైన వెనుక పంతులవారి జీవితమును స్థిరత్వమును, చిరయశస్సు కలుగజేసిన రాజధానీ కళాశాలాంధ్ర (*Prisidency College*) పండిత పదవి లభించినది. ఆ కాలమున నా కళాశాలలో మహాప్రసిద్ధులు పరవస్తు చిన్నయసూరిగారి వియ్యంకులు శ్రీ రేకము రామానుజసూరిగా రాంధ్ర పండితులుగా నుండెడివారు. వారు క్రీ. శ. ౧౮౭౮ నవంబరులో కీర్తిశేషులు కాగా వారి స్థానమున వేంకటరత్నము పంతులు గారు నియుక్తులైరి. అప్పటి నుండి క్రీ. శ. ౧౯౦౦ వఱకు సరిగా ౨౩ యేండ్లు పంతులు వారీ కళాశాలయందే పండితులుగనుండిరి. ఏకైకముగ నింతకాలమా కళాశాలలో నింతకాలము పనిచేసినవా రంతకుముందు గాని తరువాత గాని లేరు.

ఇప్పటివలె గాక యా కాలమున రాజధాని కళాశాలా పండితపదవి యన్న యత్యంత గౌరవోన్నతస్థాన విశిష్టత బడసినది. ప్రతిభాశాలులు, పాండిత్యశౌండీర్యము గలవారు, ప్రజ్ఞానిధులు, ప్రవచనానుభవము గలవారు, ప్రత్యేక వ్యక్తిత్వము గలవారుమాత్రమే యా పదవిని బడయుచుండిరి. క్రీ. శ. ౧౮౯౧ లో నీ కళాశాలలో నెవరెవ రెంతకాల మా పదవిని నిర్వహించారో యీ క్రింద తెలుపుచున్నాను. (ప్రక్క పుట చూడుడు)

పంతులుగారు పాఠములు చెప్పుటయందు ప్రత్యేక ప్రసిద్ధి బడసినవారు. వారి కాలమున తెలుగు తరగతి కట్టిన గౌరవముకలదో "[2] వేంకటరత్నము పంతులుగారి స్మరణము" అను గ్రంథమును జదివిన తెలియగలదు. ఈ రాజధానీ కళాశాలలో నున్నప్పుడు పంతులుగారు నిర్వహించిన కార్యములు రెండు. 1. ఆంధ్రభాషాభివర్ధనీ సమాజ

1 పంతులువారు రచించిన తెనుగు గ్రంథము, ఇంగ్లీషు భాషాంతరముతో కూడ లండను పట్టణమున "*H milton Adams & Co*" అను వారివలన "*The Anglo - Indian Prize Poems on the Royal visite*" అను గ్రంథమున ౧౮౭౬ లో ముద్రితమై ప్రకటితమైనది.

2. ఈ గ్రంథము క్రీ. శ. ౧౮౯౯ లో పంతుల వారివద్ద ప్రెసిడెన్సీ కాలేజీలో శిష్యులైన శ్రీ మేచేరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే రచితమైనది. శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిగారు బి. యే. బి. యల్ పట్టము నంది చాలకాలము విరించిపురములో వకీలుగా నుండిరి. నేడు విశ్రాంతి తీసికొనుచు చెన్నపురమున నున్నారు. వీరి గ్రంథమునం దనేక యపూర్వ విషయములు గలవు.

పంతులవారి యముద్రితములైన రచనలలో శ్రీమతీమాధవ నాటకము (స్వతంత్రము) ఆంధ్ర భగవద్గీత, ఘటికాచల మహాత్మ్యము ప్రబంధము మున్నగునవి నేడును ఆంధ్రపత్రికాధ్యక్షులగు శ్రీ శివలెంక శంభుప్రసాదుగారివద్ద గలవు. వానిని పరిశీలించిన పంతులుగారు బహు గ్రంథకర్తలని తెలియగలరు.

అర్వాచీన ఆంధ్రవాఙ్మయ చరిత్రమున పంతుల వారి స్థానము నిరూపింపవలెనన్న పందొమ్మిదవ శతాబ్దపు టాంధ్రవాఙ్మయముయొక్క పరిణామమును మనము తెలిసికొనవలెను. పందొమ్మిదవ శతాబ్దము ప్రాచీన నవీనభావ సంధి సమన్వయ యుగము. ఈ యుగము క్రీ. శ. ౧౮౦౦ లో కుంఫిణీవారి పాలనలో ప్రారంభమైనది. ఈ సంధి సమన్వయముల వెనుక నవీనభావము లెట్లు ప్రతిష్ఠములైనవి గ్రహించుట కీ క్రింది విభజన తోడ్పడును.

| | | ముఖ్యప్రవర్తకులు. |
|---|---|---|
| క్రీ. శ. ౧౮౦౦-౧౮౩౦ | నవీనోద్యమ ప్రారంభము- | కర్నలు మెకంజీ. |
| ౧౮౩౦-౧౮౫౭ | నవీనోద్యమవ్యాప్తి - | బ్రౌను దొరవారు. |
| ౧౮౫౭-౧౮౮౦ | ప్రాచీన నవీన భావసమన్వయము- | పరవస్తు-చిన్నయసూరి |
| ౧౮౮౦-౧౯౦౦ | | కొక్కొండ వేంకటరత్నము. |
| ౧౯౦౦-౧౯౧౯ | నవీనయుగ ప్రతిష్ఠాపన - | కందుకూరి వీరేశలింగము. |

వీరేశలింగమునకు ముందు, చిన్నయసూరి వెనుక సాహిత్యయుగ పురుషుడు వేంకటరత్నము పంతులు.

వారి కీర్తికి స్థిరచిహ్నముగ రాజధాని కళాశాలావరణములో వారి శిలావిగ్రహమును ప్రతిష్ఠాపన చేయుట యాంధ్ర మహాజనుల కర్తవ్యము.





# మాలతి



శ్రీ కూచిభొట్ల హరి

నవలావణ్యవిలాసు డాతడును కన్యారత్నముం జూచి ఓ
నవలా! ఇచ్చట నుండ నేల, చనుదే, నాతోడ నారూపముం
దన సౌందర్యంబును తావిపూవువలె సంధానించె నా యీశుఁడీ
కవి వర్ణింపఁగలట్టి సంస్కృతిని నే కావించెదన్ మాలతీ!

అని అత డాడునట్టి ప్రణయంబున కించుక యైన నుత్తరం
బును నిడ కామె చూచుచును బాల్చె వినిర్మల నీరపూరముల్
వినమితవృక్షజాలములు వేల్లిత భృంగకులైకసంఘముల్
వినియుత-హంసదంపతులు వీచికలందునఁ దూగి యాడుటల్

చూచుచు నామె నాప్రకృతి శోభవమందు విలీనమైన ఆ
లోచనతోడ మూసికొనె లోచనముల్; ముకుళించియున్న ఆ
లోచనలక్ష్మి చూడగ ప్రలోభము నొందె ప్రియుండు; మిత్రు న
స్తాచలయాత్రతో మెఁగియు తమ్ములచాడ్పున నొప్పె నేత్రముల్

అంగజరాగసంజనితమైన కరాంబుజ ముగ్గబట్టి, అ
య్యంగన కేలు కేలఁ గొనిఁ ఆదట మూర్కొనె నంత, నంతలో
నంగలువల్ విదర్పక్రియఁ నాళికనుల్ వికసించె; వెంటనే
చెంగున పారిపోయె, పరచెన్ వెనువెంటనె మాతరిస్వుఁడున్

కోమల బాహువల్లరులకున్ తల యొగ్గక కొంచుబోయెదో
కోమలి, యింత దూర మెట, కోయిక మాలతి! "ఆగు-ఆగు"-నా-
రామయు "రాకు! రాకు! ఇక రాజనదంచు" నదృశ్యమై లతా
స్తోమములో నొకానొక ప్రసూనముగా వికసించె నయ్యెడన్

పూవై పోయిన పూవుఁబోడికొఱకైఁ పుష్పాస్త్రుఁడస్త్రాకలన్
త్రోవన్, చెంత పికప్రభుండు కుహూకూ దుర్వారసంఘట్టనా
రావం బెంతయు నింప, గాసిలి జగత్ప్రాణుండు తద్వాసనా
ప్రావీణ్యంబును బూని తావియయి సంవాసించె నమ్మాలతిన్

---

# కన్యాచెఱ






శ్రీ వెంపటి సచ్చిదానందశర్మ

పాపాయిలూ! గుట్టు చప్పుడు కాకుండా లోలోపల సంజాటనపడి ప్రయోజన మేమీ లేదు; నెమ్మ విరిచి 'ఇది జరగా'లని చెప్పండి—వీలు చూసి సుమా! సీనయ్య పెదనాన్న లాటి వాడికే—వాడి పుణ్యమా, అని...రామనాథం వేళ్ళు మడిచి తర్జనితో దారి చూపించబోయేదాకా—కర్తవ్యం బోధపడకపోదా! రామలక్ష్మి సిగ్గుపడిందేమో అనుకో వచ్చు, మీారు. సీతాపతి ఐనా, నేరస్థుడిలాగ పెడ పెడగా తిరక్కపోతే 'నాన్నా! నాకిది కావా'లని జాబు అందివ్వకూడదూ?—

అందిస్తే, వదినగారితో ఈ 'కన్యాదానం' ఎప్పుడో జరిగిపోయేది! కన్యాదానాన్ని రెండు మూళ్ళు ఆరు ముళ్ళతో బిగించట మేమిటని విడ్డూరంగా మూతిమీద వేలు వేసుకుని లాభం లేదు. దీని కంతకూ సంధానకర్త గౌరవం, రామనాథానికి ఎలా దక్కిందో కూడా మనవిచేస్తా—

రామనాథం ఒకనాటి నిశరాత్రివేళ బిసబిసా తన గదిలోకి వచ్చి లెటర్ పాడ్ తెరిచి దీపంముందు కూర్చున్నాడు. రామలక్ష్మి, సీతాపతుల ప్రవర్తనను గురించి తను కాగితంమీద పెట్టాలనుకున్న విషయాలన్నీ అతని మనస్సులోనుంచి బయటికి రావాలని ఒక్క పెట్టున ఉరకలువేస్తూ కలం నడవకుండా చేస్తున్నై.

"పెద్దనాన్న గారికి,—నా ఉత్తరం మీకు కష్టం కలిగిస్తే దానికి కారణం అందులో వ్రాసిన విషయ స్వభావమేనని భావిస్తారనీ, ఒకవేళ నేను కళ్లారా చూచి చెవులార విని మీ దిద్దుబాటుకోసం యథార్థాన్ని బయటపెట్టటంలో నా తప్పేమైనా ఉంటే క్షమిస్తారనే నమ్మకంతో ఈ ఉత్తరం వ్రాస్తున్నాను." —అంటూ ఒళ్ళు తెలీని ఆవేశంతో ఒక పెద్ద ఉత్తరాన్ని తయారుచేశాడు.

ఉత్తరం మడుస్తూ గడియారంవైపు చూచేసరికి థళ్ళున రెండుగంటలు చూపిస్తోంది చిన్నముల్లు. బల్లమీది పుస్తకంక్రింద ఉత్తరాన్నుంచి పక్కమీదికి చేరాడు రామనాథం. కంటిమీదికి కునుకువచ్చే సూచనలు ఏమాత్రం లేవు. కనీసం నిద్రపోవటానికి ప్రయత్నం చెయ్యటంకూడా అనవసర మనిపించింది రామనాథానికి.

పక్కమీద పడుకుని గతమంతా తిరగదోడు కుంటున్న రామనాథాన్ని ఇప్పుడు కదిలిస్తే అంటాడు—నేను ఆ యింట్లో అడుగుపెట్టిన మరు క్షణంలోనే పసికట్టాను రహస్యమంతా—అని.

సరే, ఇందులో కొంత అతిశయోక్తి ఉంటుం దనుకోండి—

యాతావాతా—ఎలాగైనా ఈ ఉత్తరం సీనయ్యగారికి అందజేసి తనుమరీ రైలెక్కా లనుకున్నాడు. దీనివల్ల రాబోయే పరిణామ మేమిటని పరిపరివిధాల ఆలోచించాడు రామ నాథం. కాలేజీలో చేరటానికి వచ్చిన ఆనాటినుంచీ శెలవలకి ఇంటికి వెళ్లటానికి తయారవుతున్న ఈనాటి వరకు ఈ ఇంట్లో గడిచిన తన జీవితమంతా తెరమీది బొమ్మల్లాగా వద్దనుకున్నా కళ్లకు కడుతోంది.

కాలేజీలు తెరవగానే, ఒక శుభోదయాన తండ్రి చాటున అడుగుల్లో అడుగువేసుకుంటూ సీనయ్యగారింటికి నడిచాడు రామనాథం.

పరీక్ష ఫలితాలు తెలిసినప్పటినుంచీ ఇంట ర్మీడియేట్ గండం గడిచి బియ్యేలో చేరబోతున్నా నన్న గర్వంతో రామనాథం మనస్సు కలవర పడ్డది. కాస్సేపు ఆ విషయం మరిచి ప్రశాంతంగా ఉందా మంటే వాడి శక్యం కాకపోయింది.

పరీక్ష అవటమంటూ ఉంటే హాయిగా, ఒంటరిగా హాస్టల్లో ఉంటూ బియ్యే చదువు సాగిద్దా మనుకున్నాడు రామనాథం. కాని, తండ్రి అది పడ నిచ్చాడు కాదు. ముక్కుకి తాడుపోసినట్టు లాక్కొ చ్చాడు సీనయ్యగారింట దిగ విడిచిపోవటానికి.

సీనయ్యగారింట అడుగుపెట్టగానే రామనాథం ఉబలాటం ఇంకా దెబ్బ తింది.

సీనయ్యగారిది కలిగిన కుటుంబం—మహాలక్ష్మి లాటిభార్య యశోదమ్మ, ఇంటర్మీడియేట్ పరీక్షకి వెళ్లబోతున్న కొడుకు సీతాపతి, బియ్యేచదువుతున్న కోడలు—అంతా పెద్దఎత్తులో వ్యవహారం.

స్వగృహమైన తన పూరిపాకలో మిరుమిట్లు గొలిపిన తన బియ్యే, సీనయ్యగారి మేడలో వెలాతెలా పోతున్నట్లనిపించింది రామనాథానికి.

దీనికి తోడు, ఎదటివాళ్ళు తబ్బిబ్బయేటంత ఆదరణచూపించాడు సీనయ్యగారు. రామనాథానికి తండ్రి దార్లోనే చెప్పాడు—సీనయ్య తనకి బంధువుల్ని మించిన ఆప్తమిత్రుడని. తండ్రిమాటలు అక్షరాల నిజ మనిపించింది రామనాథానికి. అనూతన పరిసరాల్లో ప్రతి చిన్నవిషయం రామనాథంలో కుతూహలాన్ని రేకెత్తించింది. వెళ్లగా హాల్లో ఉన్న కుర్చీలు, బీరువాలకేసి చూడటం ప్రారంభించాడు.

వెంటనే పరామర్శలయింతర్వాత, "ఒరేఅబ్బీ! ఇప్పుడే చెప్తున్నాను. చెప్పుల్లో కాళ్లెట్టు కొచ్చావంటే ఆపైన లాభంలేదు. రాకరాక వచ్చావు...... నిన్ను తేలిగ్గా వదల్ను!" అన్నాడు సీనయ్య, పడక కుర్చీ లోనుంచి ముందుకి వంగి. వృద్ధాప్యంలోకి దొర్లుకుపోవటానికి సిద్ధంగా ఉన్న ఆ వడి వయసులో సీనయ్య తన తండ్రితో అలా కులాసాగా మాట్లాడుతుంటే విన ముచ్చటగా వుంది రామనాథానికి.

"ముందరి కాళ్లకి బంధమైతే వేశావు. బాగానే వుంది. మరి నేను చెప్పవలసిన సమాధానం కూడా విను..." అంటూ ఏదో సమాధానం చెప్పబోయాడు రామనాథం తండ్రి—నాలుగురోజుల తర్వాతకూడా సీనయ్యగారిని వదుల్చుకుని స్వగ్రామం చేరటం బ్రహ్మప్రళయమైంది ఆయనకి!—ఇది తరవాత విషయం అనుకోండి!

ఈ దృశ్యం ఇప్పటికీ కూడా రామనాథానికి కళ్ళల్లో మెదులుతూ ఉంటుంది—ఇంతలో రామలక్ష్మి ప్రవేశించి, "లైటు వేసుకోవటం కూడా మరిచి మాట్లాడేస్తున్నారే!" అంటూ స్విచ్చినొక్క జిగేలు మనిపించింది. ఎవరన్నట్లు చూచారు తండ్రి, కొడుకు లిద్దరూ.

"మా పెద్దవాడి భార్య—రామలక్ష్మి. పూర్వమే స్కూల్ ఫైనల్ పరీక్ష అయింది తెలుసుకదూ? వాడు పోయినదగ్గరనుంచీ ఇక్కడే ఉంచి చదువు చెప్పిస్తున్నాను. నిరుడు ఇంటర్మీడియేట్ పరీక్ష యింది. ఈ ఏడు బియ్యేలో చేరింది."

గుండె పగిలేటంత దారుణమైన విషయాన్ని చెబుతున్నప్పుడు కూడా సీనయ్యగారి ముఖంలో బాధ ఒక క్షణంపాటే కనిపించింది. అంతే! కష్టాల్ని ఖాతరు చెయ్యనట్టు అంతవిషాదాన్ని దిగమింగి నవ్వు ముఖం పైకి తెచ్చుకుంటూ సంభాషణ మార్చేశాడు సీనయ్య.

సానుభూతి చూపించాలో, అవసరం లేదో తెలియక రామనాథం, తండ్రీ కళవళపడ్డారు.

ఎదటివాళ్ళకోసమన్నా—రామలక్ష్మి కూడా విచారపడుతున్నట్లు పైకి కనిపించటం లేదు! వీళ్లేదో విచిత్రమైన మనఃప్రవృత్తులు గలవాళ్ళనుకున్నాడు రామనాథం.

"రాముడూ! వీడే రామనాథం......వీడూ బియ్యేలో చేరటానికే వచ్చాడు" అన్నాడు సీనయ్య నిశ్శబ్దత భంగపరుస్తూ.

రామలక్ష్మి మామగారి మాటల్ని వదిలి, "నాకు ఆనర్సుకి సీటుఇచ్చినట్లు ఇవ్వాళే యూనివర్సిటీ నుంచి ఉత్తరం వచ్చింది మామయ్యా! మరో అవకాశ మేమీ లేకపోతేనే కాని, ఎందుకీ బియ్యే! నన్ను ఆనర్సుకి పంపు మామయ్యా!" అంది గోముగా.

రామనాథానికి తలకొట్టేసినట్లనిపించింది. ఎంత ఆనర్సుకి సీటువస్తే మాత్రం తను బియ్యేలో చేరటానికి వచ్చాడని తెలిసిన తరవాత కూడా బియ్యే అంటే అంత చులకనగా మాట్లాడినందుకు రామలక్ష్మి మీద చాలా కోపం వచ్చింది.

"శఠం కట్టేశావు కదమ్మాయ్! ముంచుకు పోయిందేముంది...ఎమ్మే చదువుదూగాని...విన్నా, బియ్యేమాత్రం ఏమంత పుచ్చిపోయిందా ఏమిటి?" అన్నాడు సీనయ్యగారు.

ఈ మాటలు రామనాథాన్ని ఏమాత్రం సంతృప్తిపర్చలేకపోయినై. బియ్యే తక్కువతనాన్ని గురించి వాళ్ళిద్దరూ అలా చిందులాడుతున్నట్లు

మాట్లాడుకోవటం మరింత బాధించింది రామనాథాన్ని.

ఇంతలో, సీతాపతి బాటు పుచ్చుకుని హాల్లో నుంచి చరచరా లోపలికి వెళ్లాడు. "వాణ్ణి తెలుసుగా! మా రెండోవాడు, సీతాపతి...ఈ ఏడు ఇంటర్మీడియేట్ పరీక్షకి వెడతాడు" అంటూ తెలియజెప్పాడు సీనయ్యగారు.

తరవాత, వెంటనే మాట్లాడతగ్గ విషయం దొరక్క అంతా ఒక క్షణంసేపు నిశ్శబ్దంగా గడిపారు.

"ఇంతకీ నేను చెప్పవచ్చినమాట అలానే ఉండిపోయింది—నీళ్ళగదిలో వేణ్ణీళ్లు సిద్ధంగా ఉన్నాయిట. స్నానాలకి లేవండి" అంది తృళ్ళిపడ్డట్టు.

తండ్రి ప్రోత్సాహంమీద రామనాథం స్నానానికి లేచాడు.

వెళ్ళిపోబోతున్న రామలక్ష్మితో సీనయ్యగారు "రాముడూ! కాస్తవీడికి నీళ్లగది చూపించు మరి...కొత్తాయె..." అన్నాడు.

ఇద్దరూ బయలుదేరారు.

సీనయ్యగారు స్త్రీవిద్య, వితంతు వివాహాల మీద సంభాషణ ప్రారంభించారు. బాలవితంతువు లెవరూ ఇంట్లో లేనంత వరకు, ఎదురు లేకండా సీనయ్యగారు మాట్లాడుతుంటే ఈ ఇంట్లో వ్యక్తుల తరహాలన్నీ విపరీతమైనవనుకున్నాడు రామనాథం.

లోపలి హాలుకి ఎదురుగా వున్న గదిచూపించి "అది మీ గది. మీసామాన్లు ఆగదిలోనే ఉన్నై." అంది రామలక్ష్మి. రామనాథం అంటాడు—ఈమాటలు రామలక్ష్మి కాన్వెంట్ స్కూల్ మేట్రన్ లాగా అందిట!

రామనాథానికి మాట్లాడకండా ఉండటం ఇష్టంలేకపోయింది. "మీ గ్రూపు ఏమిటండీ?" అన్నాడు.

"హిస్టరీస్...మీది?"

"నాదీ అదే... అన్నాడు రామనాథం ఉత్సాహమేమీ ప్రదర్శించకండా.

"నేను ఇంగ్లీష్ లిటరేచర్ కి మార్చేస్తాను... హిస్టరీస్ క్లాసు ఒకడస్టుబిన్!" అంది రామలక్ష్మి నిర్లక్ష్యంగా.

రామలక్ష్మి అకారణంగా తన మనస్సునింతగా ఎందుకు బాధపెడుతుందో అర్థంకాకపోయింది రామనాథానికి. ఎదటివాళ్లని మరిచి కేవలం తన ఊహలని బయటికి చెప్పటమే ఆ అమ్మాయి స్వభావమేమో ననుకున్నాడు.

"అసలు నే నెందుకు పరీక్ష అయ్యానా అనిపిస్తోంది! లేకపోతే మళ్లా ఇంటర్మీడియెట్ పరీక్షకి వెడుతూ ఉండేదాన్ని సీతాపతితో బాటు."

రామలక్ష్మి ఈ మాటలు తనని వినమని అంటోందో, లేక, స్వగతమో రామనాథానికి బోధపడకపోయింది. ఇప్పుడు, సహేతుకని ఆలోచిస్తుంటే ఈ మాటల్లో రామనాథానికి కొంచెంత అర్థం స్ఫురిస్తోంది. కాని, అప్పట్లో తను చెప్పతగ్గ సమాధానం ఏమీ లేక ఊరుకున్నాడు.

రామనాథానికి నీళ్ళగది చూపించి రామలక్ష్మి వెళ్ళిపోయింది.

స్నానం చేస్తున్నాడేగాని రామనాథం మనస్సు ఎలాగో ఉంది. పరిసరాలతో బాటు ఈ నూతనవాతావరణంలో మనుష్యుల తీరుకూడా తన కపరిచితమైనదిగా వుండి మరింత కొత్త అనిపించింది. రెండు చెంబుల నీళ్ళు ఎలాగో దిమ్మరించుకుని బైటపడ్డాడు.

రామనాథం వసారాలోకి వచ్చేసరికి, సీతాపతి ఒక్కడూ ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ కూర్చుని ఉన్నాడు. రామనాథం వచ్చి ఆవతలగా వున్న కుర్చీలో కూర్చున్నాడు. కొద్ది క్షణాలు ఇద్దరూ మాటా పలుకూ లేకండా గడిపారు.

సీతాపతి చాలా బిడియస్థు డనుకున్నాడు రామనాథం.

రామలక్ష్మి హడావిడిగా వసారాలోకి వచ్చి, వాళ్ళిద్దరినీ ఒక క్షణం పరకాయించి, అలా కూర్చోటానికి కారణం కనిపెట్టినట్టు "మరిచాను! మిమ్మల్ని పరిచయం చెయ్యాలనుకుంటాను కదూ? 'సీతా! ఈయనే రామనాథంగారు. ఇక్కడవుండి బియ్యే చదవటానికి వచ్చారు." అని, రామనాథంతో "ఈయన మిస్టర్ సీతాపతి..." అంటూ, స్నేహంగా ఉండమని పరిచయవాక్యం పలికింది.

తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో ఇద్దరూ ఏదో మాట్లాడబోతున్నారు.

ఇంతలో, యశోదమ్మగారు, "రాముడూ! భోజనానికి పిల్చుకురమ్మని పంపితే, నువ్వు కూడా ఇక్కడే ఉండిపోయావా......వాళ్ళని పిల్చుకు రావటంపోయి!" అంటూ నిలబడ్డది వాళ్ళ మధ్య.

కొత్తస్నేహితు లిద్దరితో, "మాట్లాడుకోటానికి రెండేళ్ళు పైముంది. ముందు భోజనానికి లేవండి!" అని, "అదికాదత్తయ్యా! ఎవరన్నా పరిచయం చేస్తేనే కాని మాట్లాడుకోరాదని మూగనోముపట్టి కూచున్నారు ఈ దొరలు! అందుకని, పని చేసుకుని వాళ్ళిద్దరి మధ్య ఆ తెర తొలగించాను!" అంది రామలక్ష్మి యశోదమ్మగారితో లోపలికి వెళుతూ.

భోజనాలముందుకూడా రామలక్ష్మిది అదేతీరు! యశోదమ్మగారు వడ్డిస్తూంటే "అత్తయ్యా! సీతాకి ఇది కావాలని అడగటంకూడా చేతకాదు. కనిపెట్టి వడ్డించాలి..." అంటూ వేళాకోళం చెయ్యటం మొదలుపెట్టింది, కొత్తవాళ్లు ఉన్నారనైనా గమనించకుండా.

సీతాపతి సిగ్గుతో కుంచించుకుపోవటం మొదలు పెట్టాడు!

"రామనాథంగారి స్నేహంతో మన సీతాకి చొరవ అబ్బితే అబ్బవచ్చు..." అంది రామలక్ష్మి మళ్ళీ. రామనాథం గుండె గతుక్కుమంది.

యశోదమ్మగారు నెయ్యివడ్డిస్తూ నవ్వి "నువ్వు మరీను...ఎదటివాళ్లని మాటలతో హడలగొట్టేస్తుంది" అంది.

సీనయ్యగారు నవ్వి ఊరుకున్నాడు.

రామనాథానికీ, తండ్రికి రామలక్ష్మి తీరు విడ్డూరంగా ఉన్నా కప్పిపుచ్చుకుంటున్నారు.

అప్పటినుంచి, ఈనాటివరకు...

సీనయ్యగారి కుటుంబంతో తన పరిచయం చాలా సన్నిహితమైంది—సీనయ్యగారు పెదనాన్న అయాడు. యశోదమ్మగారు తల్లికంటె ఆదరణ చూపిస్తూ దొడ్డమ్మ అయింది. సీతాపతి తనకి కూడా 'సీతా' అయాడు. రామలక్ష్మిని మాత్రం 'రామలక్ష్మీ!' అనే పిలుస్తున్నాడు; కాని, చాలా చనువుగా.

కేవలం యథాలాపంగా ఉన్న సమయాల్లోనే గాక, ఏ విషయాన్ని గురించైనా తీవ్రంగా ఆలోచిస్తున్నప్పుడు కూడా ఏదో విధంగా రామలక్ష్మి తీరు, మాటలూ జ్ఞాపకం వచ్చేవి రామనాథానికి. ఆ అమ్మాయి ప్రవర్తనలో ఏదో రహస్యం ఇమిడి వుంటుందనిపించేది.

...అలా, తెలీకుండానే అతని మనసు ఊహలు అల్లేసేది. తరవాత కొంతసేపటికి తృళ్ళిపడ్డట్టు అసలు విషయాన్ని మరిచి రామలక్ష్మి గొడవలో పడ్డానని ఆత్మనిందకి దిగేవాడు!

ఇలాటి ఆత్మ పరిశోధన రామనాథం చాలా సార్లు చేసుకున్నాడు. ఒక నాటి, ఇలాటి విశేష ఘడియల్లో రామనాథం తనగది కిటికీముందు నిలబడి తోటలో చీకటి పడటం గమనిస్తున్నాడు యథాలాపంగా. దూరంగా తిన్నెమీద ఎవరో కూర్చుని వుండటం రామనాథం కళ్ళపడ్డది. పరీక్షగా చూచాడు—రామలక్ష్మి!

ఇంట్లో, లోపల ఎక్కడో యశోదమ్మగారు, పనివాళ్లూ తప్పితే మరెవరూ లేరు—సీతాపతి ఇంకా కాలేజీనుంచి ఇంటికి రాలేదు. సీనయ్యగారు ఎక్కడికో వెళ్లాడు.

రామనాథానికి గుండె గొంతుదాకా ఎగదట్టినట్టయింది. అక్కడికి వెడదామనిపించింది. కాని కాళ్ళు చచ్చుపడ్డట్టనిపించింది. ధైర్యం చిక్కబట్టి అడుగుముందుకి వేశాడు. రామలక్ష్మి ముందుకి చేరేదాకా ఎలా నడవగలిగాడో రామనాథానికే తెలీదు.

యథాలాపంగా ఉన్న రామలక్ష్మికి ఎదురుగా రామనాథం కనబడేసరికి ఒక్కసారి కళవిళపడ్డది. వెంటనే నవ్వుముఖం పెట్టబోయింది. కాని, ఆమెకళ్ళు నీళ్ళతోనిండి ఉండటం గమనించాడు రామనాథం.

ఏమి మాట్లాడాలో రామనాథానికి తోచలేదు. "ఏడుస్తున్నావా? రామలక్ష్మీ!" అన్నాడు తెప్పరిల్లి, ఎలాగైతేనేం.

తన గుట్టు బయటపడ్డట్టు బాధపడ్డది రామలక్ష్మి. "అవును. ఎందు కేడుస్తున్నానో కూడా వింటారా?" అంది నిండుకన్నీళ్లతోనే. రామనాథం తనని బహువచనంతో సంబోధించడం విని గాభరా పడ్డాడు.

రామలక్ష్మి నవ్వుతూ, "జీవితమంతా ఒకటే నవ్వులూ, ఒకటే వేళాకోళాలూ, వెక్కిరింతలూ

స్థాపనము. మొట్టమొదట రాజధాని కళాశాలలో ఆంధ్రభాషాభివర్ధనీ సమాజము"ను స్థాపించినది పంతులుగారే. వారివెనుక వీరేశలింగము పంతులు గారు దీనియందంత శ్రద్ధ వహింపలేదు కాని యీ వెనుక శ్రీ వావిలి కొలను సుబ్బారావు పంతులుగారు దీనిని యున్నతదశకు దెచ్చిరి. ఇది క్రీ. శ. ౧౮౭౦ లో స్థాపితమైనది. మఱి రాజధానిలో కళాశాలలో తెలుగు సమాజముల కన్నింటికంటె మొదటిది. ఈ సమాజము వార్షిక నివేదికలు చదివిన యీ కాలమున నాంధ్రభాషా విషయమున కళాశాలలయం దెంత శ్రద్ధ యుండెడిదో తెలియగలదు. ఈనాడు రాజధానీ కళాశాలవారు దీనికి హీరోత్సవము (*Diamond Jubilee*) చేయవలసిన యావశ్యకత గలదు.

## 2. గ్రంథరచనము

ఈ పండితపదవిని వహించునప్పుడే పంతులవారి యుద్గ్రంథములు రచితములై ప్రకటితములైనవి. (౧) బిల్వేశ్వరీయము. ఇది తిరువళ్ళ క్షేత్ర మహాత్మ్యమును దెలుపు నిర్వచన మహాకావ్యము. ఇందు పంతులవారు పరిశోధించి వ్రాసిరి ... [illegible] చార్యులవా రచ్చువేయించిరి. అధునాత నాంధ్ర వాఙ్మయమున నీ గ్రంథముయొక్క ప్రత్యేకత-స్థానము పై గ్రంథమునందు చూడనగును. (౨) ప్రసన్న రాఘవ నాటకము ఇది జయదేవ కవి కృతసంస్కృత నాటకమునకు తెనుగు. దీనిపై కీర్తిశేషులు వేదము వేంకటరాయ శాస్త్రులవారు పెద్ద విమర్శన ఖండా వాయించిరి. పంతులవారు దానికి ప్రతిగా జయభేరి ప్రయోగించిరి. (౩) ధనంజయ విజయ వ్యాయోగము. ఇది కాంచనాచార్యుని సంస్కృత వ్యాయోగమునకు తెనుగు. వైజయంతిలో ప్రకటితమైనది. క్రీ. శ. ౧౮౭౨ నుండి ౧౮౭౭ వఱకు నాంధ్రభాషా సంజీవనీ పత్రికను నడపిరి.

క్రీ. శ. ౧౮౭౭లో వీరు రాజమహేంద్రవరము కళాశాలకు పండితులుగా మార్చబడిరి. ఈ మార్పు వీరేశలింగము పంతులవారివలననే జరిగినదని, ఫలశ్రుతిగా తమ దయవలన ప్రతిదినము గౌతమీ స్నాన ఫలము నాకు లభించినదని వేంకటరత్నము పంతులు గారు వారికి వ్రాసినారట. రాజమహేంద్రవరము ... వదలినవెనుక, కీ. శేషులు శ్రీ రాజామంత్రి ప్రెగడ

ముగా సత్కరించిరి. పంతులుగారు సింహాచల యాత్ర అను పద్యకృతిని, విశ్వేశ్వర శతకము అను శతకము రచియించిరి. ఇవి శ్రీ విక్రమదేవవర్మగారచ్చు వేయించిరి. ఆపైని పండిత పదవియందే కాలము గడుపుచు, కొర్కొండ మహాత్మ్యము. (కుమారనృసింహము)

మంగళగిరి మహాత్మ్యము (పావకము) అను గ్రంథములు రచించిరి. ఇది రచితమైన యనంతరము, సంస్కృతపండిత జనేతర దుర్లభమగు,

## మహామహోపాధ్యాయ బిరుదము

క్రీ. శ. ౧౯౦౬ సంవత్సరమున లభించెను. ఈ బిరుదము సంస్కృత పండితులకేగాని దేశభాషా పండితులకు లభ్యముకాదు. మొదట ౧౮౮౬ లో నీ బిరుదము శ్రీ పరవస్తు రంగాచార్యులవారి కొసగిరి. వారు సంస్కృత విద్యాసర్వస్వమని చెప్పదగినవారు. వారు ద్రవిడదేశ వైష్ణవులు అరవము మాతృభాష గలవారు. కాగా శుద్ధాంధ్ర దేశీయుడై, ఆంధ్ర సాహిత్యము నాలంబనముగా గొన్న పండితులలో నీ బిరుదము నందుటకు పంతులుగారు ప్రథములు. ఈ బిరుద ప్రదానము గావించిన సభలో పంతులుగారు ప్రభుత్వమువారీ బిరుదము నొసగుట, దేశభాషయగు తెనుగును గౌరవించి సంస్కృతభాషతో సమానమైన స్థానము నొసగుటయని చెప్పినారట. క్రీ. శ. ౧౯౧౨ లో దీక్షిత చరిత్రము గ్రంథమును రచియించిరి. పంతులవారు సాహిత్య ప్రపంచమున ప్రఖ్యాతులై నియంతలగుటచేత నా కాలమున నే గ్రంథమైన వారి యభిప్రాయ ముద్ర లేకుండ వెలువడెడిది కాదు. శ్రీ వావిలి కొలను సుబ్బారావుగారికి ఆంధ్ర వాల్మీకి బిరుదము నిచ్చినది పంతులుగారే.

ఆంధ్రపత్రిక ప్రథమ సంవత్సరాది సంచిక నుండి పంతులువారు పద్యములను వ్రాసెడివారు. వారి తుదిరచన మొదటి మహాప్రపంచ సంగ్రామము. దానికి వారు "యూరపుఖండ ఘోరరణసంభవ భావ్య దశాన్వేషకము" అని పేరిడినారు. ఇట్లు గ్రంథ రచన, కవితా రచనయందే కాలము గడిపి, క్రీ. శ. ౧౯౧౫ డిసెంబరు ౧౮ తేదిని కీర్తిశేషులైరి.

అయితే విసుగ్గా వుంటుంది. అందుకని అప్పుడప్పుడు తీరిగ్గా కూర్చుని ఇలా ఏడుస్తూ ఉంటాను. మీరు కూడా ప్రాక్టీస్ చెయ్యండి! చాలా బాగుంటుంది!" అంది కన్నీళ్ళు తుడుచుకుంటూ.

ఇన్నాళ్ళ తరవాత తీరిగ్గా మంచంమీద పడుకుని ఆలోచిస్తున్నా ఆ మాటలకి తను చెప్పతగ్గ సరైన సమాధానం స్ఫురించటం లేదు రామనాథానికి. కాని, ఇప్పు డనుకుంటున్నాడు—అంతటితో తను రామలక్ష్మిమీద కత్తికట్టి ఉంటే చాలా బాగుండే దని!

రామలక్ష్మి నవ్వులో, అల్లరితనంలో ఏదో పెద్ద మోసముందనుకున్నాడు రామనాథం. రామలక్ష్మి నలుగురిలో ప్రదర్శిస్తున్న చురుకుదనం, మాటకారితనం అంతా ఉట్టి డాంబికమనీ... బైటికి చెప్పటానికి వీలుకాక మనసులో కప్పిపెట్టుకుంటున్న తన కోర్కెలనీ, వ్యథనీ బైటివాళ్ళకి తెలియకుండా మభ్యపెట్టటానికి అవలంబిస్తున్న పటాటోపమనిన్నీ స్థిరంగా నిర్ణయించుకున్నాడు.

ఇలా, రామనాథానికి తెలియకుండా అతని మనసులో రామలక్ష్మి తిష్ఠవేసుక్కూచుంది! దినమంతలోనూ ఏ కొద్ది క్షణాలో తప్పితే మంచిగానో చెడుగానో అతని ఊహలు రామలక్ష్మివైపు మొగ్గేవి.

రామలక్ష్మి చర్యలు జాగ్రత్తగా గమనించటం మొదలుపెట్టాడు రామనాథం. నలుగురిలో ఉన్నప్పటి సంతోషం రామలక్ష్మిలో ఒంటరిగా వున్నప్పుడుండేది కాదు. అలా, ఒంటరిగా ఉన్నప్పుడు రామలక్ష్మి పడే విచార మేమిటి?—రామనాథం మనస్సు పరిపరివిధాల ఆలోచించేది.

తరవాత, రామలక్ష్మి ప్రవర్తనలో కూడా చాలా మార్పు కనిపెట్టాడు రామనాథం. వెనకటి పరిహాసం చాలవరకు తగ్గిపోయింది. తనూ రామలక్ష్మి పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ తోటలో చాలా సాయంత్రాలు గడిపారు. రామలక్ష్మితో మాట్లాడుతున్న అనుక్షణం ఆమెను జాగ్రత్తగా గమనించాడు రామనాథం. ఆవిడేదో ఒక భయంకరమైన హద్దుపైన నిలబడి దాన్ని దాటాలని ఉరకలువేస్తూ దాటలేక తబ్బిబ్బవుతున్నట్లనిపించేది రామనాథానికి.

తను చేయూత నివ్వగలవాడ ననుకోవటానికి రామనాథానికి అట్టే కాలంపట్టలేదు!

ఒకనాటి సాయంత్రం కాలేజీనుంచివచ్చి, తోటలోకి వెడుతూ రామనాథాన్ని కూడా ఆహ్వానించింది రామలక్ష్మి! బైటపడటాని కిదే సమయమన్నట్లు అతని మనస్సులో ఊహలు కలవరం ప్రారంభించినై.

మాట్లాడకుండా ఇద్దరూ ఒకరి వరస నొకరు తోటలో గడ్డి ఒత్తుగా ఉన్నచోటికి నడిచారు. "ఏదో దీర్ఘాలోచనలో పడ్డట్టున్నారే!" అంది రామలక్ష్మి నవ్వుతూ, కూర్చుంటూ.

రామనాథం కంగారుగా "అబ్బే... ఏమీలేదు" అంటూ రామలక్ష్మి కళ్ళల్లోకి చూశాడు.

ఆమె తీరు, తన మనస్సులోఉన్న ఊహలు గ్రహించినట్లు, బైటికి చెప్పమని ప్రేరేపిస్తున్నట్లూ, అనిపించింది రామనాథానికి. ప్రయత్నంమీద నోట్లో మాట దాచుకోగలిగాడు!

"బహుశా, నన్నేమైనా తిట్టుకుంటున్నా రను కుంటాను!" అంది రామలక్ష్మి.

"నీ కిష్టమైతే మనం వివాహం చేసుకుందాం"

రోజుల తరబడి ఆలోచించి గుదిగూర్చిన ఈ నాలుగుమాటలూ ఎలా అనేశాడో రామనాథానికే తెలీదు! కాని వెంటనే విచారపడ్డాడు—"నిన్ను దూషించటంలేదు; భూషిస్తున్నాను..."అంటూ ఒక చిన్న ఉపోద్ఘాతం తరవాత ఈమాటలు అని ఉంటే బాగుండేదని! రామలక్ష్మి తన మాటలు ఎలా తీసుకుంటుందోనని గుండెల్లో దడప్రారంభమైంది. ఆమె ముఖంవైపు చూడలేకపోయాడు. చూచినా కళ్ళు చీకట్లు కమ్మి ఆమె కనిపించటంలేదు! నోరు జారినందుకు తనని తానే నిందించుకోవటం మొదలు పెట్టాడు రామనాథం.

రామలక్ష్మి చాలా సాదాగా "...కాని, నా కలాంటి అభిప్రాయ మేమీ లేదు; ఇకముందెప్పుడూ ఇలాంటి ప్రస్తావన తేవద్దు" అంది!

రామలక్ష్మి ఇలా మాట్లాడకుండా నాలుగు తిట్లూ, పదిఎత్తిపొడుపుమాటలూ మాట్లాడితే రామనాథం ఆశ్చర్యపడకుండా అర్థంచేసుకోగలిగేవాడు! రామలక్ష్మి అలంకార రహితంగా మాట్లాడగా తను విన్నది ఆ ఒక్కసారి మాత్రమే!

రామనాథం చాలా ఘోరమైన తప్పిదం చేసినట్లు బాధపడటం మొదలుపెట్టాడు. తన గుట్టంతా బయటపడిపోయినట్లు, తనిప్పుడు రామలక్ష్మి చేతులలో కీలుబొమ్మ అయిపోయినట్లు బాధపడటం మొదలు పెట్టాడు. కాని, ఇప్పుడైతే నిర్భయంగా అంటాడు. రామలక్ష్మి వలయాలు పన్ని తనచేత ఆమాటలు అనిపించింది—అని!

ఎక్కడికైనా వెళ్ళిపోదా మనిపించింది రామనాథానికి. కాని, అది అసలు అనుమానానికి దారి తీస్తుందని, ఒంట్లో బాగా లేదని తన గదిలో ముసుగు బిగించిపడుకున్నాడు.

రామలక్ష్మి మాత్రం ఏమీ జరగనట్లు తన సహజ ధోరణిలో నవ్వుతూ కేరింతాలు కొడుతోంది. ఆనవ్వు మాటున ఎన్ని రహస్యాలు దాచుకోగలదో!—అనిపించింది రామనాథానికి. దుప్పటిలోపలి రామనాథం ముఖం కోపంతో జేవురించింది.

రాత్రి బాగా ప్రొద్దుపోయింది. ఇంట్లో అంతా నిద్రపోతున్నారు. రామలక్ష్మి, సీతాపతి మాత్రం దీపం ముందు కూర్చున్నారు పరీక్ష చదువుకని. పెద్దవాళ్ళని జోకొట్టటానికైతే అంత నేపూ పాఠాలు చదివారు కాని, వాళ్ళు అదమరచి నిద్రపోగానే వీళ్ళమాటలు వేరువిధంగా మారినై—

"సీతా! మామయ్యతో చెప్పలేదుకదూ?"

సీతాపతి మౌనంగా తలవంచుకు కూర్చున్నాడు.

"మామయ్యతో నేనే చెప్పేస్తాను. మరేమీ అనడు...అంతా నీ భయమే కాని......నాకు తెలుసు"

"ఒద్దు...రాముడూ! నామాట విను...నేనే చెప్తాను" అన్నాడు సీతాపతి తడబడుతూ.

"ఇక్కడికి సవా లక్షసార్లయింది నువ్వు చెప్తాననటం! మామయ్య అడిగిందల్లా ఇచ్చే ధర్మాత్ముడు! అలాటి వాడి దగ్గిరకెళ్లి నాకిది కావాలని చెప్పలేకపోతున్నావు, రేపు మామయ్యతో అంతా చెప్పి సంతోషంతో ఒప్పుకునేట్టు చేస్తాను......చూడు!"

"రాముడూ!" అన్నాడు సీతాపతి భయంతో ఒణుకుతున్నట్టు.

ఈ సంభాషణంతా చాటుగా వింటున్న రామనాథానికి ఇదంతా కలేమో ననిపించింది. దూరదూరంగా ఉంటున్న సీతా ఇంత ఘనుడా అని ఆశ్చర్యపోవటం మొదలుపెట్టాడు.

రామలక్ష్మి తనవంత అవమానించటానికి కూడా కారణం అర్థమైందనుకున్నాడు రామనాథం.

రామలక్ష్మికి సరైన సమాధానం చెప్పతగ్గ అదను దొరికినట్టనిపించింది, రామనాథానికి. చల్లగా వాళ్ళ ఎదటికి వచ్చి "ఎవరు చెప్పాలని మీ తర్జన భర్జన అనవసరం. మీ ఇద్దరితరఫున ఆ శ్రమ నేను పడతాను-పెద్ద నాన్నకు నేనే చెప్తానులే" అన్నాడు ఆవేశంతో.

రామనాథం ప్రవేశంతో సీతాపతి వణికిపోతున్నాడు. రామలక్ష్మి తన్ను తాను సంబాళించుకుని "మాకోసం మీరు పడబోతున్న శ్రమకి మా ఇద్దరి తరఫున కృతజ్ఞత...మా పెళ్ళి పెద్దరికం మీకే దక్కేట్టు తప్పకుండా చూస్తాం. మరొక్క విషయం—మా విషయం అలా వుంచి, మీ విషయం మామయ్యతో చెప్తానేమో నని ఏ నుయ్యో, గొయ్యో, చూచుకునేరు! పెళ్ళిపెద్దలు మీరవటం ముఖ్యం!" అంది మహో వక్తలాగా.

సీతాపతి ఇద్దరినీ చూస్తూ నిలబడ్డాడు!

"ఊహించనైనా ఊహించరాని ఇలాటి సంబంధం కలిగివున్నందుకు సిగ్గైనా లేకపోవటం విచారకరం!" తను అనాలనుకున్న ఈ నాలుగు ముక్కలూ అని గదిలోకి బయలుదేరాడు.

"మా సంబంధం మీకైనా సవ్యంగా ఊహించలేకపోయారే అనే మా విచారం!" తిరోగమిస్తున్న సైనికుడి పైకి బాంబులాగా విసిరింది మాటల్ని రామలక్ష్మి!

* * * *

రామనాథానికి ఎప్పుడు కునుకుపట్టిందో తెలీదు. నిద్రలేచేసరికి బారెడు పొద్దెక్కింది. తలంతా నాదుగానూ, ఒళ్ళంతా భారంగానూ ఉంది. రాత్రంతా ఒక పీడకల అనిపించింది.

లేచి కూర్చుని జేబులవైపు చూచాడు. పుస్తకం కింది ఉత్తరం రాత్రి జరిగిందంతా యధార్థమని బుజువు చేస్తోంది. టూత్ బ్రష్, సబ్బు, తువ్వాలు పుచ్చుకుని నీళ్ళగదికి బయలుదేరాడు. ఆ ఉత్తరం సీనయ్యగారికి అందించితీరాలని పళ్లుతోముకుంటూ మరోసారి అనుకున్నాడు రామనాథం.

మళ్ళీ ఏదో అనుమానం తగిలి గదికి బయలు దేరాడు. తలుపులు తీసి ఉన్నై. అదరాబాదరా రామనాథం గదిలో ప్రవేశించాడు.

రామలక్ష్మి పుస్తకం కింది ఉత్తరం తీసి జేబులో దాచేసింది. "పోస్టుబంట్రోతు పని నేను చేస్తాను!" అని నవ్వటం ప్రారంభించింది.

రామనాథానికి ఆనవ్వు చాలా వెకిలిగా కనిపించింది. తన ఉత్తరం తన కివ్వమని మరి మరి అడిగాడు, అంతకంటే చేసేదిలేక!

"రామనాథంగారూ! మీరు ఈపాటి దానికి సంసిద్ధులని నేను ఇంతవరకు నిజంగా నమ్మలేదండీ... వస్తా!" అని మాయమైంది రామలక్ష్మి.

రామలక్ష్మి ఆ ఉత్తరం ఇచ్చితీరుతుందన్న నమ్మకం కలిగిన దగ్గరనుంచీ సీనయ్యగారు ఆ ఉత్తరాన్ని ఎలా తీసుకుంటారన్న మథన ప్రారంభమైంది రామనాథానికి. రామలక్ష్మికి చాలా నమ్మకముంది— మరిదితో తన వివాహానికి మామగారు అభ్యంతరం చెప్పడని! కర్మంకాలి, ఆయనే గనక అలా ఒప్పుకుంటే తన ఉత్తరం చూచి ఎంత అసహ్యించుకుంటాడు? రామనాథానికి ఈవిషయం తల్చుకున్నప్పుడల్లా గొంతుకకి అరికిపోయేది!

ఈ రొంపినుంచి బైటపడటానికి రామనాథానికి ఒకటేమార్గం కనపడింది—సాధ్యమైనంత త్వరలో తనిక్కడినుంచి చల్లగా నిష్క్రమించటం. తను సెలవలకి ఇంటికి వెడతాడని ఇంట్లోవాళ్ళందరికీ తెలుసు. రెండోకంటివాళ్ళకి తెలియకుండా రామనాథం సామానులన్నీ సర్దేశాడు. ఇంతకాలం వాళ్ళింట్లో ఉంటూ, వాళ్ళ అన్నం తింటూ సీనయ్యగారికి చెప్పిపోకపోవటం ఎంతమాత్రం బాగుండదు. పైగా అది లేనిపోని అనుమానాలకి దారితీస్తుంది కూడాను.

కాని, ఈ పిల్లికి గంట కట్టటమెలాగో తెలియక సతమతమయ్యాడు రామనాథం. ఎన్నడూ కోపమంటూ ఎరగని మనిషి సీనయ్యగారు. మరి ఒకవేళ ఆయనకి కోపమే వచ్చివుంటే! ఏమైనా సీనయ్యగారికి చెప్పక తప్పదు.

హఠాత్తుగా సీనయ్యగారే రామనాథం గదిలో అడుగుపెట్టేసరికి భయంతో రామనాథం గుండె దిగజారిపోయింది. దీనికితోడు రామలక్ష్మికూడా గదిలోకి ప్రవేశించింది.

నరాలు పట్టుతప్పి కుప్పగా కూలిపోతానేమోననిపించింది రామనాథానికి.

"మే మెవరం చెప్పినా ఆగేట్టు లేరు రామనాథంగారు...మూటాముల్లే సర్దేశారు మామయ్యా!" అంది రామలక్ష్మి తేలిగ్గా పంపటం ఇష్టంలేనట్టు!

"ఎక్కడికి వెడతాడమ్మాయ్!...ఇంత అక్కరముందు పెట్టుకుని!"

తనని తరవాత దుర్భాషలాడటానికి ఈ సంభాషణ ఉపోద్ఘాతమేమోనని భయపడ్డాడు రామనాథం. సీనయ్యగారు కూడా కుళ్ళువాడిలాగా వేళాకోళానికి దిగటం అసహ్యమనిపించింది రామనాథానికి.

"మరి పిలుపు తక్కువయిందేమో!" అంది రామలక్ష్మి రామనాథం కళ్ళల్లోకి చూస్తూ.

సీనయ్యగారు నవ్వాడు...

"పెద్దరికం వహించవలసినవాడు రామనాథానికి అలక ఏమిటి? ఐనా, ఎందుకైనా మంచిది— రామనాథం! రామలక్ష్మికీ, సీతాపతికీ వివాహం జరగబోతోంది త్వరలో" అన్నాడు సీనయ్యగారు తను ఇన్నాళ్లూ వాళ్ల ఉద్దేశ్యంకోసం ఎదురుచూస్తూ కూచున్నట్టు. "నువ్వు ఇప్పుడిప్పుడే ఎక్కడికీ వెళ్ళటానికి వీలులేదు. మీ వాళ్ళు కూడా ఇక్కడికే వస్తారు" అన్నాడు సీనయ్యగారు మళ్ళీ.

రామలక్ష్మి సీనయ్యగారికేసి ఓసారి చూచింది. సీనయ్యగారు తన మాటలు బాగా వప్పజెప్పాడని చూపులతోనే అభినందిస్తోం దనుకున్నాడు రామనాథం.

"మీ ఉత్తరం నా దగ్గరే వుంది. ఈ శుభకార్యమింత త్వరలో జరగబోవటానికి మీ రాయబారులా మీరు పాటుపడ్డందుకు పెళ్ళి అవగానే మీ ఉత్తరం మీ కిచ్చి ధన్యవాదా లర్పించుకుంటాం!" నాటకంలో సంభాషణ వప్పగించినట్టు ఇంత వాక్యం ఒక్కపెట్టున అని నిష్క్రమించింది రామలక్ష్మి.

రామనాథం ముఖం కందగడ్డలాగయింది. మామ కోడళ్ళిద్దరూ జరగబోయే వివాహాన్ని, ధర్మశాస్త్రం ఒప్పకపోయినా, "శుభకార్యం" అంటూ మురిసిపోతూ మాట్లాడటం అసహ్య మనిపించింది రామనాథానికి. కాని పైకి అనలేకపోయాడు.

సీనయ్యగారు రామనాథం సందేహం గుర్తించినట్టు సాలోచనగా ముఖంపెట్టి, "ఇష్టంలేని వివాహంచేసి ఒక కొడుకును పోగొట్టుకున్నాను... ఇష్టమైన వివాహంచేసి ఈ కొడుకునైనా రక్షించుకుంటాను" అన్నాడు. ఈ వాక్యం తనకు బాగా పరిచయమైనట్టు చాలా పొందికగా అన్నాడు సీనయ్యగారు.

సీనయ్యగారిని ఒక క్షణంపాటు సానుభూతితో చూచాడు రామనాథం. కాని, మళ్ళీ అతనిముఖం ఎఱ్ఱబారింది—"పోయిన కొడుక్కి, తనకి జరిగిన వివాహం ఇష్టం లేకపోవటానికి ఈ సంబంధమే నేమో కారణం!" అంటా ననుకున్నాడు రామనాథం.

కాని, ధైర్యం చాలింది కాదు...

---

# వెలుగు నీడలు

•

శ్రీ చిఱుమామిళ్ల శివరామకృష్ణ ప్రసాద్

సిగ్గుసింగారముల జిందుచిగురుటాకె
పవన హతినేలరాలెడి పండుటాకు!—
చీర సవరించి కులికెడి చిన్నదాన!
కన్నె ప్రాయంపు పరువ మింకెన్ని నాళ్లు?

కలువకన్నెల దిలకించి, పులకరించి
తొంగిచూచెను ప్రాగ్దిశ, తుహినకరుడు!—
పవనుడరుదేర నాకాశ పథమునందు
గారు గ్రమ్మెను ఘనఘనాఘనుడు దిశల!

పూలు జలజలరాలెను, పుడమి పడతి
పట్టు వలిపెంబుగట్టిన పగిది దోచె!—
మండుటెండను పూవులు మ్రగ్గిపోయె.
పుడమి పడతుక వైభవ మడగిపోయె!.

పవన డోలికలందున పవ్వళించి,
సదమలానంద సౌభాగ్య పథము వెంట
తరలిపోవును బ్రతుకనితలచి, మల్లె,
సంబరంబందె,-వృంతము సడలిపోయె!.

పేర్మిదీపింప, తుమ్మెద పెండ్లికొడుకు,
సకల సుమరాజితోడను సరసమాడి,
పూవుటీరమ్ములందున బ్రొద్దుబుచ్చి,
కాంచడదియేమొ! ప్రేమతో, గంధఫలిని!



# రాంగ్ నంబర్

★

'ఆరుద్ర'

| | |
|---|---|
| బిచ్చగత్తె | సుబ్రహ్మణ్యం |
| రామారావు | వీరరాఘవులు |
| ఆరుముగం | మేనేజరు |
| సుబ్బయ్య | సుశీల |
| సీతాపతి | |

(బిచ్చగత్తె పాడుతూ ఉంటుంది.)

మటుమాయ లోకమ్ము
ఎటు చూసినా గాని
కొంగ జిలుగుల అడవి రన్నా ;
నట్టడవి చిట్టడవి
గుట్టు తెలిసినవాడు
గురురాయ లొక్కడే అన్నా ;

బాబూ ! ధర్మం ......

పాట|| కొండ చిలుకవు నీవు
తిండికై పోతావు
గురువు శరణను వేడుకున్నా
కండ చీమలచేత
కొండ చిలుకను చంపు
కిటుకు గురువుకే తెలుసునన్నా...

(పాట దూరంనుంచి వినిపిస్తుంది. పాటమీద టైపు కొడుతున్న శబ్దం వినబడుతుంది. కొంత టైపు చేసిన శబ్దం వినబడ్డాక -)

రామారావు : ఒరే, ఆరుముగం! (రాలేదు కాబట్టి గట్టిగా) ఒరే ఆరుముగం! ఎక్కడ చచ్చావురా.

ఆరుముగం : ఏమి సార్! నిండా కూంతలు వేస్తురు, నానుదా వస్తును సార్, వస్తును సార్ అని సొప్తుంటిని.

రామా : ఛప్, నాకేం చెవులు లేవనుకొన్నావా ?

ఆరుముగం : నేనంటినా సార్ ! మీకుదా పిల్లి యేనుగ మాదిరి రెండు పెద్ద చెవి ఉంటును.

రామా : వెధవా , నేను వినాయకుడిలా ఉన్నానట్రా !

ఆరుముగం : ఏమిసార్ ? ఎదవా—ఎదవా అని సొప్తురు. ఇట్టా చెప్తే నావల్ల మాళనే మాళదుసార్. మాకుదా ఆండవాండ్లు నిండావుందురు. ఎవ్వడ్ పూడిస్తి రని తలిస్తిరా !

రామా : పూడ్చేరో, ఏడ్చేరోగాని వెళ్ళి ఆ బిచ్చగత్తెకి డబ్బులియ్యి ; పో!

ఆరుముగం : పోతుండాసార్ !

(టైపుశబ్దం. పాటబాగానే వినబడుతుంది)

బిచ్చగత్తె:—

నీతల్లికడుపు చల్లగా ;
దానంచేసిన మారాజా ! మంచి
మగార్తాన పిల్లల తండ్రివై —

రామారావు : పురమే లేదు—అంతఃపురం ?

(టెలిఫోనుగంట మోగుతుంది)

రామా : లాభం! నీతల్లినిగా తాసీల్దారు తరగా; ఇది మొదలు ఒకటే గోణగోణమని వాగడం; గొంతుకు చించుకొని అరు ; నేనుమట్టుకూ నిన్ను ముట్టుకోను. ఒరే, ఆరుముగం ! ఆరుముగం !

ఆరుముగం : ఏమిసార్ !

రామా : ఆ టెలిఫోను నోరు నొక్కరా నాయనా.

ఆరుముగం : నా వల్లమాళదుసార్ !

రామా : ఇవాళైనా ఈబాధ తప్పుతుం దను కొన్నానురా ; వెళ్ళి అన్సరు చెయ్యరా ; తండ్రీ ఆ కాల్ !

ఆరుముగం ; నావల్ల మాళదుసార్! నేను సొప్తిని—మాళనే మాళదు !

రామా : నా బాబువి కాదు—అన్సరుచెయ్యి !

ఆరుముగం : ఊహూ ! మేనేజరుసార్—కూంతలు వేస్తురు—నేను చెయ్యనుసార్.

రామా : సరే—ఏం చేస్తాం; నేనే వెళ్తానులే!

(టెలిఫోనుతీసిన చప్పుడు. గంట ఆగుతుంది)

రామా : హల్లో.........రాంగ్ నెంబర్. ఇది వెంకట్రామయ్య అండ్ కంపెనీ కాదు...కాదు; డాక్టర్ వెంకట్రామయ్య స్పీకింగ్; ష్లో; రాంగ్ నెంబర్—రాంగ్ నెంబర్...

(రిసీవరు ఊపుగా పెట్టిన చప్పుడు)

ఆరుమ్గం : ఏమిసార్; అదు......అబద్దం చెప్తారు.

రామా : చప్, నోరుమ్గయ్;

ఆరుమ్గం : పోనీవిా సార్ - నా లజా ఇయ్యవిా - ఎవ్వరికీ చెప్పను;

రామా : లంచం అడుగుతావురా రాస్కెల్;

ఆరుమ్గం : లేదు - లేదు సార్ - కొట్టకు సార్!

(టెలిఫోను మళ్లా మోగుతుంది)

రామా : హోరి నీ రసాస్వాదియ్య. ఇలా పెట్టేనో లేదో - అప్పుడే—

ఆరుమ్గం : అది అప్పికిదా సార్; బదులు చెప్పు సార్.

రామా : తప్పదురా తండ్రీ తప్పదు.

(టెలిఫోను తీసిన చప్పుడు. గంట ఆగుతుంది)

రామా : హల్లో;...అవునండి. ఇది వెంకట్రామయ్య అండ్ కంపెనీ అండి...ఎవరండీ మాట్లాడుతున్నారు...లేదు. మేనేజరుగారు ఇంకా రాలేదండి... ప్రొప్రయిటర్ గారా......ఆయన ఎప్పుడొచ్చేదీ చెప్పలేం...బంగారపిచికలు - వారికేం - ఎప్పుడొచ్చినా వస్తారు... నేనా అండి, టైపిస్టుని... సరె అట్లాగే - మేనేజరు గారు రాగానే చెప్తాను. శెలవు.

(రిసీవరు పెట్టేసిన చప్పుడు. నిట్టూర్పు విడుస్తాడు.)

రామా : ఒరే ఆరుమ్గం.

ఆరుమ్గం : ఏమి సార్;

రామా : ఒరే - ఫస్టుక్లాసైన - టీ తీసుకురారా; ఎలా ఉండాలనుకొన్నావ్ - యిలా తాగితే అలా నిషా చెయ్యాలి. ఊ, లగెత్తు!

ఆరుమ్గం : ఏమి సార్ - రెండణాలుదా ఇస్తురు.

రామా : మరెంత కావాలి. రెండణాలు చాలవూ!

ఆరుమ్గం : రెండణాలకు నిషా యిచ్చే టీ వచ్చునా సార్?

రామా : వచ్చాం పో; టీ - టీరా నా తండ్రీ టీ; నిషానా; రాత్రల్లా నా దుంప తెంపేవు కదరా - ఆ వెదిరంగు బురదనీళ్ళు - అంటే - అటువంటి పదార్థమేనురా నాయనా - ఈ సట్టు-కొంచెం స్ట్రాంగా - టీరా;

ఆరుమ్గం : ఎన్నిసా సార్ - అదే- మురుగా-మురుగా!

రామా : మురుగూ లేదు కడియం లేదు - వేగం రా;

పోస్టుమేన్ : పోస్టు;

రామా : నీ కెన్నిసార్లు చెప్పాను. నాకు మనియార్డరు లేకపోతే-ఈ ఆఫీసులో అడుగు పెట్టొద్దని.

పోస్టుమేన్ : (నవ్వుతాడు)

రామా : ఏంలేదా?

పోస్టుమేన్ : ఉంటే యివ్వనా అండి.

రామా : పోస్టుమేన్ :

పోస్టుమేన్ : ఏంసార్.

రామా : ఇదిగో అణేళ డబ్బు లతిగేవ్ : ఇండి.

పోస్టుమేన్ : థ్యాంక్సుసార్ :

రామా : ఈసారి డబ్బు లున్నప్పుడు ఉడుగుతూ ఉండు :

పోస్టుమేన్ : నా దగ్గర ఉంటే మిమ్మల్ని ఎందుకడుగుతాను సార్!

రామా : నీ దగ్గర కాదోయ్, నాదగ్గర ఉన్నప్పుడు.

పోస్టుమేన్ : మంచిది సార్.

రామా : వెళ్ళిరా.

(టెలిఫోనుగంట మోగుతుంది)

రామా : నీ శ్రాద్ధం పెట్టుకింద పెట్టా—మళ్లా మొదలెట్టావ్—

(గంట ఆగుతుంది)

హల్లో...రాంగ్ నంబర్—రాంగ్ నంబర్.

సుబ్బయ్య : నమస్కారం బాబుగారూ;

రామా : (రిసీవరు పెట్టేస్తూ) నమస్కారం—అరెరె—సుబ్బయ్యగారా; రండి, రండి ఏమిటిలా వచ్చారు. కూర్చోండి, కూర్చోండి.

సుబ్బయ్య : చిత్తం బాబుగారూ—ఫరవా లేదు లెండి.

రామా : ముందు కూర్చోండి. కులాసాగా ఉన్నారు కదు?

సుబ్బయ్య : ఏం కులాసా బాబుగారూ; కరువుకాలం—నేనూ, సంసారం మాడిపోతున్నాం.

రామా : అవును పాపం; ఆరౌన్సుల రేషను కోటాలాయె.

సుబ్బయ్య : ఆరేషను కూడా కొనుక్కునేందుకు—డబ్బులేదు బాబూ; వారంరోజులైంది యింట్లో పొయ్యి రాజెట్టి;

రామా : అయ్యో పాపం;

సుబ్బయ్య : చిత్తం బాబుగారూ;

రామా : సాయంత్రం రాలేకపోయారా; అప్పుడు జీతాలు అందుతాయి. ఏమైనా యిస్తాను. హెచ్చు యివ్వలేను గాని ఏదో నాకు తోచిన మట్టుకు ఋణమో పణమో—యథాశక్తి—ఉడతాభక్తి......

సుబ్బయ్య : చిత్తం, చిత్తం, బాబుగారూ మీ మేలు మరచిపోలేను.

రాము : ఈ పూట భోజనానికికూడా లేదా!

సుబ్బయ్య : లేదు బాబుగారూ ; వారంరోజు లయింది ఎంగిలిపడి. కసరత్తుచేసిన వస్తాదుని—ఈ వస్తులు వన్నెం చెయ్యవు. మా ఆవిడకీ—పిల్లలకీ, భోజనంలేదనే చింత !

రామా : ఇదుగో, పద్నాలుగణాలేఉన్నాయి ఈ పూటకి కానీయండి, సాయంత్రం యింకా ఏమైనా యిస్తాను.

సుబ్బయ్య : నమస్కారం బాబుగారూ ;

రామా : ఒరే ఆర్ముగం. ఆ టీ సుబ్బయ్య గారికి యియ్యరా ;

సుబ్బయ్య : లేదు బాబుగారూ, మీరు త్రాగండి, నాకు అవసరంలేదు.

రామా : ఫరవాలేదు. మీరు త్రాగండి. పాపం వారం రోజులాయి ఏం లేదు. తాగండి ఫరవాలేదు.

సుబ్బయ్య : థేంక్సుబాబుగారూ, మీ ఋణం తీర్చుకోలేను.

రామా : సాయంత్రం నే నొక్కణ్ణే కాదు. తక్కినవాళ్లచేత కూడా యిప్పిస్తాను. పాపం ఆర్నెల్లయిందికదూ ఉద్యోగంపోయి. ఎలా బతుకు తున్నారో—అందులోకీ కరువుకాలం ;

సుబ్బయ్య : చిత్తం, చిత్తం ఎలా బతుకు తున్నామో ఆ పరమాత్ముడికే ఎరుక !

రామా : ఏం పరమాత్ముడో—వాడి తల్లి సిగా తాసీల్దారు తరగా; అసలు ఉన్నాడో లేడో గాని—మనల్ని కాల్చుకు తింటున్నాడు.

సుబ్బయ్య : అలా అనకండి బాబుగారూ ; దేవు డుండబట్టే—మనల్ని ఓ కంట కనిపెడుతూ ఉండబట్టే యిలాగైనా ఉన్నాం.

రామా : పోనీండి. ఉన్నాడే అనుకొందాం, మీతో నాకు వాద మెందుకు ? సరే—మీరు ముందు యింటికెళ్ళి యీ పూట భోజనం సంగతి చూసుకోండి. సాయంత్రం వస్తే తప్పకుండా ఏదో సాయంచేస్తా.

సుబ్బయ్య : లేదుబాబుగారు. యిక్కడ మళ్లా ఉద్యోగం అయింది.

రామా : అరె—మరి చెప్పారు కాదేం—కంగ్రాట్యులేషన్సు, కంగ్రాట్యులేషన్సు. మళ్లా ఎలా సంపాదించారు ఉద్యోగం ?

సుబ్బయ్య : చిత్తం బాబుగారూ ; మొన్నను వెళ్ళి ఆ ధర్మప్రభువు పాదాలు రెండు గట్టిగా పట్టుకొన్నాను ; బాబూ ; మీరే నాకు తల్లైనా, తండ్రైనా, దేముడైనా—అని అన్నాను. 'మీరు దయతలచేను అన్నదాకా ఈ పాదాలు విడవను' అని మొరపెట్టుకొన్నాను. 'ఏం చెయ్యమంటావురా సుబ్బయ్యా' అన్నారు. 'మీ యిష్టం ఏంచేసినా సరే, నన్నూ నా పిల్లల్నీ అందర్నీ ఒక్కసారి గొంతుకోసేస్తే కోసెయ్యండి, లేదా కనికరించి యింత అన్నం కల్పించండి అని ఏడ్చాను, మొత్తుకొన్నాను. ఆ ధర్మప్రభువుమనసు కరిగి 'సరేలే; సుబ్బయ్యా పో; ఎవరికేనా తప్పలొస్తాయి. రేపు ఫస్టునించి ఉద్యోగం చేసుకో' అన్నారు.

రామా : మీరు అక్షరాలా అదృష్టవంతులండీ ;

సుబ్బయ్య : చిత్తం చిత్తం ; ఆ అన్నదాత కాబట్టి నేను చేసిన మహాద్రోహానికి నన్ను క్షమించి మళ్లా దారి కల్పించారు. ఇంకోళ్లయితే ఖండ, ఖండాలుగా నరికి, కాకులకీ, గద్దలకీ వేసేవారు.

రామా: అందుకే నాకు కోపంవస్తుంది. సుబ్బయ్యగారూ; కాకులకీ, గెద్దలకీ వేయడానికి మీరేం పాతకాలపు బానిసలు కారు. ఈ నాడు ఉద్యోగం యివ్వడం మీ మీద దయదలచి కాదు. ప్రొప్రయిటరుగారు స్వంతలాభం చూసుకొనే! మీరు వెళ్లినదగ్గరనుంచీ, మీ డిపార్టుమెంటు పని వెనక పడ్డది. అందుకేగాని, మీ తప్పు క్షమించీకాదు· ఆయన మనసు కరిగీకాదు మళ్లా ఉద్యోగం యివ్వడం.

సుబ్బయ్య: లేదు బాబుగారూ, ఆనాడు చేసింది తప్పే, తలచుకొంటే—సిగ్గేస్తోంది.

రామా: లంచం పుచ్చుకొన్నారంటే—మీదా తప్పు; చాలీచాలని జీతాలు ఉన్నంతకాలం లంచాలు పుచ్చుకోడం తప్పదు. మీరు ఏ స్థితిలో లంచం పుచ్చుకొన్నారో జ్ఞాపకంఉందా?

సుబ్బయ్య: ఎలా మర్చిపోతాను బాబూ, ఎన్ని జన్మాలెత్తినా ఆరోజు మర్చిపోలేను. ఆ మాటకొస్తే ఆ రోజు పిశాచిలాగ నన్ను వెంటాడి వెంటాడి పీక్కుతినేటట్టుఉంది. ఆనాటి నా సంసారం పరిస్థితులకీ, యీనాటి స్థితిగతులకీ ఏమీ తేడాలేదు బాబుగారూ! ఇవాళలాగే ఆనాడుకూడా మా యింట్లో అందరూ వారంరోజులాయి పస్తుపడుకొన్నారు. రెండునెలల యింటి అద్దె ఆ నాడు నేను బాకీ పడిఉన్నాను. బాకీలవాళ్లందరూ విరుచుకుపడి కాకుల్లా పొడుచుకుతింటున్నారు. ఏంచెయ్యాలో దిక్కుతోచలేదు.

రామా: ఆ పరిస్థితులలో లంచం పుచ్చుకొన్నారంటే మీదా తప్పు. మీ చుట్టూరా ఇన్ని రకాల యిబ్బందులు కల్పించిన లోకానిది తప్పు.

సుబ్బయ్య: అయితే, బాబుగారూ, నాకు తెలియకఅడుగుతాను. ఆనాడు నామీద మీ రెందుకు రిపోర్టుచేశారు?

రామా: ఆనాడు రిపోర్టు చేశానంటే—మీ మీద సానుభూతిలేక కాదు—మీరు ఆ లంచం ఎవరి దగ్గర పుచ్చుకున్నారో వాడి దుస్థితి చూడలేక· పాపం—ఏమీ ఎరుగని అమాయకుడికి నెత్తికొట్టి—నీకు ఉద్యోగం యిప్పిస్తానని, మీరు డబ్బు పుచ్చుకొన్నారు. ఆ పుచ్చుకోడం పేరు లంచంకూడా కాదు. మోసం, పచ్చిమోసం. అందుకే నాకు కోపం వచ్చి రిపోర్టు చేశాను. పోనీండి, యిప్పడైనా అలాంటి పనులు చెయ్యకుండా ఈ ఉద్యోగం నిలబెట్టుకోండి!

సుబ్బయ్య: చిత్తం, చిత్తం, తమరు చెప్పాలా; ఆ శాస్తితో బుద్ధి వచ్చిందండి. మరి జన్మజన్మాలా అటువంటి తప్పుడుపని నన్ను చంపేసినా, నా ఎత్తు ధనం పోసినా చెయ్యను. చిత్తగించారో లేదో, మా అబ్బాయి—మొన్ననే మెట్రిక్ పాసయ్యాడు. వాడి కెక్కడైనా ఉద్యోగం చూద్దామని ప్రయత్నిస్తే, ప్రతి కంపెనీలో గుమాస్తా ఉద్యోగం యిప్పించడానికి లంచం అడిగేవాళ్లే; ఇప్పు డా కష్టం తెలిసొచ్చింది.

రామా: అవునండి—తనదాకా వస్తేనేగాని తెలియదు.

సుబ్రహ్మణ్యం: [ప్రవేశిస్తూ] హల్లో గుడ్ మార్నింగ్ రామారావు! అరరే—సుబ్బయ్యగారా; ఏమిలా వచ్చారు?

రామా: సుబ్బయ్యగారికి మళ్లా ఉద్యోగం అయింద్రోయ్—సుబ్రహ్మణ్యం.

సుబ్ర: సంతోషం—సుబ్బయ్యగారూ సంతోషం. క్వయిటు నైస్ స్ప్రిటెడ్;—మా కెవరికీ తెలీదే.

సుబ్బయ్య: చిత్తం చిత్తం.

సుబ్ర: ఒరే అర్ముగం సుబ్బయ్యగారికి టీ తీసుకు రారా!

సుబ్బయ్య: వద్దు బాబుగారూ, ఇప్పుడే తాగాను, రామారావు బాబుగారు ఇప్పించారు.

సుబ్ర: తాగండి. ఎవడు బతికేడు మూడు యాభైలు. మీ సంగతి నాకు తెలీదా!

సుబ్బయ్య: లేదు బాబుగారూ, నమస్కారం. ఆ ఓపిక లేదు.

రామా: అవున్రా, ఆయ నిప్పుడే టీ తాగారు·

సుబ్ర: నీకు తెలియదు ఊరుకోరా రామారావ్! ఆయనసంగతి మనకు తెలుసు—ఓసారి ఏమిటయింది అనుకున్నావ్; అప్పటికి నా ఉద్యోగం కంపెనీలో చేరలేదు. అప్పుడు పందెం వేసుకొని సుబ్బయ్యగారు,వంద-అరకోరాలా కంద ఇడ్డెన్లు తిని—నాలుగు కప్పుల కాఫీ తాగేరు.

రామా: నిజంగా!

సుబ్ర: నీ కబద్ధం — నాకు నిజం — నా కళ్లారా చూస్తే!

రామా : అసంభవం!

సుబ్ర : నీమొహం, ఎదురుగుండా మనిషి ఉన్నాడాయె. కాయ్ రాజా కాయ్. పందెం వెయ్యి. ఏమండి సుబ్బయ్యగారూ మనం రేడీ గేమేనా?

సుబ్బయ్య : లేదు, బాబుగారూ ; ఆరోజులు పోయాయి, ఆ ఓపికా సత్తువా యిప్పుడేదీ?

సుబ్ర : ఫరవాలేదు. ఇంకొక్క కప్పుటీ తాగండిబరే ఆర్ముగం—ఫాంఫ్లాంట్ ; ఎక్కడున్నావురా!

ఆర్ముగం : ఏమి సార్, మీరూ కాంతలు వేస్తురు.

సుబ్ర : మీరూ కాంతలు వేస్తు రంటు న్నావ్ ; నేను వెయ్యకూడదా?

రామా : మన కొక్కడికే లైసన్సు ;

సుబ్ర : అదా, పోరా ఆర్ముగం ఇంకా నిలబడితావేం టీ తేరా!

సీతాపతి, వీరరాఘవులు : హల్లో—ఎవ్వరిబడీ నమస్తే—సబ్ లాంగ్, అరె సుబ్బయ్యగారా?

సుబ్బయ్య : చిత్తం చిత్తం—నమస్కారాలు బాబుగార్లూ!

రామా, సుబ్ర : సుబ్బయ్యగారికి సుల్తాను యోగం అయిందర్రా ;

సీతాపతి, వీరరాఘవులు : అరెరె కంగ్రాట్యులేషన్సు సుబ్బయ్యగారూ!

సుబ్బయ్య : చిత్తం చిత్తం.

వీర : పోనీండి ఈ పార్టైనా సక్రమంగా ఇది నిలబెట్టుకోండి.

సుబ్బయ్య : చిత్తం చిత్తం.

సీతా, వీర : ఒరే ఆర్ముగం, సుబ్బయ్యగారికి టీ తేరా.

సుబ్బయ్య : లేదు బాబుగార్లూ, ఇప్పుడే తాగాను.

సీతా : హాస్నెన్సు : మీకు కప్పుటీ లెక్కేమిటి తాగండి. ఒరే ఫాంఫ్లాట్ అలా నిల్చుంటావేంరా, టీ తెమ్మంటే.

ఆర్ముగం : దుడ్డుసార్—సుమ్మా తమ్మునా టీ?

సీతాపతి : నాయర్ని అప్పుపెట్టమను.

ఆర్ముగం : అప్పంటే, ఆ పాంచేరి, యీవు ఇస్త్రీపెట్టునుసార్— దుడ్డుయియ్యిమా ;

వీర : ఏమిరా సీతాపతీ, దుడ్డుందా?

సీతా : లేదురా, ఇవాళ తారీఖంత—సుబ్రహ్మణ్యం దగ్గరుందేమో.

సుబ్ర : నా దగ్గరా లేదు. బస్సు ఖర్చులకని రెండణాలు - బంకులో అరువు పెట్టాను. ఏమిరా రామారావు నీ దగ్గరేమైనా...

రామా : లేదోయ్—ఉన్నదంతా - యిప్పుడే సుబ్బయ్యగారికి ఇచ్చేశా.

వీర : అరె నీ తెస్సాదియ్యా, మొన్న నేగా ముప్పయిలు ఎడ్వాన్సు పుచ్చుకొన్నావ్ ; యింతట్లోనే అయిపోయిందా ;

సీతా : నెల ముప్పయి రూపాయలు ఎన్నాళ్లొస్తాయిరా ; అందులోకి - ఈ మెడ్రాసులాంటి సిటీలో—

రామా : బాగా అన్నావురా సీతాయి!

సుబ్ర : బ్రహ్మచారికుంకలు—మీకు ఖర్చేమిట్రా!

రామా : బ్రహ్మచారికే ఎక్కువ ఖర్చు. నీకు తెలీదేమో సుబ్రహ్మణ్యం. మీకు ఒక్కటే సంసారం. మేమెన్ని సంసారాలు పోషించాలి;

సుబ్ర : అదేమిట్రోయ్!

రామా : అవును మరి కాఫీహోటలువాడి సంసారాన్ని మేమే పోషించాలి, సినిమా థియేటర్ల వాళ్ల సంసారాలని మేమే పోషించాలి టాక్సీవాళ్ల సంసారాలని, రిక్షావాళ్ళ సంసారాలని......

సుబ్ర : చాల్లే; ఈకాలపు కుర్రాళ్లకి దమ్మిడీ ఎత్తు బాధ్యతలేదు. మీకెంత జీతాలొస్తాయో, మాకూ అంతేనా, వీటితో గంపెడు పిల్లల సంసారాలని ఈదాలరు—అందులోకి—సుబ్బయ్యగారి లాంటి వారైతే—ఆ ఎనభైరూపాయలతోటే.

సుబ్బ : ఎనభైకాదు బాబూ; ఈసారి అరవైఅయిదు మాత్రమే యిస్తానన్నారు!

అందరు : అః! పాపం!

సుబ్బ : అదేచాలు...

సీతాపతి : అవును మరి లేని బావకన్న గుడ్డి బావ నయం!

సుబ్బ : చిత్తం చిత్తం బాగా సెలవిచ్చారు!

సుబ్ర: అదేమిట్రా పనిమట్టుకు చేయించు కోరా?

రామా: అది వేరే సంగతి. ప్రొప్రయిటరు కంపట్టింది. ఇతడు కాకపోతే ఇంకొకడు. వాడు కాకపోతే వాడిబాబు మరొకడు.

ఆరుమ్గం: ఏమిసార్; టీకి దుడ్డు యియ్యమి సార్!

సీతా: ఉండరా. నువ్వొకడివి మళ్ళ

ఆరుమ్గం: ఆమాసార్! మీరుదా అవసరం కోపంసేస్తురు. టీ ఏదిరా, ఫుట్బాల్ అని.

సీతా: డబ్బులు లేవురా బాబూ. డబ్బులు లేవు. ఇవాళ తారీకెంత. అరె. ఇవాళ యిరవై తొమ్మిదా; చచ్చాంపో.

రామా: ఏమిరా ఆరుమ్గం తారీఖు మార్చ లేదూ?

ఆరుమ్గం: మారిస్తిని సార్.

రామా: నీమొహం. యివాళ ఫస్టురా...

నీకు సంబళం అక్కర్లేదూ;...

ఆరు: సుమ్మా; సరదాకి పనిసేస్తునా? ఏమి సార్ నిన్న యిరువత్తెట్టు.

యిన్నైక్ ఇరువత్తొంబదు దానె సార్.

రామా: ఫిబ్రవరికి యిరవై తొమ్మిదిరోజులేరా నాయనా...

థర్టీడేస్ హేత్ సెప్టెంబర్, ఏప్రిల్ జూన్ ఎండ్ నవంబర్. ఏప్రిల్ - జూన్ ఎండ్ నవంబర్. తరవాత ఏమిట్రా సీతా...

సీతా: ఏమో మర్చిపోయానురా...

సుబ్బ: ఆల్ ది రెస్టు హేవ్ థర్టీవన్.

రామా: మనకన్నా సుబ్బయ్యగార్నయం. ఇంకా జ్ఞాపకం పెట్టుకొన్నారు. అరె కొంప తీసి ఇది లీపియరు కాదు కద. నాలుగు నాల్గులు పదహారు—మూడు. నాలుగెనుమదులు ముప్ఫయిరెండు. మూడు. నాలుగేళ్ళు యిరవైఎనిమిదీ. శేషం రెండు. లీపియరు కాదు. బతికేంరా భగవంతుడా! ఒరే ఆరుమ్గం తారీఖు మార్చరా...

ఆరుమ్గం: ఎన్న సార్. ఇన్నైకి ఫస్టా. ఎన్నమో, ఒక మాసం, ముప్పయి, యింకొక మాసం ముప్పయి ఒకటి. ఈ మాసం యిరవై ఎనిమిది. ఇదేం కణకు సార్.

సుశీల: (ప్రవేశించి) నమస్తే.

అందరు: నమస్తే సుశీలా...

సుశీల: నమస్తే

రామా: సుశీలగారూ...వీరు సుబ్బయ్యగారు. అని మన కంపెనీలో ఉద్యోగం చేస్తున్నారు. ఇవాళే చేరేరు. నిజానికి వీరు ఈ కంపెనీ మొదలెట్టిన్నాండీ కంపెనీలో ఉండేవారు. కాని మీరు చేరడానికిముందే ఉద్యోగం పోయింది. సుబ్బయ్యగారు.....ఈమె సుశీల అని మన కంపెనీలో టైపిస్టు. మీరు వెళ్లాక ఈ కంపెనీ చాలా మారింది. ఆశ్చర్యపడకండి.

సుబ్బ: నమస్కారం అమ్మా.

సుశీ: నమస్కారం

సుబ్బ: మంచిదే. మంచిదే ఆడవాళ్లు కూడా ఉద్యోగం చెయ్యడం మంచిదే. అయితే టైపు బాగా కొడతారా అమ్మా.

(టెలిఫోను మోగుతుంది)

రామా: పేరుకి టైపిస్టే గాని పట్టుమని పది పేజీలు కొట్టాలంటే...మేమే చేసుకోవాలి.

సుశీ: ఎందుకండీ ఎత్తిపొడుపులు. మేనేజరు గారు నన్ను చేయమంటే ఆ పని చెయ్యనన్నానా?

సుబ్ర: ఎవరూ - ఆ టెలిఫోను తీసుకోరే రామారావ్ చూడు!

రామా: నావల్ల కాదు. రాత్రిల్లా నా దుంప తెగింది. ఈ ఫోనుతో...సుశీలా ఫోను ఫోను తీసి కొని అది చూడు. అది. ఫూల్ లా నేనిక్కడే ఉండి పోయానేం యింటికి పోక! ఇదే సీతా. ఇవిగో స్టేట్మెంట్లు - మేనేజరుగారు వస్తే యివ్వు. నేను పోతా. మైగాడ్. ఇవాళ ఆఫ్ పుచ్చుకొందాం అనుకొన్నాను. సాయంత్రం రావాలిరా భగవంతుడా!

సీత: జీతం అక్కర్లేకపోతే రా మోకు.

రామ: జీతం అక్కర్లేకపోతే—మరెందుకు పనిచేసేది. సరే ఏంచేస్తా. సాయంత్రంవస్తా ఒరే సీతా ఓ నాలుగణాలు యియ్యరా; సాయంత్రం ఇస్తా.

సీతా: లేదురా. వుంటే సుబ్బయ్యగారికి టీ తెప్పించనట్రా...

రామా: ఎవరిదగ్గరా లేకన్నమాట. పోనీండి సుబ్బయ్యగారూ; ఓ నాలుగణాలు యివ్వండి సాయంత్రం యిస్తాను.

సుబ్బ: అమ్మమ్మ, ఎంతమాట. తప్పకుండాను. యిందండి.

సుశీ: (టెలిఫోనులో) హలో—అవునండి. ఉన్నారండి. చెప్తా. రామారావుగారుమిమ్మల్ని మేనేజరుగారు ఉండమన్నారు.

రామ: ఎందుకూ...

సుశీ: ఏమో తెలీదు.

రామ: సర్లే, అన్నట్లు మిమ్మల్ని అందర్నీ ఒక చిన్న విషయం రిక్వెస్టు చెయ్యడం మర్చిపోయాను. సుబ్బయ్యగారు మళ్లీ ఈ కంపెనీలో చేరడం మన కందరికీ మహదానందం.

సీతా: అందుకు సందేహమా...

రామ: ఆయన యివాళే ఉద్యోగంలో చేరినా నెలతిరిగితేకాని ఆయనకి జీతంరాదు. ఆయన ఎంత కష్టంలో ఉన్నది ఆయన చెప్పినా, చెప్పకపోయినా మన కందరకూ తెలుసు. కాబట్టి ఈలోపున మన మందరం చందాలువేసుకొని ఆయన కుటుంబాన్ని—ఏం మాట్లాడరు... సరే మీరు యిచ్చినా యివ్వక పోయినా నేను మట్టుకూ ఓ పది రూపాయలు సహాయంచేస్తా. మీరు కూడా యివ్వడం మంచిదని నా అభిప్రాయం. ప్రొద్దుట ఆయనమాటలు వింటే నా కడుపు తరుక్కుపోయింది. జేబులో పధ్నాలు గణాలే ఉన్నాయి కాని లేకపోతే ఎంతఉంటే అంతా యిచ్చేద్దును. ఏమో చిన్నవాణ్ణి నేను చెప్ప వలసింది నేను చేస్తాను. పెద్దలు మీ రంతా ఆలోచించి ఏదో ఒకటి చెయ్యండి.

మేనేజరు: గుడ్‌మార్నింగ్. గుడ్‌మార్నింగ్. గుడ్‌మార్నింగ్ సుబ్బయ్యగారూ వచ్చాను.

సుబ్బ: నమస్కారం మేనేజరుగారూ...

సుబ్బయ్య: చిత్తం—నమస్కారం బాబు గారూ.

మేనే: నమస్కారం—కూర్చోండి. ఏం రామారావ్. స్టేట్‌మెంట్లు అయాయా...

రామా: అయాయి సార్. సీతాపతి కిచ్చాను.

మేనే: ఫిగర్సు వెరిఫై చేశారా?

రామా: లేదండి. స్టేట్‌మెంట్లు పూర్తయేసరికి పొద్దున్న తొమ్మిదిన్నరయింది.

మేనే: వెరిఫై చేయకపోతే స్టేట్‌మెంట్లు తయారై ఏంలాభం. వెరిఫైచేయండి.

రామా: ఇంకా స్నానం చెయ్యలేదు సార్.

మేనే: మీరు స్నానం చేశారో లేదో కంపెనీకి అనవసరం. ముందు వెరిఫైచెయ్యండి.

రామా: అవున్లెండి. భోజనం చేశామో లేదోకూడా మీకు అవసరం లేదు. మీకు కావలసిందల్లా పని—పని—పని.

మేనే: అధిక ప్రసంగం...

రామా: నిజంచెప్తే అధిక ప్రసంగమేలెండి...

మేనే: స్టేట్‌మెంట్లు ఎన్ని కాపీలు కొట్టారు..

రామా: ఒన్ ప్లస్ ఫయివ్ సార్.

మేనే: ఒన్ ప్లస్ ఎయిట్ కొట్టమన్నానే?

రామా: ఆఁ?

మేనే: నీకునిజంగా పనిమీద శ్రద్ధ ఉంటేనా? తక్కిన కాపీలుకూడా కొట్టు—ఇవాళ మెయిల్లో అవి వెళ్ళిపోవాలి.

రామా: రాత్రల్లా కొట్టికొట్టి చేతులు నొప్పెడు తున్నాయి సార్. సుశీలని కొట్టమనండి.

మేనే: దానికి నేనా బాధ్యుణ్ణి? సుశీల కొట్ట టానికి వీల్లేదు. వెళ్ళు, మాట్లాడకుండా పని పూర్తి చేయ్. ఇదుగో రామారావ్ పొద్దున్న టెలిఫోన్ కాల్ వచ్చిందా?

రామా: ఆ వచ్చిందిసార్.

మేనే: మరి చెప్పలేదేం...

రామా: చెప్పడానికి టైమేదీ? మీరు ఇప్పుడేగా వచ్చారు.

మేనే: ఇదేనా రెస్పాన్సిబిలిటీ? నేను ఫోనుచేయకపోతే వెళిపోయేవాడివి. లేదా ఫోనుకాల్ వస్తే ఒక చిన్న చీటీ రాసి టేబిల్‌మీద పెట్టక్కర్లేదూ.. పెట్టావా...

రామా: లేదుసార్.

మేనే: ఎక్కణ్ణుంచి వచ్చింది?

రామా: ఎవరో రాఘవయ్యగారట. ఫోను చేశారు.

మేనే: అయితే నీ ఉద్యోగం పోయింది. కేషియర్ దగ్గరికి వెళ్ళి నీకు ఈయవలసిన జీతం తీసుకొని వెళ్ళిపో! విష్ యు బెస్ట్ ఆఫ్ లక్!

రామా: ఏమిటిసార్ ఇది?

మేనే: ఇవాళతో నీ ఉద్యోగం అయిపో యింది అని చెప్తున్నా.

రామా : వెరివెల్—థేంక్సు...

మేనే : ఎందుకు నీ ఉద్యోగం పోయిందో తెలుసా...

రామా : నాఖాళీలో మీ మేనల్లుడికి ఉద్యోగం ఇచ్చేందుకు.

మేనే : షటప్, ఐయాం సారీ! అందుకు కాదు.

రామా : అక్కర్లేదు. మీరు చెప్పక్కర్లేదు. నేను తెలుసుకోవలసిన అవసరంకూడా లేదు.

మేనే : అయినా—చెప్పవలసిన బాధ్యత నామీద ఉంది. నీలోయింకా కుర్రతనం పోలేదు. కుర్రాళ్లతూరీగలను పట్టుకొని వాటిరెక్కలు పీకుతారు. వీధిలో కూరగాయలు అమ్మకొనేవాళ్లను పిల్చి—తలుపుచాటున దాక్కుంటారు. అలాంటి మనస్తత్వంతోనే మన్ ఈకంపెనీలో పనిచేస్తున్నావ్. తూరీగలకు ఎంత బాధవుంటుందో—అమ్మకొనేవాళ్లకి ఎంత యిబ్బందికలుగుతుందో చిన్న పిల్లలకి తెలియదు. అలాగే నువ్వు టెలిఫోను కాల్సు వస్తూంటే. రాంగ్ నెంబర్ రాంగ్ నెంబర్ అని చెప్తున్నావ్. దానివల్ల యివతల కంపెనీవాళ్లకీ అవతల మన కష్టమర్సుకీ, క్లయింట్సుకీ ఎంత నష్టం, కష్టం కలిగిస్తున్నావో నీకు తెలియదు. ఈ ఆఫీసులో నీలాటి కుర్రతరహా వ్యక్తులకి స్థానంలేదు.

రామా : రాంగ్ నెంబర్ అని చెప్పగా విన్న గాడిదవరండీ...

మేనే : నేనే ఆ గాడిదను. రాత్రీ, పొద్దున్న ఫోనుచేసినది నేనే. ఇది వెంకట్రామయ్య అండ్ కంపెనీకాదు. డాక్టరు వెంకట్రామయ్య అని నువ్ చెప్పలేదూ?

రామా : లేదు.

మేనే : (కాలింగ్ బెల్ కొట్టి) ఏమిరా ఆరుమ్గం. పొద్దుట రామారావుగారు ఫోనులో ఏం చెప్పారురా.

ఆరుమ్గం : డాక్టరు వెంకట్రామయ్య అని చెప్పిరి సార్.

మేనే : మరి యిప్పుడేమంటావ్ రామారావ్?

రామా : ఒక బాధ్యతగల ఎంప్లాయికన్న మీకు ప్యూన్ మాటమీద నమ్మకం ఉంది అంటాను.

మేనే : ప్యూను ప్యూను అని నిరసనగా మాట్లాడుతావేం. వాడు మనకన్నా ఏం తీసిపోయాడు. అదీకాక, నేను చెవులారవింటే నీగొంతుక నేను పోలిక పట్టలేననుకున్నావా?

రామా : మీ గొంతుక నేను పోలిక పట్టలేననా మీ ఉద్దేశం.

మేనే : నేనొక్కణ్ణే కాదు. ప్రొప్రయిటర్ గారుకూడా విన్నారు.

సుబ్బ : నేనుకూడా విన్నా సార్ ఆఫీసులోకి వస్తూఉంటే రామారావుగారు టెలిఫోనులో రాంగ్ నెంబర్ అని చెపుతున్నారు.

రామా : థాంక్సు. సుబ్బయ్యగారూ థాంక్సు.

మేనే : రామారావ్. నావెంట రా. ప్రొప్రయిటరుగారు నిన్ను చూస్తారు.

రామా : పదండి. (నిష్క్రమిస్తారు)

వీరరాఘు : ఎంతపనిచేశారండి సుబ్బయ్యగారూ...

సీతాపతి : ఈ ఆరుమ్గం వెధవకి బుద్ధిలేకపోతే పోయింది మీకు లేదా—వాడి ఉద్యోగం పొట్టను పెట్టుకొంటారా.

సుబ్బ : అమ్మమ్మ ఎంతమాట. వారి ఉద్యోగం నేను పొట్టను పెట్టుకోడం ఏమిటండి? ఉన్నసంగతి విన్నమాట మనవిచేసుకొన్నాను అంతే.

సీతా : -మహాసత్యహరిశ్చంద్రులు బయలు దేరారులెండి యిన్నాళ్లకి.

వీర : అవునయ్యా సుబ్బయ్యగారూ...నిజమైనా యిలాంటి సంగతి చెప్తారుటండీ.

సుబ్బ : ఏదో ప్రొప్రయిటరుగారి ఉప్పు తింటున్నాను. చెప్పవలసింది చెప్పక తప్పదు.

సీతా : ఉప్పుతింటున్నారట ఉప్పు. గడ్డి తింటున్నారు. యింకా వాడు యిప్పించిన టీనీళ్లు మీ కడుపులోనే ఉన్నాయి అప్పుడే వాడికి ద్రోహమా! ఉద్యోగం పుణ్యం కట్టుకొంటారా. ఆమాత్రం విశ్వాసం లేదుటండీ...

వీర : మీరు వారంరోజులాయి పస్తు పడుకుంటున్నారని విని, బస్సు ఖర్చులకేనా జేబులో మిగుల్చుకోకుండా ఉన్నడబ్బంతా మీకు యిచ్చేశాడే. వాడికి మీరు చూపించే కృతజ్ఞత యిదేనా.

# ప్రతిఫలము



శ్రీ విశ్వనాథ అచ్యుతదేవరాయలు

త్రిపాఠీ మళ్లీ ఉత్తరం వ్రాశాడు. దసరా శెలవలకు డెహ్రాడూనుకు రమ్మనమని. శెలవలు గడపటము ఏలాగా అని నేనూ అనుకుంటున్నాను. ఉత్తరము సమయానికి వచ్చింది. అడవులలో మేమిద్దరమూ కలసి 'షికారు' పోయి చాలా రోజులైనది. నేను డూనుకు వెళ్ళినాను.

త్రిపాఠీవాళ్లది కలసంసారము. వాళ్లది డూనుకు దగ్గరగా ఒక పల్లెటూరు. అతనుమాత్రం డూనులో ఉంటున్నాడు. అతనూ నేనూ కలసి చదువుకున్నాము. మా ఇద్దరికీ అడవులలో తిరగటమంటే విపరీతమైన సరదా. నేను నా కెమేరాతోను, త్రిపాఠీ తన తుపాకితోనూ 'కుమావూను' అడవులలో ఎన్ని రాత్రులు గడిపినామో! నేను అడవిమృగాల ఫోటోల నెన్నో తీసినాను. తీసిన ప్రతిఫోటో అతను దగ్గరగా నున్నపుడే. ఆ సమయంలో అతని తుపాకి నాకు రక్ష. అతని తుపాకి క్రింద నేను ఎంత కీకారణ్యములో నైనా నిర్విచారముగా తిరిగే వాడిని. తుపాకి గురిచూడటములో అంత ప్రజ్ఞ కలవాడిని తిరిగి నే నింకొకనిని ఎరుగను. వేట, దాని పరిజ్ఞానమంతా నే నతనిదగ్గర నేర్చుకున్నదే. అడవిలో మృగాల వెంబడి తిరగడం, వాటి అలవాట్లను పరిశీలించడం, వాటికి మల్లే అరవడం—అతను నాకు నేర్పినవే. అడుగుల గుర్తు చూడగానే, జంతువు యొక్క వయస్సు, సుమారుగా అది పోయిన వేగము, తెలుసుకొనటము అతను నాకు నేర్పిన విద్య. నే నతనికి నేర్పిన దింకొకటి. అది, అనవసరముగా తుపాకిని ఉపయోగించక పోవటము. ఇది వరకు అతను అడవిలోనికి వెడితే ఏదో ఒక మృగాన్ని కొట్టి తెచ్చేవాడు. వాళ్లయింట్లో గోడల నిండా పులుల తలకాయలు. నేలమీద జింకచర్మాలు. అతను అడవినుండి ఏ జంతువునూ తీసుకు రాకపోవటము ఈమధ్య జరుగుతున్న విషయము. ప్రాణరక్షణ కోసము తప్ప, ఇంకెందుకూ ఏ మృగాన్నీ కొట్టకూడదు. సుఖదుఃఖాలు సర్వ ప్రాణులకు సమానమన్న మాట నే నతనికి గట్టిగా చెప్పాను.

ఇదివరకు నేను చూచినప్పుడు త్రిపాఠీ కొడుకు మరీ పసివాడు. ఇప్పుడు కమల నయనుడు కొంచెము సాగినాడు. దొడ్డి అంతా ఒకటే గంతులు. వాడిని చూస్తే నాకు మరీ ముద్దయినది. త్రిపాఠీ అన్నాడు.

"ఈసారి కనక వీలైతే చిన్న లేడిపిల్లను పట్టుకు రావాలి. మా అబ్బాయి ఆడుకునేందుకు."

"ఈ సింహ శాబకాన్ని చూచి, అదికాస్తా బెదిరిపోతుందేమో" నన్నాను.

సాయంకాలము వాళ్ల కారులో బయలుదేరి అడవిలోనికి పోయి, ఆ రాత్రికి ఫారెస్టు బంగళాలో పడుకున్నాము. మరునాడు ప్రొద్దున నే లేచి బంగళా వెనకనున్న కొండమీదికి బయలుదేరినాము. కొంత దూరము ఎక్కిన తరువాత పెద్ద వడగండ్ల వాన కురిసినది. వాన కురిసినంత సేపు ఒక గున్న చెట్టుక్రింద నిలబడినాము. అడవిలో వాన కురిస్తే ఎప్పుడూ చిన్న చెట్టునుచూచుకోవాలి. ఎత్తైన చెట్ల మీద పిడుగులు తరచుగా పడుతూ ఉంటాయి. వాన వెలవడమేమిటి! మబ్బులలోనుండి పిలపిలా ఎండ రావడమేమిటి! రెండూ ఒక్కసారే జరిగినవి. తడిసిన రాళ్ళమీద కాళ్ళు జారటము మొదలు పెట్టినవి. ఇంక పైకి ఎక్కటానికి అవకాశము లేక, ఎడమ వైపున ఉన్న దట్టమైన అడవిగుండా వెళ్ళినాము. అడవి దాటగానే పెద్ద పచ్చిక బయలు. మేమింకా చెట్లు దాటకుండానే దూరాన ఒక జంతువు కనబడినది. ఆ చెట్లసందునుంచి, దాని తోక, కాళ్ళు మాత్రమే కనపడినవి. అది తల ఎత్తితే లేడి అని తెలిసినది.

ఆ పచ్చిక బయలులో, మేము నుంచుని ఉన్న చెట్లకు కొంచెము దూరముగా, నాలుగు అడుగుల ఎత్తున ఒక పెద్ద బండ ఉన్నది. దానికి చుట్టుపట్ల ఏవీ చెట్టుగాని, చేమగాని లేదు. సాధారణంగా లేళ్ళు అడవిలో గుంపులుగా ఉంటయి. ఆ లేడి మాటిమాకి తలఎత్తి తూర్పువైపు చూస్తున్నది. దానిని బట్టి లేళ్లగుంపు ఆవైపు ఉన్నదనీ, మాకు కనబడే లేడి కాపలాదారనీ వెంటనే తెలిసింది. త్రిపాఠీ అన్నాడు. 'ఆ లేళ్ల గుంపులో కనక లేడిపిల్లఉంటే తప్పకుండా పట్టుకోవాలి.' నేనూ దానికి సరే నన్నాను.

మా నిర్ణయము ప్రకారము నేను చెట్టు చాటున నుంచున్నాను. త్రిపాఠి ఆ లేడి తలఎత్తినప్పుడల్లా ఆగిపోతూ, గడ్డిపరకలు కొరుకుతున్నప్పుడు ప్రాకుతూ, ఆ రాతిబండ చాటునకు చేరినాడు. త్రిపాఠి చెయ్యి విసరగానే నేను చెట్టుచాటునుంచి, లేడి మళ్లీ గడ్డిపరకలకోసం మెడ వంచగా చూసి, చిరతపులికి మల్లే అరిచాను. మేము కొండ ఎక్కేటప్పుడే, చిరతపులి అడుగులు కనపడ్డవి. అందువలన చిరతపులి ఆ కొండమీద ఉన్నదన్న మాట.

నాగొంతు వినగానే ఆ లేడి ఒక్కసారి గిరుక్కున తిరిగి, ముందర కాళ్లను నేలమీద కొట్టటం మొదలు పెట్టింది. అంటే, అపాయమును తక్కిన గుంపుకి తెలియ చెప్పుతున్నదన్నమాట. కాని ఆ గుంపులోని తక్కిన లేళ్లను చూడటానికి వీలు పడ లేదు. ఈ లేడి భయముతో కూస్తేగాని, అవి బండ ప్రక్కగా పరుగెత్తుకొని రావు. ఈ లేడి చిరతపులిని చూస్తేగాని కూయదు. నేనప్పుడు పసపురంగు ట్వీడు కోటు తొడుక్కున్నానేమో, నా కుడిభుజమును, చెట్టుచాటున నుంచి కొంచెము బయటపెట్టి, రెండు సార్లు కదిల్చాను. ఆ కదలికను వెంటనే గుర్తుపట్టి, ఆ లేడి రెండు గంతులు ముందరకు గంతి, కూయటము మొదలు పెట్టింది. అపాయము దగ్గరలోనున్నదన్నమాట. అన్నీ ఒకటి తరువాత ఒకటి కూసిన లేడి దగ్గరకు చేరుకున్నవి. మొదట ఒక పెద్ద లేడి బండ ప్రక్కగా వచ్చినది. తరువాత రెండు దుప్పులు. తరువాత లేడి పిల్ల తల కనపడినది. వెంటనే త్రిపాఠీ లేచి నిలపడ్డాడు. చేతిలో లేడి పిల్ల, లేళ్లగుంపు ఒక్క పెట్టు అరచి, చెల్లాచెదరై దూరంగా పారిపోయినవి. అన్నీ దూరంగా పోయినా తల్లి లేడిమాత్రము పదిగజాల దూరము పోయి వెనక్కి తిరిగి చూస్తూ నిలబడింది. అప్పటికే నేనుకూడా ఆ బండ దగ్గరకు వెళ్లాను. పిల్లను కోల్పోయిన ఆ తల్లి చూపులు నా గుండెకు తాకినవి. వెంటనే నా కెమేరాతో దానిని ఫోటో తీశాను. త్రిపాఠీతో ఆ లేడిపిల్లను వదలమంటామనుకున్నాను. అతని ఉత్సాహము నన్నామాటను అననీయ లేదు. త్రిపాఠీ లేడిపిల్లను చంక పెట్టుకున్నాడు. అతని తుపాకిని కూడా నేను మోస్తూ, బంగళాకు చేరినాము.

దూను చేరిన తరువాత, కమలనయనుని ఉత్సాహానికి మేర లేదు. వాడే లేడిపిల్ల ; వాడికింకొక లేడి పిల్ల. క్రమంగా వాళ్లిద్దరికీ స్నేహము బలిసిపోయింది. నెలరోజులు తిరగకుండానే కమల నయనునికి లేడి పిల్ల ప్రాణమయిపోయింది.

నేనా తల్లి లేడి ఫోటోను పెద్దది చేయించి, నా గదిలో గోడకు తగిలించాను. ఆ బొమ్మవంక చూచినప్పుడల్లా, ఆ లేడి కళ్లలోని దైన్యమంతా ఒక్కసారి స్ఫురించేది. అది మళ్లీ తన పిల్లను తన కిమ్మని అడుగుతున్నట్లనిపించేది. లేడిపిల్లను తీసుకు పోయి మళ్లీ ఆ పచ్చికబయలుమీద వదలితే ! కమల నయనుని ఉత్సాహానికి భంగమౌతుందేమో !

ఇంతలోనే దసరా పండగలు వచ్చినవి. దసరాపండగకు 'కూలూ లోయ'లో పెద్ద ఉత్సవం జరుగుతుంది. ఆనాటికి ఆ చుట్టుపట్ల అన్ని దేవాలయాలలోని, ఉత్సవ విగ్రహాలను పెద్ద ఊరేగింపులలో ఒక్కచోట చేరుస్తారు. ఈ ఉత్సవాన్ని చూడటానికి ఆ చుట్టుపట్ల ప్రాంతాలన్నిటినుంచీ జనం గుంపులుగా వస్తారు. మేముకూడా బయలుదేరి 'కూలూ' వెళ్లాము.

జనం ఇసకవేస్తే రాలటంలేదు. తప్పెట్లూ, తాళాలూ, కమలనయనునికి బాగానచ్చినవి. ఆ ప్రదేశమంతా తిరిగి, సాయంత్రానికి యింటివైపు బయలుదేరాము. కమల నయనుడు కనపడలేదు. తప్పి పోయినాడు. అంతవరకూ మా వెంటనే ఉన్నాడు. ఏలాగ తప్పిపోయినాడో తెలియలేదు. చుట్టుపట్ల అంతా వెతికినాము. కనపడ్డవారినల్లా అడిగినాము.

ఆ చోటే లేదు. త్రిపాఠీకి పిచ్చిఎక్కినట్లైనది. ఆయన భార్య నయము. కొంచెము ధైర్యముగానున్నది. త్రిపాఠి ఉద్వేగాన్ని మేము ఆపలేకపోయినాము. తిరిగి, తిరిగి, రోడ్డుప్రక్కన ఒక బండమీద కూలబడినాము. త్రిపాఠీ మౌనంగా కూర్చున్నాడు. దైన్యమంతా అతని కళ్లల్లోనికి వచ్చింది. ఆ కళ్లను చూస్తే ఫోటోలో లేడి కళ్లు జ్ఞాపకానికివచ్చినవి.

డూనులో ఇంటిదగ్గర ఎవ్వరూలేరు. ఇల్లంతా నాకళ్లమీద వదలివచ్చినాను. నేను డూనువెళ్లి యింటి సంగతి చూడటము. తల్లిదండ్రు లిద్దరూ కమలనయనుని వెతకటము. ఆ రాత్రికే నేను డూను చేరాను.

రాత్రికి నా గదిలో విశ్రమిస్తూఉంటే, మళ్లీ ఆ ఫోటోను చూచాను. నామనస్థ్సితివల్లనో ఏమో, ఆ రోజున ఆ కళ్లు మరీ దైన్యముగా ఉన్నాయి. ఆ లేడివంకనే చూస్తూ నిలబడ్డాను. అప్పుడే పదిగజాల దూరముపోయి వెనక్కి తిరిగి నిలబడినది. త్రిపాఠి చేతిలోని, తన పిల్లవంక రెప్పవాల్చకుండా చూస్తోంది. "కమల నయనుడింక కనపడడా?" "నా పిల్లను నా కిస్తావా మరి" అన్నదా లేడి. కళ్లలోని నీటి బిందువులు తుడుచుకొని చూచాను. లేడి కదలటములేదు. అది కన్నీటి బొట్ల కదలిక. లేడి మళ్లీ యథాప్రకారముగా చూస్తున్నది.

ఆ తెల్లవారు జామునే డ్రైవరును లేపి కారుమీద నలభై మైళ్లుదాటి, ఫారెస్టు బంగళాకు పోయినాను. సూర్యోదయమవుతూ ఉండగా వెనకనున్న కొండ నెక్కాను. కొండను చూచిన దగ్గరనుంచీ లేడిపిల్ల గెంతటము మొదలుపెట్టింది. దానిని చేతులలో పట్టుకొనటము కష్టమయిపోయినది. అది నిలవటములేదు. అడవిదాటి, ఆ మైదానములో దానిని వదలివేశాను. ఆ మైదానమంతా ఖాళీ. ఒక్కలేడి కూడా అక్కడలేదు.

తిరిగి డూనువచ్చేటప్పటికి సాయంత్రం కూడయినది. నేను వచ్చేటప్పటికి, త్రిపాఠీ, భార్య, కమల నయనుడు, వాకిట్లో కుర్చీలలో కూర్చున్నారు. నన్ను చూడటములోనే, కమల నయనుడు ఎగిరి నా ఒడిలోనికి దూకాడు. రోడ్డుప్రక్కన ఒక్కడే కూర్చున్నాడట. వాళ్ల ఊరివాడెవరో ఉత్సవానికి వస్తే, కమల నయనుని గుర్తుపట్టి, తనవెంట తెచ్చి, త్రిపాఠీకి అప్పచెప్పినాడట. కమలనయనుడు ఉద్దండుడు. వాడు ఏడవనే లేదట.

కమల నయనుడు 'నా లేడిపిల్ల ఏది?' అని అడిగాడు. 'నువ్వు మీ నాన్న దగ్గరకువచ్చినట్లే అది వాళ్ల తల్లిదండ్రులవద్దకు పోయిన'దన్నాను. ఆ మాట వినిపించుకోకుండా, కమల నయనుడు దొడ్డిలోనికి లేడిపిల్లకోసం పరిగెత్తాడు. నేను కమల నయనుడు లేచిపోయిన పడక కుర్చీలో నడుము వాల్చాను. ఆలోచన మైదానము మీదకుపోయింది. ఇప్పటికి లేడిపిల్ల గుంపులో కలిసినది కావలెను!



# భావికాలపు చదువరికి

•

శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

ఒక కాముంగాక మరే ఇతరాలగు [స్యల
ప్రాథమికావసరాలను , భౌతిక విషమ సమ
ఎదురుకునే అవసరమే లేని మనుజుడా!
ఈ మా రచనలు
కొన్ని శతాబ్దులు గడచిన తదుపరి
చదివే ఓ పరిణతజీవీ!
భావికాల పాఠకుడా!

* * *

మాభావనలేవో సంకుచితపు టవధులలో
తిరుగుడు పడునని
బిగించబోవకు నీపెదవులు
పరిహాస విలాసంతో!
అతి దృఢమగు లోహపు సంకెలలో
మామెదడులు బందీలై
దృష్టికి సునిశితత్వం, వైశాల్యం, గాంభీర్యం,
లోపించాయని
నీకను కొలకులలో
నిరసన మెరియగనీయకు!
అగ్నిపర్వతంపై వికసించిన
ఎఱ్ఱ గులాబులలో
ఆలేఁ దావులలో
అందానికి, ఆనందానికి
నిర్వచనాలను
వెదకలేమి మీరని,
ఉత్తమొద్దు మనసులు కాబోలని,
పాశ్విక ప్రవృత్తులా ఏమోఅని,
వేళాకోళంగా మాట్లాడకు!
ఎవరెవరో బుడగల వ్రేళులలో
నీటిమీద చేసిన, చేసే, చేవ్రాళ్లకు
వ్యాఖ్యానాలను సమకూరుస్తూ
సమయం వినిమయ మొనరించామని దెప్పకు!

* * *

మాలోకొంకరు
రాబోయే రేపు గురించి
తాముకనే కలలే
తమకు బ్రదుకుపడవ నడిపే తెడ్లని,
విడబోయే ముకుళాలనే
స్వప్నాలకు పునాదిగా వెయ్యమనీ,
పలికిన ఎస్కేపిస్ట్స్ ఉన్నారు.
కానీ మొత్తంపై
మాయుగాన
ఆలోచనగల మానవులంతా
నేటికిమటుకే తమయోచనలో
ప్రాముఖ్యా న్నిస్తున్నారు!
ఒక సందిగ్ధ పరిస్థితిలో
ప్రమాద భూయిష్ఠపు లగ్నసంధిలో
మేమున్నా మిప్పుడు.
కొంతమంది నైరాశ్య మతస్థులు
రేపన్నది రానే రాదని
నేడే మానవజీవిక కవసాన ముహూర్తమనీ
బేలకళ్లతో బొంగురుపోయిన గొంతులతో
ప్రచారంచేస్తూ గగ్గోలవుతున్నారు.
స్థలకాల విభేదాలకు
పట్టింపులు చేయబోక
విశ్వశ్రేయస్సు గూర్చి
ఆలోచిద్దామని యత్నించే

మేఘావుల భావనరస్సుల కెరటాల్లో
పైఆకాశపు దట్టపు మబ్బుల తెలినలినీడలు
ప్రతిబింబిస్తున్నాయి
అప్రయత్నంగా, సహజంగా!

* * *

శ్రీగలవారికి
లేనివారికీ
జరిగే సంఘర్షణలో,
స్వామిక శ్రామిక శక్తుల వికారపు కుస్తీలో
ఈమా నేడు
జార్తోంది
ఎలాగూ
అనుభవయోగ్యం కాకుండా!

* * *

నేటిగురించే ఆలోచిస్తున్నాం—
నిజమే!
నేడు-నేడు-నేడు-నేడు!!
కాలవాహినీ గమనంలో
నేడను సుడిగుండపు టావర్తాల్లో
గిరగిర గిరగిర తిరుగుడు పడుతున్నాం—
మాబాధొకటే:
నేడిచ్చే ఫలితాలకు రేపన్నది బలికా
కూడదని!
అందువలననే నోయీ
నిన్నగ మార్తూ
మీనేటి పునాదుల్లో దట్టింపబడే
మానే డవ్వకై పోరాదని
విపర్యాసపు పర్యవసానం కారాదని
వెచ్చిస్తున్నాం మాఆలోచన
నేటికోసమే!

* * *

ఈపనిలో
విజయంగైకొంటామని
మాకున్నది విశ్వాసం!
అందుకనే నీడనికిని సందేహింపక
నీకిది వ్రాస్తున్నాం!

* * *

నేడను వలయంలో
పరిభ్రమించే
ఈమాకాలపు రచయితలందరి తరఫున
నీకిది ప్రార్థన—
ఓదూరపు చదువరీ!
వర్తమానకాలపు దుష్ప్రభావమో, సుప్రభావమో,
తప్పించుకు పోలేకుండా
గిజగిజ కొట్టుకులాడే
ఈరచనల నర్థంచేసుకో!



# యథార్థమునుండి పరమార్థము



## శ్రీ కవికొండల వేంకటరావు

నేను ౧౩-౬-౧౯౪౦ వ తేదీ రాత్రి వ్రాసికొన్న ఒకానొక దినచర్య వృత్తాంత ఖండికను ఉటంకించుకొంటూ యథార్థముమీదకు దృష్టి సారిస్తూ ఉంటే, పరమార్థం వినిపించద మేమిటా అనేదే యీ కథలోని చిత్రం.

ఉటంకిస్తూవున్న యదార్థం ఇది :—"వర్షం జోరుగా కురుస్తూవుంది. జల్లు ఉత్తరంనుంచీ, మధ్య మధ్య తూర్పునుంచీ కొడుతూవుంది. అసలు కొట్టు మూసివుంది. అరుగుమీద దర్జీవాడు తానుకుట్టే 'సింగరు' యంత్రంమీద బస్తాసంచీ కప్పి కూర్చున్నాడు. నేనున్నూ ఒకమూలగా కొత్త తాటాకు బుట్టల మూడు గుదులు పడేసివుంటే వాటి చాటుకు జేరికూర్చున్నాను. ఒక కార్మిక యువకుడు సన్నటి రివటలాంటివాడు, పొడుగాటి కోడెకాడు, కాకి నిక్కర్ ఘట్టిది తొడలకు తొడుక్కుని, చేతుల్లేని తెల్లని బనియను చినుగుల దొకటి, జెల్లులూడదీసిన తెల్లగోడలా, లోపలి నల్లని ఛాతీ వీపూ అక్కడక్కడ కాపరుస్తూవుంటే, రెటాల్న వాడూ ఆ వానకు జడిసి ఈ అరుగే ఎక్కి నిలబడ్డాడు ఒక వోరగా. వానికో ఇరవైయేళ్లుంటాయి. వాన దబదబా దంచేస్తున్నకొద్దీ వానికి హుషారెక్కువై "ఓ- ఈ రాత్రి—వుంటుంది - కొత్త మేళాలకీ——" అని అభినయిస్తున్నాడు. అప్పుడే ఓ నల్లని లావుపాటి కూలీ ఆడుది, చెమటచేతా వానచేతకూడా వొళ్లు, వస్త్రం అంతా తడిసి ముద్దయి మా అరుగే తానూ ఎక్కింది. ఈ యిరవైయేళ్ళయువకుడూ అపాళంగా అతి చనువుగా "ఎక్కణ్ణుంచేంటి రాక? ఏమాత్రం ఈ పొద్దుగరణ?"—అని అడిగాడు. అది వెంటనే "కొట్టుతీసివుంటేనా?" వానతో తడిసిన తన పెదవులు నాలికతో రాసుకుంటూ "ఒక టేమిటి? ఇవ్వాళుక్క లోకబండి కెక్కించాను. ఒక బండినుండి కఱ్ఱ ముక్కలు దించేశాను. ఈ కఱ్ఱముక్కలాయన ఒక అణా డబ్బులింకా ఇవ్వవలసివుంటే, ఆవాటికోసం ఆలా కూక డడిపోనాను. దారిలోనే తడిసిపోనాను. పెందలకడే ఇంటికివెళ్ళి కూడొండుకోవచ్చు నను కుంటే ఇక్కడే సందలడిపోయేటట్టుంది. దిక్కుమాలిన వాన తగ్గేటట్టులేదు." అని అంటూ మోగాళ్ళ రింగులు కుంటిచెంగులు లుంగచుట్టికలిపి ఏక మొత్తంగా పెచేసి వదేసి పిడపెట్టసాగింది. సాహుకారొకడు ఎదరరుగుమీద వేడివేడి పకోడీలు తింటూ వాన చినుకులగుండా ఈ కూలీ ఎలవాగను పిలిచినట్టు కూకేసి "అన్నీ కడిగి పిండేశావా? ఇంకా ఏమైనా ఉండిపోనాయా?" అని అడిగాడు. అదీ విలాసవతే ఏమో—"వానలో కదుక్కపోతే ఇంకెప్పుడండీ?" అంది. "నీ మగడిప్పుడెక్కడున్నాడు?" అని అడిగేడు సాహుకారు. "ఎక్కడేంటి? ఈ వూళ్లోనే" అని అంది అది. "మరి కనబడ్డంలేదేం?" అన్నాడు సాహుకారు. "ఈ మధ్యన మేకుసుచ్చుకు తిరగడం లేదండి!" అంది. "మరెక్కడాక్కపోతే పోరా దింటికి?" అన్నాడు పొట్లం ఆకు వానలోకి గిరాటేస్తూ సాహుకారు. "తల తడిసిపోతుంది" అంది అది తన తడిసిన జుత్తు విరబోసుకొన్నదై దులుపుకొని, అంతో ఇంతో చిక్కు వదిసి సాహుకారెంపు ఆ వానలోకే గిరాటేస్తూ.

—అదాకాచూరుకొన్న యువకుడు అన్నాడు "పిల్లా! నీ వెంట్రుకల చిక్కు ఈ సైడ్ కాల్వంటూ, సాహుకారు పొట్లం ఆకు ఆ సైడ్ కాల్వెంటా అలా పోయిపోయి ఏకమూతా" యని అడిగేడు, కూలిదాని వొంక ఒకపాలి, ప్రవహించే నీటి పొలుదలకంక ఒకపాలి చూస్తూ. "నీ కెంతసేపూ కళ్లు సైడ్ కాలువ లేగాని మధ్యనసురిసే మంచివోన కాపవదు" అంటూ తిరుగ వాన చినుకుల్లో నేపడి తడిసిపోతూనే వెళ్ళిపోయింది ఆ వగలాడి. యువకుడు "ప్రేమమయ మీజగతు, త్యాగమయమీ జగతు" అంటూ గానం జేమ్కడు. దర్జీవాలా "నీవు నాటకంలో వేషంవేస్తే హైదర్జంగులాగుంటావు! లాల్ఖానుడులాగుంటావ్" అన్నాడు. యువకుడాపాళంగా "ఓ గయుడా! ఆ తులువను తెలుపుము. నీ ఆతురత మానుము." అంటూ గరుత్మంతుడిలా, వాన వెలవకుండానే నుబో దిక్కుకు వెళ్ళిపోయినాడు. మిగిలింది నేను,దర్జీ, సాహుకారు ముగ్గురమే ఉన్నాము.

—నన్నెవ్వరూ ఎరుగరు. దర్జీన్నీ సాహుకారున్నూ ఒక రొంక వొకరు చూసుకుంటూ "వేడి వేడి పకోడీ మీరొక్కరే తినకపోతే దానికూడా పెడితేం?" అని దర్జీ అంటే సాహుకారు "కుట్టిన

కొత్త కచ్చా దానికి నీవు బహుమానం చేస్తేం? అలా తడిసిపోయింది, గందా!" అని షాహుకారన్నాడు.

—వాన వెలిసింది కాని, పిడుగడ్డట్టు ఉత్త ఆకాశం, రిత్త, పెద్దమెఱుపు మెఱసి, 'ఎద్దికా?' అన్నట్టుజేమింది."

నేను వ్రాసిన దినచర్య వృత్తాంతఖండిక దానితో ముగిసింది.

* * * *

నా చిన్న పొత్తములో ఆనాటి వృత్తాంతం అంతమట్టుకే వ్రాయగలిగాను. గాని, వ్రాయలేని దెంతవుందో అందు పైదన్న సంగతి యింతవరకూ ఎవ్వరికీ తెలియదు. అప్పటినుంచీ నా పరిభ్రాంతి పరిపరివిధాలు అనుకోండి పాఠకులు. కుదకొక్కక్కప్పుడేమని తోస్తుంది?—ఆ వేడివేడి పకోడీలు ఆ షాహుకారు తినడం, ఆ యువకుడు రాగాలాపన గావించడం, ఆ కుఱ్ఱది తడిసినబట్ట పిడపెట్టుకోవడం, సత్యసంధానాలైనా, పౌష్టిక విభిన్న పంథాలా అన్నట్లు అనిపిస్తూంది. ఎందేతా అంటే ఆ వానజల్లు లేకుంటే వాళ్ళందఱూ నేనూ ఇంత మందిం ఒకచోటకూడడం, మాట్లాడుకోవడం, జరిగి వుండదు. వాన అదో జోరుగా, జారుగా, పైనుండి ఏ చినుక్కా ఆ చినుకే ఏరుగా పడుతూంటే ఎట్టి దృశ్యమైనా అందులో కరిగి మారు రూపం వహించక పోయేనా? అటువంటప్పుడు అందుమీద సమాలోచన మఱీ మాయగా నడవొచ్చు!

* * * *

తిన్నగా ఆ ముసద అలవాన వెలిసిపోయేసరికి తన నుడిసెచుందుకు చేరుకుంది. అప్పటికప్పుడే దారిలోనే ఆమెకు పెద్దమెఱుపు కనిపించింది. పెద్ద ఉరుము వినిపించింది. నేను లోగడ వ్రాసిన ఆ మెఱపే ఆ ఉరుమే! అది ప్రపంచాన్నంతనూ దద్దరిల్ల చేసేటంత పెద్దదీ హద్దు లెఱుగనిదీని! అదివిన్న ప్రతివాడూ కన్న ప్రతివ్యక్తీ, తనకొక్క వలసిన వాళ్ల మీద ఆ పిడుగు పడివుండేమో అనే దిగ్భ్రమ పొందకమానడు.

లోకంతోపాటు ఆమెలోను ఆ అదురు ఉదయించింది. అయితే ఆమె నుమ్మంయుందు ఆమె వెళ్లేసరికి, ఇద్దరు భక్తులు, భద్రాచల రామ భజనపరాయణులు, ఆదాకాపడ్డ చినుకుల్ని సెమలికన్ను వింజామరలతో చెదరించారా అన్నంత పొడిగా, ఆదాకా పీచిన మహోద్ధుంధ్యూ మారుతాన్ని తమకన్నుగవ ఱెప్పల కప్పుచే నిలిపారా అన్నంత పొదుపుగా కనబడుతూ ఇలాపాడుతున్నారు.

"రంగా! శంఖచక్రంపట్టే దెందుకు?—

భక్తజనుల రక్షించేటందుకు" అంటూ తియ్యని ఆడుతున్నారు. ఈ కూలీ యువతిని వాళ్లు ఎప్పుడైతే చూచారో అప్పుడు పాట ఆపి "తల్లీ! ధర్మతల్లీ! ధర్మం అమ్మా!" అని అడిగారు. ఆమె వాళ్ల సెమ్మెలో ఒకకానీ ఆలాపడేసి తనయింటి తలుపులు లోపలివి తోసింది. ఇల్లంతా, వీధిలో భిక్షుకులెత్తిగొంపోతూవున్న సెమ్మెదీపం వెలుగున ఒక్కసారి కాంతిల్లి చీకట్లు కమ్ముసింది. లోపల ఆమెకు తన మగడు కానరాలేదు. వెంటనే ఆమె "నా మగడింట్లో మంచముమీద బొందితో నుండాలి, లేకుంటే స్మశానంకాడ బుగ్గయియుండాలి. ఈ మధ్య ఎక్కడా వుండడానికి వీల్లేదల్లో!" అని విపరీతపు వెఱ్ఱిశోకంలోకి దిగింది. అప్పటికప్పుడే భిక్షుకులు, చిరతలు తాళాలు బిగ్గఱబిగ్గఱగా వాయించుకుంటూ ఆ పిసంతా భక్తిపరవశంగావించుకుంటూ మలుపు తిరిగి మాయమైపోయారు. తన మగడు సశరీరస్వర్గం చూఱగొన్నాడా అనే యోజన మధ్యమధ్య ఆమెకు తట్టేలా ఆ భిచ్చగాండ్ల చిరుతలూ తాళాలూ ఆమె వద్దకు వచ్చివాగేవి. మళ్లీ దూరంగా పోయేవి.

వస్తూపోతూవున్న భక్తిపూరితధ్వనిచే మఱ్ఱాతలూగే మనస్సుకన్న గెట్టింతలుఱ్ఱాతలూగ సాగింది రక్తిపూరితమైన ఆమె గుండెకాయ. పైకిచూసింది. తనయింటియొక్క పాత తాటాకుకప్పు మునుపు ఏలా వుండేదో అలాగేవుంది. ఒక్క ఆకన్నా చెదరినట్టు లేదు. చిల్లపడినట్టు లేదు. నేలవంక చూసింది. నట్టింట మిఱ్ఱుమిఱ్ఱులాగేవుంది. బొట్టిపడి యుండలేదు. దానా దీనా పిడుగు తనయింటిమీద పడలేదు, అని నిర్ధారణ గావించుకుంది. "మఱేమయ్యేడు తన మగడు?" అని అడిగేటందుకూడా అలవిగానంత విలాపంలో పడింది. విలాపంలోనే పెరటి తలుపుకేసి చూసింది. అది బారెటైవుంది. అప్పుడనుకుంది "దొంగ లెవరో పెరటి దోవను తనయింట్లో ప్రవేశించి తన మగణ్ణి అమాంతం ఎత్తుకుపోయివుంటారు" అని. అయినా మధ్యమధ్య మృత్యుదేవతాతోచీది ఆమెకంటికదో పెద్దపులిలాను. పెద్దపులిలోను, బొమికలు వెంద్రుకలుకూడా మిగల్చకుండా తినేసే గండుముఖం, గాబరాఎత్తించే నఖంకొపరుస్తూ మఱీకనిపించీది. దొంగలైతే మనిషిని మనిషినే ఎత్తుకుపోతారా అని తలపోసింది. వంగని ఇల్లంతా గాలించింది. కొల్లట్టుకు వెదకినట్టు వెదికింది. పీరాపీరా అని కేకేసింది. వినిపించినవారూ లేరు. కనిపించినవారూ లేరు.

అంతలో రాత్రి తొమ్మిదయ్యే ఆ ప్రాంతముకు ఒక పెట్రోమాక్సులైట్ వేసుకుని, ఇరువురు నవుకర్లతో ఒక శానిటరీ ఇన్స్పెక్టరుగారు ఫినైల్ గిన్నెల్ తీసుకుని, బూట్సుచప్పుడు గావించుకుంటూ

లోపలికి వచ్చారు. "ఎవరు మీరు? నా పాలిటి దేవుళ్లలాగొచ్చారు!" అంది కార్తికయువతి, కన్నీళ్ల తడిసినముందు జుట్టు వెనక్కు తోసుకుంటూ. "నేను ఈ ఊరి శానిటరీ ఇన్స్పెక్టర్ను. ఈ యింట్లో కలరా చెలరేగింది. ఆ రోగిని హాస్పిటలుకు చేర్చాం. చేర్చీ చేర్చడంలోనే రోగి మరణించాడు, అని హాస్పిటల్ డాక్టరుగారు నాకు వర్తమానించారు. ఈ యిల్లుమీదేనా? ఆ రోగితప్ప ఈ యింట్లో మరికాపురమున్న దానవునీవేనా? ఇంకా ఎవరైనా వున్నారా?" అని అడిగాడు. అడిగి ఆమె జవాబు చెప్పకుండానే ఆమె జబ్బకునూదిమందు ఎక్కించి, నవుకర్లతో "ఇల్లంతా కడిగి శుభ్రంచేసి మణీరండి, ఇప్పటికే రాత్రిపడైంది. ఇంకా తిండి తినాలినేను" అని ఇన్స్పెక్టరు చక్కాపోయాడు.

నవుకరీ వాళ్లు "అదు నీ మగడే అయివుంటే తక్షణం హాస్పిటలుకు పరుగెత్తుకెళ్ళు. వచ్చీ ప్రాణంపోయినా ప్రాణంగావున్నాడు కోపాని చెప్పే కలగదిలో" అని చెప్పారు. ఆమె "అయ్యో దేవుడా!" అంటూ ఒకటే నడక ఒకటే పరుగు హీనంటి అర్ధరాత్రి.

నవుకరీవాళ్లు ఆ యిల్లు శుభ్రం చేశారో శూన్యం చేశారో మరి 'మాసర్వైజు' చేసినవాళ్లు లేరు.

కాలి యీడుపు హాస్పిటల్కు వెళ్లేసరికి ఆమె భర్త నప్పటికప్పుడే శ్మశానానికి హాస్పిటల్ వాహకులు వాకులోచుట్టబెట్టుకు తీసుకుపోయినారని తెలిసినది. ఆమెతిన్నగా ఆ రుద్రభూమికి తెల్లవాఅ గట్లు చేరుకుంది. ఎవ్వరూ కానరారు, నక్కలూ వాటి అరపులూ తప్పించి. ఉండుండి ఒక పార ఒక పేకును తగిలిన చప్పుడు మాత్రం ఆ అరపుల మధ్య ఆమెకు వినవచ్చింది. "అక్కడే! అక్కడే! అన్నీ కప్పెడుతూన్నట్టున్నారు!" అని ఆ కాలిపడుచు విహ్వలాకారంతో హాహాకారంతో వెళ్లి ఒక మట్టిదిమ్మను తగిలి కూలబడింది. "వీళ్లప్పుడే కప్పెట్టేసి పోయారు. ఇదే ఆచోటు అయియుండేని! అయియుండేని!" అని ఊటలేని ఆరాటంపడ సాగింది. "తెల్లారకపోతుందా?"—అని అనుకుంటూనే ఆ మట్టిదిమ్మను కలగడగాకేసికొని వికళమైపడుకొన్న నిదరలో సాగింది.

నిదరలో కల, కలలో ధ్వని—

"రంగ! శంఖచక్రములుపట్టే దెందుకు?

భక్తజనుల రక్షించేటందుకు" అని. మళ్ళీన్నీ ఆ కలలోనే తాను ఆ రామభక్తుల యుద్ధభూమధ్యనా నిలబడి ఇనపమేకులతో పెమ్మత్యోవర్తి ఎగసందో నూన్న దృశ్యం ఆమెకు సాక్షాత్కరింపసాగింది.

మళ్లీ తెల్లాటే ఎంతమంది కొట్టివేసినా ఆమె లేవలేదు. ఆ నిదరే ఆమెకు పెద్దనిదరై యూరుకొంది.

* * *

పైని చెరిందలబయినా వ్రాసిన యథార్థానికీ పరమార్థానికీమధ్యన ఎక్కువకుఏడిచింది ఆ కార్తికాంగన కుటీరమునకొక్క వీధి సుమార్గనా, పెఅటి సుమార్గనా అనే మీమాంస అలా మిగిలిపోయేయుంది ఇంకాను.

అన్ని పనులూ అందరూ మంచి వుద్దేశ్యంతోనే చేస్తారు. అయితే అన్నీ సఫలీకృతాలుకాజాలవు. అందులోనూ డాక్టర్లుగావించే పరోపకారం మరీ విఫలోన్ముఖం దాలుస్తుంది ఒకానొకప్పుడు. ఎంచేతాఅంటే, ఆకుగడుక్క మృత్యువు పరికట్టుకుంటూపోవాలి ఏలాంటివైద్యమున్న. ఏ మహారాజుకు వైద్యంచేసే నాజాఅయినా "నేను బ్రతికిస్తాను ఇతగాణ్ణి" అని ప్రాచీపనచేరడు.

అటువంటప్పుడు బీదల్ని కనిభచేసి సేవచేసే స్వభావంగలవారిమాట చెప్పక్కర్లేదు. అటువంటి డాక్టరుగారు వివేక విష్ణువర్ధనరావు అనే అతడు. ఇతడు స్వయంస్ఫూర్తి ధారంగా భావించే అతడు, బీదలపట్ల సేవచేయనెంచుంటే. అతడే ఆ వూళ్లో హాస్పిటల్ డాక్టరూను. చాలామంది చొక్కాలు తీస్తే మనుష్యులుకారని, అనేకయిళ్లు పెరటిసుమార్గలంట పోతే యిళ్లేకావని అతగాడినమ్మకం. ఈ నమ్మకంతో అప్పటప్పట అకస్మాత్తుగా పెరటిసుమార్గలంట బీదల యిండ్లల్లోకిపోయి వాటి శుచిశుభ్రతపరీక్షిస్తూ వారికి తగిన వైద్యం చేసేవాడుక అతనిది. ఆ వాడుక ప్రకారం ఈ కథానాయికకొక్క యింటి వెనుకభాగాన్ని వున్న గల్లీగుండా నాడుపోతూ వానకు కొంచెంముందు తలుపుతోసుకు పెరటిసుమార్గం అమ్మట ఆ కార్తిక యువతియిల్లు ప్రవేశించాడు. ప్రవేశించి ప్రవేశించడంలో అతగాడికాయింటిలో మూలుగూ వినిపించింది. అప్పటికప్పుడే కాలిలో మేకు గ్రుచ్చుకున్న ఆ యింటి అతడికి 'టిటానస్' జ్వరం తగిలి లేవలేని దుస్థితిలోనున్నాడు. వానిని వెంటనే డోలీమీద హాస్పిటలుకు వానరాకమునుపే చేర్పించగలిగాడు. కాని హాస్పిటల్లో రోగికి, ఆకారణం అని ఇతరులు అనుకునేలాగు, కలరా తగిలింది. దానితో ఎంతవైద్యం కావించినా వివేక విష్ణువర్ధనరావుకు మాటదక్కలేదు.

కాని యీ కథ నేను పాంతంగా చదివి విని ఫించినప్పుడల్లామాత్రం వివేక విష్ణువర్ధనరావుకూడా కళ్లుమూసికొని అలా రాంభజన పెమ్మత్యవర్తి ఇనప మేకుతో తానుకూడా కార్తికయువతి కెదురుగా నిలబడి ఎగసంద్రోసే అనుభవంగల వాడయ్యేవాడు.

# మన ఆహారసమస్య



శ్రీ పంద్రంగి రాజేశ్వరరావు

జనాభా పెరుగుదలకు ఆహారసమస్యకు ఆదినుండియు అవినాభావ సంబంధము కలదు. ఈజిప్టు, భారత, సంస్కృతులు, నైలు, గంగానదుల పరిసరములందు వర్ధిల్లుట గమనార్హమైనది. రష్యను సంస్కృతి, వాల్గానదిలో యీదులాడిన దనుటలో అతిశయోక్తి లేదు. అటులనే రైనునదితో జర్మనీకి, థేమ్సుతో ఇంగ్లండుకు చరిత్రాత్మకమైన సంబంధము కలదు. నదీ ప్రాంతమందు సులువుగ ఆహార ధాన్యములు పండించవచ్చును కనుక అచటనే జనాభా పెరుగుచుండును. నదులు పారు మార్గము మారినపుడంతవరకు సస్యశ్యామలముగనున్న ప్రాంతములు క్రమేపీ యెడారులగుచుండును. అందుచేత సహజముగ ప్రకృతియందు లభించు ఆహారపదార్థములు జనాభాకు సరిపోనపుడు, వ్యవసాయమునకు అనువగు సదుపాయములు, నిర్మాణములు చేయవలసియుండును. ప్రజల ఆహార విహారములు మార్పు చెందినపుడు కూడ ఆహారసమస్య ఏర్పడును.

౧౯౪౩ వ సంవత్సరమందు అమెరికా సంయుక్త రాష్ట్రములలో హాట్‌స్ప్రింగ్సువద్ద ఐక్యరాజ్యముల ఆహార, వ్యవసాయ సభయందు ఆయా దేశములందలి ప్రజలను సుభిక్షముగను ఆరోగ్యముగను వుంచవలసిన బాధ్యత ఆయా దేశపు ప్రభుత్వములదే యని నిర్ణయింపబడినది. అందుకు తగు చర్యలను ఆయా దేశములు తీసుకొనవలయును. భారతదేశమందలి జనాభా పెరుగుదలను గురించి పొరపాటు అభిప్రాయములు సర్వత్ర వ్యాపించియున్నవి. ఇచట జనాభా పెరుగుదల కృతిమించలేదు. యథార్థమునకు ప్రపంచమందు దామాషాను హెచ్చిన జనాభాకన్న తక్కువ ప్రమాణమైయున్నది. మరిన్ని అమెరికా, యూరపులందలి జనాభా పెరుగుదలకన్న తక్కువ. జననమరణములు తక్కువగా నుండెడు నార్వే, స్వీడను, డెన్మార్కు ఆదిగాగల స్కాండినేవియన్ దేశములందలి జనాభా పెరుగుదల, మన దేశమందలి జనాభా పెరుగుదల సమావస్థాయిలో నున్నవని చెప్పవలెను. ఇటీవల ప్రచురించిన లెక్కల ప్రకారము భారతయూనియన్ జనాభా సుమారు ౩౬ కోట్లు. ఏటా ౫౦ లక్షల చొప్పున పెరుగుచున్నదని అంచనా. ఈ ప్రాప్తికి అమెరికాలోని ప్రిన్సిటన్ విశ్వవిద్యాలయమందలి అధ్యాపకుడగు కింగ్స్లే డేవిస్ చెప్పినట్లు సుమారు ౫౦ సంవత్సరములలో మన జనాభా రెట్టింపగును.

జనాభా పెరుగుచున్నను మనదేశమందు సగటున తలకు వ్యవసాయమగు భూమి ౧౫% వరకు తగ్గినది. మరిన్ని భూసారము క్రమేపీ తగ్గుటయేకాక తదితర దేశములందలి భూములతో పోల్చిన బహు తక్కువగా నున్నది. వ్యవసాయము చేయువారిలో ౭౦% మందికి భూమియందెట్టి హక్కు లేదు. కొన్ని ప్రదేశములందు వ్యవసాయదారునకు భూఖామందునకు నడుమ అరువది మెట్లు గలవని అంచనా వేయబడినది. ఇటీవల అమలులోకి వచ్చిన జమీందారీ రద్దు సంస్కరణలవల్ల కలుగు పరిణామమును పూర్తిగ అవగాహన చేసుకొనుటకు మరికొంతకాలము పట్టును. అనువుగ వ్యవసాయమగుచున్న భూమిని చిన్న చిన్న ముక్కలుగా విభజించుచో ఫలసాయము అడుగంటును. సాధ్యమగునంతవరకు సహకారపద్ధతుల మీద వ్యవసాయమును జరిపించుట శ్రేష్ఠము. భారతదేశమందలి పశుగణము ప్రపంచమందలి పశుగణములో ౧/౩ వంతు, సుమారు ౨౬.౮ కోట్లు వుండును. కాని మన పశువులు బలమైనవికావు. సగటున మరణములు హెచ్చు. వీటికి లభించు మేతకూడ బహు తక్కువ. అందుచేత వాటివల్ల లభించు ఎరువు, పాలు అతి స్వల్పము.

ఆహార శాస్త్రజ్ఞుల అంచనాల ప్రకారము భారతీయుని ఆహారమందు ౨౬౦౦ కేలోరీలు వుండవలెను. సాధారణ పరిస్థితులందు సహితము భారతదేశమునకు వెన్నెముక అయిన రైతు ఆహారమందు ౨౩౦౦ కేలోరీ

లుండును; పిల్లలందు పనిచేయు కార్మికుల ఆహారమందు ౧౯౦౦ కేలోరీలుండును; కుటీరములందుండెడి స్త్రీల ఆహారమందు ౧౨౦౦ కేలోరీలు మాత్రమే యుండును. పరికించిచూడగా భారతదేశమందలి ప్రతివ్యక్తి ఆహారములోను కేలోరీలు, కేల్షియమ్, విటమిన్లు కొరతగా నున్నవని స్పష్టపడును. ఇట్టి పరిస్థితులలో వ్యక్తికిచ్చు రేషను ౭ లేక ౧౦ ఔన్సులకు తగ్గింపబడినపుడు అందు ౭౦౦ లేక ౧౦౦౦ కేలోరీలు మాత్రమే యుండును. యథార్థమున కిది వ్యక్తి జీవించుటకు సహితము సరిపోదు. అందుచేత భారతదేశమందలి ప్రజలు చాలవరకు జీవించియున్నారని చెప్పుటకంటె నిల్చియున్నారని చెప్పుట సమంజసము. ఆహారమిటులు చాలీచాలక యుండుటచేత సహజముగ ఆరోగ్యము నశించినది. పసిబిడ్డలు బాలింత్రాళ్ళు హెచ్చుగ మరణమునకు గురియగుచున్నారు. వ్యాధుల నెదుర్కొను శక్తి వ్యక్తుల యందు చాలవరకు నశించినది. ఇందుకు తోడు నోట్ల ముద్రణమువలన ధరలు విపరీతముగ పెరిగినవి. ఇంగ్లండు, అమెరికాలలోకంటె ఇండియాలో జీవితపు ఖర్చు హెచ్చు పెరిగినది. డాక్టరు వి. కె. ఆర్. వి. రావుగారి లెక్కల ప్రకారము మన దేశమందు నోట్ల ముద్రణమువల్ల సామాన్యప్రజల ఆదాయము రెట్టింపైనను ఖర్చు అయిదురెట్లవరకు పెరిగినది.

ప్రస్తుతమున్న సాగుబడి సౌకర్యములను సంరక్షించియు నూతన సౌకర్యముల నేర్పరుచుటవల్లనే జనాభా ఒత్తిడిగల దేశముయొక్క ఆహారసమస్య పరిష్కారము కాగలదు. మన దేశమందలి సాగుబడి సౌకర్యము లన్నియు నూతనముగ వచ్చినవికావు. పురాతన కట్టడములు పెక్కులు యుండియున్నవి. ఇండియన్ ఇరిగేషను కమిషన్ నివేదిక ప్రకారము రెండవ శతాబ్దాంతమందు కావేరినదిపైన కట్టబడిన గ్రాండు అనకట్టు ఇంజనీరింగు శాస్త్రరీత్యా నిరుపమానమైనదని నిర్ణయించబడినది. దీని పొడవు ౧౦౦౦ అడుగులు, వెడల్పు ౪౦ మొదలు ౬౦ అడుగులు, ఎత్తు ౧౬ మొదలు ౧౯ అడుగులు. ఇది ౧౯౩౦ సంవత్సర ప్రాంతమువరకు సుస్థిరముగా నుండెను. చిరకాలము నుండిగల నూతులు, చెరువులు నేటికికూడ కొన్ని వేల ఎకరములను సాగుచేయుచున్నవి. అనాదినుండి వ్యవసాయము నిమిత్తమై ఏర్పడిన కాల్వలు నేటికిని అచ్చటచ్చట కలవు.

ఈ సందర్భమున బ్రిటిషువారి హయాములో మనదేశమందు కట్టబడిన ఇరిగేషను ప్రాజెక్టులక్రింద వెచ్చింపబడిన మొత్తము ౧౫౬ కోట్ల రూపాయలు మాత్రమే అని జ్ఞాపకముంచుకోవలెను. ఇందులకు గల కారణము ఇండియాఎడ బ్రిటనుకుగల వైఖరియే. బ్రిటను పారిశ్రామికదేశ మగుటచే భారతదేశమునుండి తనకు కావలసిన ముడిసరకులను తీసుకొని వెళ్ళుట యందే ఎక్కువ శ్రద్ధను కనుపరచెను. వ్యవసాయ రీత్యా భారతదేశమునకు ప్రపంచమందు ప్రముఖస్థాన మున్నప్పటికి, మనదేశమందలి నీటిలో ౬% మాత్రమే సాగుబడి కుపయోగపడుచున్నది. ప్రపంచమందలి ౩౬౦౦ కోట్ల ఎకరములలో ౧౧౦౦ కోట్ల ఎకరములు మాత్రమే వ్యవసాయమునకు అనువైనది. దేశవిభజనకు పూర్వము మన ౪౦ కోట్ల జనాభాకు ౪౩ కోట్ల ౨౦ లక్షల ఎకరములు భూమి యుండెను. అందు ౫౩% మాత్రమే సాగుబడిక్రింద నుండెను. ౧౧.౭% బంజరుగా నుంచబడెను. శేషించిన ౩౫.౨% భూమిని వ్యవసాయముచేయుట కెట్టి ప్రయత్నములు జరిగి యుండలేదు. రెండవ ప్రపంచయుద్ధమునకు పూర్వము కూడ మనము ఏటా ౧౫ లేక ౧౬ కోట్ల రూపాయల విలువగల ఆహారధాన్యములను దిగుమతి చేసుకొనెడివారము. ౧౯౪౬ వ సంవత్సరమునకు దిగుమతిఅయిన ఆహారధాన్యముల విలువ ౮౮.౪౩ కోట్ల రూపాయల వరకు పెరిగినది.

దేశవిభజనవల్ల పరిస్థితులు అధ్వాన్నమైనవి. జనాభాలోని ౨౩% ప్రజ పాకిస్తాన్‌లో చేరిరి. వరి పంట పండెడు భూమిలోని ౨౬.౨౮% వంతు, గోధుమ పండెడు ప్రాంతములోని ౨౬.౯౫% వంతు పాకిస్తాన్ పరమైనది. అత్రాపి పాకిస్తానుకు ౩౧.౭౨% వంతు వ్యవసాయ మగుచున్న భూమి సంక్రమించినది. ప్రస్తుతము ఇండియన్ యూనియన్‌లో వ్యవసాయమగుచున్న భూమి పరిమితి నాల్గుకోట్ల తొంబది లక్షల ఎకరములు. అనగా దేశమందలి మొత్తము భూభాగములో, ౧/౫ వంతు మాత్రమే. భారత ప్లానింగు కమీషను అంచనాల ప్రకారము దేశవిభజనకు పూర్వము కాల్వలద్వారా సరఫరా అగు నీటిలోని సగభాగము పాకిస్తానుపా

లదెన్నియని. ప్రభుత్వ కట్టడములవల్ల సాగయ్యెడు ౩.౩ కోట్ల ఎకరములలోని సగభాగము పాకిస్థానుకు దక్కినది. తరుగు ప్రాంతమైన పశ్చిమ బెంగాలునందు కాందిశీకుల రాకపోకలచే వ్యవసాయమున కంత రాయము కల్గినది. గత నాల్గు సంవత్సరములనుండి మద్రాసు రాష్ట్రమందు దక్షిణ జిల్లాలలో వర్షము లేదు. హిరోషిమాపై ఆటంబాంబు వేయుటచే కల్గిన రేడియో చలనమువల్ల ఏర్పడ్డ కెరటములు దక్షిణాదిని ముంచెత్తి వెళ్ళుటచే వర్షములు కురియలేదని కొందరు శాస్త్రజ్ఞు లభిప్రాయపడుచున్నారు. ఇట్లు ఏటా వర్షాభావము పరిపాటగుటచే యింతవరకు సస్యశ్యామలముగనున్న భూములు ఎడారిగ మారు ప్రమాద మేర్పడినది. బొంబాయి, హైద్రాబాదు రాష్ట్రములు రెండు కొరత ప్రాంతములని జ్ఞాపకముంచుకొనవలెను. ఉత్తర హిందూస్థానమందు వరదలవల్ల ఏటేటా పంటలనష్టము సంభవించుచున్నది. ఇంతవరకు స్వయంపోషకముగనున్న అస్సాము రాష్ట్రము వరదలవల్ల తరుగుప్రాంతమైనది. ఇటీవలనే బీహారురాష్ట్రము ప్రమాదస్థితిలోను కరవును గడచి బయటపడ్డది. తూర్పుపంజాబు మధ్యప్రదేశ్, ఒరిస్సా మధ్యభారత్ రాష్ట్రములు మాత్రమే స్వయం పోషకముగ నున్నవి. ఉత్తరప్రదేశ్ రాష్ట్రమొక్కటే మిగులు ప్రాంతము.

౧౯౪౮ వ సంవత్సరము మొదలు భారత యూనియనుకు దాదాపు సాలు ౧ కి ౧౦౦ కోట్ల రూపాయల ఖరీదుగల ఆహారపదార్థములు యితర దేశములనుండి దిగుమతి అగుచున్నవి. ౧౯౪౯ వ ప్రాంతమున ఈ పాలీనా దిగుమతి విలువ ౧౨౯ కోట్ల రూపాయలవరకు పెరిగినది. ౧౯౫౧ లో ౩౮ లక్షల టన్నుల ఆహారపదార్థము దిగుమతి కావలసి యున్నదని అంచనా వేయబడినది. వచ్చే సంవత్సరము భర్తీచేయవలసిన తరుగు ౫౫ లక్షల టన్నులు. కేంద్ర, రాష్ట్రప్రభుత్వములు అధికాహారోత్పత్తి ప్రణాళికలపై పెట్టిన ౪౦ కోట్ల రూపాయల ఖర్చు నిరర్థకమైనది. ప్రస్తుతము ప్రభుత్వము పరిశీలించుచున్న ప్రాజెక్టులకగు ఖర్చు ౨౦౦౦ కోట్ల రూపాయలవరకు వుండును. వీటిలో ౧౩౫ స్కీము లొక దారికి వచ్చినవి. వీటికగు ఖర్చు ౫౯౦ కోట్ల రూపాయలవరకు వుండును. వీటిలో ౧౨ స్కీములు పెద్దవి ౨౪ బహ్వర్థకములు, ౯౯ చిన్నవి. ఈ స్కీములు పూర్తికాగానే ౧ కోటి ౭౯ లక్షల ఎకరములు సాగు అగుటయేకాక ౪౩ లక్షల టన్నుల ఆహార పదార్థము అదనముగా లభించును. వీటికి తోడు ౧౨౨ స్కీములు ఉన్నవి. వీటిక్రింద ౧౩౦౦ కోట్ల రూపాయలు ఖర్చుపెట్టవలెను. అందువల్ల ౪౨ లక్షల టన్నుల ఆహారపదార్థము అదనముగా లభించును. గత అయిదు సంవత్సరములలోను నదీ-లోయ ప్రాజెక్టులక్రింద ఖర్చయిన మొత్తము ౩౮౦ కోట్ల రూపాయలు మాత్రమే. కాని మనము గత అయిదు సంవత్సరములలోను ౫౦౦ కోట్ల రూపాయలు ఖరీదుగల ఆహారధాన్యములను దిగుమతి చేసుకొన్నాము. మన నదీ-లోయ ప్రాజెక్టులక్రింద ౬౦౦ కోట్ల రూపాయలు ఖర్చు చేయవలసియున్నను వీటివల్ల విద్యుచ్ఛక్తి విరివిగా లభించును. వరద, బురద, మురుగు అదుపులోకి వచ్చును. భూసారము కుదుటపడును, నీరు నిల్వవుండి మలేరియా (చలిజ్వరము) కాలవాలము గు ప్రాంతము లన్నియు పంటభూములై, వాస యోగ్యమగును. మత్స్యసంపత్తి పెరుగును. ఈ స్కీము లన్నియు పూర్తి అగుటకు ౧౫ లేక ౨౦ సంవత్సరములు పట్టును. మరో ౫ కోట్ల ఎకరముల భూమి సాగు అగుటయేగాక మొత్తము సాగు భూమి ప్రస్తుతము సాగగుచున్న దానికి రెట్టింపగును. జనాభా పెరుగుచున్నను ఆహారకొరత యుండదు.

ఇట్టి పరిస్థితులలో ఆహార దినుసుల సాగుబడిని హెచ్చించి పరిశ్రమల నభివృద్ధిపరచుట మూలముననే జనాభా పెరుగుదలవల్ల ఏర్పడు క్లిష్టసమస్యలు పరిష్కారమగును. ఈ సందర్భమున పాలస్థానమందు యూదులు స్థాపించిన ఇస్రాయిల్ రాజ్యము సాధించిన ఫలితములు గమనార్హమైనవి. అచటి ఎడారులను సారవంతమగు పంటభూములుగ మార్చివేసినారు. పరిశ్రమలను పోటాపోటిగ స్థాపించి విజయవంతముగ నిర్వహించుచున్నారు. మూలధనము లోపించుటచేతను, మధ్యతరగతివారిలో నిరుద్యోగ సమస్య హెచ్చుపెరుగుటచేతను, పరిశ్రమలను వికేంద్రీకరించుట వాంఛనీయము. కుటీర పరిశ్రమలను సంరక్షించి వృద్ధిచేయవలెను. ఆహార సమస్యా పరిష్కారమున ఉపయోగపడు ఇతరేతర సాధనములు:—

(౧) శాస్త్రపద్ధతుల ననుసరించి ఎరువుల ద్వారా భూసారమును పెంచుట.

(౨) బంజరుగానున్న భాగములను సాగుబడిలోనికి తెచ్చుట.

(౩) భూసారమును సన్నగిలకుండ చూచుట.

(౪) ఆధునిక పద్ధతిని యంత్ర పరికరములతో వ్యవసాయము చేయుట.

(౫) నేటివరకు తినుటకు లాయికీగాని పదార్థములను కృత్రిమపద్ధతిని భోజనార్హ మొనరించుట.

(౬) భోజనపదార్థములను పాడుకాకుండగను, దుర్వినియోగము కాకుండగను చూచుట.

జనాభా పెరుగుదల నరికట్టి, ఆహారసమస్య నెంతవరకు, సంతాన నిరోధమువల్ల పరిష్కరింపగలమో పరిశీలింపవలెను. దరిద్రము, అజ్ఞానము వ్యాపించిన ప్రాంతమందు శాస్త్రబద్ధమగు సంతాన నిరోధ మనుసరించుట సులభసాధ్యము కాదు. ఇందులకగు ఖర్చును జనసామాన్యము భరింపలేరు. మతానురక్తులగు జనసామాన్యము సంతాన నిరోధమును భ్రూణహత్యగా పరిగణించుటలో ఆశ్చర్యములేదు. కనుక ఈ విధానము మధ్యతరగతిని మాత్రమే ఆకర్షించుచున్నది. మన దేశముయొక్క స్వతంత్ర సంపాదనకు కష్టపడి కృషిచేసినది త్యాగముచేసినది మధ్యతరగతివారే. జాతీయ సంస్కృతికి, సంఘసౌష్ఠవమునకు, ఆర్థిక సమన్వయమునకు, రాజకీయస్థాయికి నైతికబలమునకు మధ్యతరగతియే మూలాధారము. అందుచేత మధ్యతరగతి సంతాననిరోధము చేపట్టుచో దేశాభ్యుదయమునకే ముప్పు కల్గును. మధ్యతరగతి ప్రజ శ్రీమంతుల ఒత్తిడివల్ల, పేదల ఉద్రేకమువల్ల నలిగిపోవుచున్నారు. జాతీయ స్వాతంత్ర్యమునకు, వ్యక్తిత్వమునకు, ముప్పు వచ్చునేమో యను భయము కూడ లేకపోలేదు. మధ్యతరగతిని సంరక్షించి పెంపొందింపవలసిన తరుణమందు సంతాన నిరోధము ద్వారా సంకుచితము చేయుట దూరదృష్టిగలపని కాదు.

కనుక సంతాన నిరోధమును గురించి సకల విషయములు ప్రజలకు తెలియవచ్చునుగాని అందువల్ల సత్ఫలితములు వచ్చునని, మన సమస్యలన్నింటికి తారకమంత్రమువంటిదని ప్రచారముచేయుట ప్రమాదకరము. అంతకంటె కేవలము డబ్బుకొరకై పండించు ఇతర పంటలను (*Commercial Crops*) నిషేధించుట ఉచితమైనపని. పొగాకు పంటవల్ల మద్రాసు రాష్ట్రమందు ధాన్యముపంట సన్నగిలినది. అందుచేత అవసరమగు ప్రాజెక్టుల నన్నిటిని నిర్మిస్తూ, తిండిగింజలపంటకే ప్రాధాన్యమిస్తూ, అనువగు పరిశ్రమలను మాత్రమే నడుపుచో, జనాభా పెరుగుదలవల్ల ఏర్పడ్డ ఆహారసమస్య సక్రమముగ పరిష్కారమగును. తియ్యని మాటలతోను తళుకైన అంకెలతోను నిండియున్న పంచవర్ష ప్రణాళికలు, దశవర్ష ప్రణాళికలు, పరిస్థితిని చక్కపరచలేవు. చేసెడు పను లెప్పుడో ఫలోన్ముఖమగునట్లుగాక తక్షణమే కొంతవరకైనను ఫలితముల నిచ్చునవై యుండవలెను. భారతప్రధానియగు శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ చెప్పినట్లు మన ఆహారసమస్యను యుద్ధకాలమందు జరూరైన సమస్యలను పరిష్కరించినట్లు పరిష్కరింపవలెనుగాని నీళ్ళు నములుచూ కాలయాపన చేయరాదు.






# రాజభక్తి

★

శ్రీ ఆదిభట్ల రామమూర్తి

౧

ఎవరా ఘోరవనాంతరాన? నెవరోయీ! వాయువేగమ్మునన్
జవనాశ్వమ్ములఁ బోవుచుండిరి? నరేజాగ్రత్త! పైఁదప్వకో;
మ్మవలోకించితె వారలన్? స్మృతికి నధ్యాహారమే గుర్తు? వా
రెవరో చూచినజ్ఞప్తియున్నదను చుంటే? యంధుఁడా యాంధ్రుఁడా!

ఒకఁడు దోశ్శక్తివాడి కృపాణమేసిన-తాళవృతమ్ము నిర్మూలమయ్యె!
ఒకఁడు సందెడులావునకు మించు శాఖకై-కరవాలమేయఁ బట్టాడిగిపోయె!
ఒకఁడు కుటీనె మధ్యకు హేతినేసిన-బర్ణ భంగము శాకపాయలయ్యె!
ఒకఁడసిచే వృద్ధటోర్ధ్వ తాళఫలమ్ముఁ-గుండపోకుండగా రెండొనర్చె!

భూరి జలపాత బిందువుల్ గారకుండ
కత్తి సామొక్క బిరుదుమగండు చేసె:
ఖడ్గచాలన, చలన చంక్రమణపట్ట
భద్రులఖిలాంవసీ పట్టభద్రులేమొ?

వారా, వీరకిశోరముల్! చిరయశస్స్ఫార ప్రతాపోద్ధుర
ద్ధీరోదారవిహార సుప్రథితదీప్తి ఛాత్రపుల్; తేజితా
హారాతీణ విశాన భాసురసుదర్శ ప్రస్ఫుటుల్; కృష్ణరా
డ్దారుణ్యాధిప, విశ్వనాథసచివోత్తం సాగ్రజుల్; సోదరా!

ఖడ్గయుద్ధరహస్య శిక్షాప్రవీణు
లగుచు, సిద్ధాంతయుత సాధనానుభూతి
కై మహారణ్యమున మృగయావినోద
మరుగుచెంచిరి ప్రభువును, నాప్తహితుఁడు.

పదునారేడులనాఁగు మీసలవిధం బామోములావణ్యమే
కదరా, చెప్పక చెప్పు; భావిసుయశోత్కంఠాలస ద్రాజస
మ్మదిగో, బీజగతమ్ముగా వెడదనే త్రాంతమ్ములందోచు; రా

జదయన్నమిన్మినబంటు; వాడివడ దేర్చఁగ దెన్నఁ గ్రొన్నిగ్గు! మా
యెదకుఁ నచ్చిన తెన్గుఁ జోదు. కనుమోయీ! విశ్వనాథాగ్రణీ!

సాళ్వ నరసింహ దేవర సార్వభౌము
నాప్తభృత్యుండు; నాగమాహ్వయత నూజుఁ;
దక్షుఁడు శ్రీ కాశి విశ్వనాథాంశజన్మ
మయ్యెనందురు: కాకున్ననట్టి విధమె?

పులిమీసల్ బెకలించి, సింహములతోఁ జోరాటముల్ సల్పి, హ
స్తులదంతంబుల నూయెలూగి, మృగసంధుల్ నొంచి, ఖడ్గమ్ములన్
బలుఖడ్గమ్ముల నోటువుచ్చి, మృగయావ్యాపార మగ్నైకని
స్తులఖేలాతి వినోదలీలలను బ్రొద్దుల్ బుత్తు రాయిర్వురన్.

గరిడీసాములు, మల్లయుద్ధము, లనేకంబైన కుస్తీలు, భీ
కరశార్దూల, మదేభసింహములతోఁ గావించు నవ్వారిసుం
దరసంపూర్ణ శరీరసౌష్ఠవము నేత్రానందముల్ గాగఁ జూ
డుర! సిగ్గందుర, నీ యశక్తతను నాలోచించి, యోయాంధ్రుఁడా!

అనుదినమ్ము మహారణ్యమందుఁ గొంత
దనుక ఖడ్గప్రయోగసాధనము నెఱపి,
మఱలుచుందురు సచివుఁడు క్ష్మాధవుండు;
నా, డదే వేళ-ప్రాణభగ్నైకశూల!!!

ఆకనుపించుఁ బెద్దపొదరాకులఁ బొంచెడుఁ గాఱుదున్న పెం
దోకనిగుడ్చుకొంచుఁ గనుదోయిని నిప్పుకణాలు రాలఁ బై
దూకుచుఁ గృష్ణరాయలను ద్రోసె హఠాత్తుగ! లోహశృంగపుఁ
బాకుల జేని వక్షమును, బ్రద్దలు సేయఁగ నెంచు. నయ్యయో!

పట్టుఁ దొలంగె భూపుఁడు; కృపాణము జారెను చేతినుండి; క
న్పట్టడు విశ్వనాథుఁడు; అపాయము నిశ్చయ! మిన్పడెక్కలన్
గట్టిగ నేలమోపి, తమకమ్మున వక్షముఁ జీల్చ గొమ్ములన్
గొట్టు విషాదచిత్రణ మసూహ్యము! గుండెగుభేల్లుభేలనన్!

క్షణముగతించె; గుండెదడ చప్పున నాగె! దురంత ఘోరవీ
క్షణమున రెప్పపాటదిగో ఖడ్గము సూటిగుడిన్ని గుచ్చి, వ్రే

సెను మనవిశ్వనాథుఁ; డదె జిల్లునఁ జిమ్మెను నెత్రుధార! కా
లెనుము గతించెనో, యలమహీశుఁడె ప్రాణముఁ బాసిపోయెనో?

రాయల గండమాగిన! దురమ్మున నాను లులాయ కంఠ ఖం
డాయత హేతిధారలస్ఫుటమ్ముగఁ బోతుశిరమ్ము జారె; జే
దోయిని ఖడ్గముంచినటు దోచను మెల్లన వక్షమందు; నే
గాయముఁ గూడఁ గాయమునఁ గానము; ప్రాణమునిల్చె! విశ్వనా
థా! యనమానవహాఁ గద త్వదద్భుతవిలాసము రాజభక్తియున్!

తత్క్షణమాతురంపడు హృదబ్జము మెల్లనఁ జిక్కబట్టి ర
క్తక్షితి కొక్కటే పరుగకాయికి సచ్చపుస్వామిభక్తుఁ డాం
ధ్రక్షితిపుండు పూర్వపు విధమ్మున లేచెను, తెల్గు లేని సం
రక్షణకంచుఁ బోలు, నిను బ్రహ్మసృజించెను విశ్వనాథుడా!

ఔమ్ము కానినమహిమ శిరమ్ము మాత్ర
మల్లనన్ దెగనేసి, ధరాధిపునకు
గాయమే లేనిరీతి ఖడ్గమ్ము వ్రేయు
చతురిమకు, భక్తికిన్ నమస్కృతిశతమ్ము!

౨

తత్తిగన్ షోడశవత్సరావధి యనంత బ్రహ్మకల్యాన; భూ
వరు పేరోలగ-మచ్యుతుండు సచివాప్తామాత్యభృత్యాళి భా
సురుఁడై తాఁ గొలువుండువేళ; మధురాత్కోణీశుఁడౌ చంద్రశే
ఖరపాండ్యుండదె, విన్నవించుకొను వాక్యాంశమ్ము లాలింపుమీ!

అచ్యుత సార్వభౌముఁడ! జోహారులు; చోళుఁడు వీరశేఖరా
వాచ్యుఁడు ద్రోహి తంజపురిపాలుఁ డలక్ష్యముఁ జేసి మిమ్ము రా
జ్యచ్యుతుఁ జేసె నన్ను, భవదాశ్రితుండను. తత్క్షణమ్ము ధ
ర్మచ్యుతి నుద్ధరింపుచు, నరాజకమాపఁగ నాగమప్రభున్

దేవరపంపినారలు విధేయునిఁ బ్రోవఁగ: నాగముండు సై
న్యావళిఁ గూడి, తంజనగరాధిపుఁ జోళు వధించి, మీదు నా
జ్ఞావిధి భక్తితోడ శిరసావహింయించుచు, నాదు రాజ్యమున్
నావశముం బొనర్చెను; దినంబులు కొన్ని గతించె నీగతిన్;

మొదటఁగలట్టి గౌరవము, మోజు క్రమాన నశించిపోవ, నా
యెదుటనె తూలనాడి, నిరసించుననున్; దరువాత రాజ్యనం
పదతనకైవసం బొనరుపన్ బలవంతముఁ జేయు; నీచదు
ర్మదమున మిమ్ముఁగూడ నవమానపచోద్ధృతిఁ గేలిసేసెదున్;

రాజ్యభారము వహియించుఁ బ్రాణచాల
దన్న నెపమున నన్నుఁ బదచ్యుతునిగఁ
జేసి, సింహాసనమునధిష్ఠించినాఁడు;
పాపి, నాగమనాయఁడేపాటివాఁడొ?

తమయాజ్ఞన్ జవదాటకుండ, మధురాధాత్రిన్ ననున్ నిల్పెదున్
గ్రమబుద్ధిన్ విడి, తానె యక్రమముగా రాజ్యమ్ము సాగించు! నె
ట్టిమహాద్రోహమొ, చూచినారె? తమధాటిన్ ధిక్కృతిం జేయఁగా,
మము బోంట్లా? మదహస్తిబర్వ, మశకమ్మా నిల్చుటల్, దేవరా!

కటుభాషోక్తుల మండలించుఁ దమయాజ్ఞాప్రతిన్ లక్ష్యము
న్నటులే తోచదు, దేవ! తీవ్రకుపితాహంభావగర్వచ్ఛవి
చ్ఛటలన్ మిమ్ముఁ దృణీకరించుఁ; బులిమీసాల్పట్టి యుయ్యాలలా?
చటులాంభోధి పరీత వింధ్యనగవిస్తారాంధ్ర రాజ్యాధిపా!

వీసములక్ష్యములే, కిదె
వ్రాసెను నాగమ్మ: దీనిఁ బఠియింతె? ప్రభూ!
దాసుఁడు నాగమనాయఁడు
చేసి నమస్కృతుల, మనవిఁ జేసెడు వినతుల్;

దురమునందున వీరశేఖరు వధించి,
చోళ పాండ్యుల రాజ్యాల మేళవించి,
మధురయే రాజధానిగాఁ, గుదురుబాటు
నందుఁ దెచ్చితిఁ బూర్వరాజ్యాంగపటిమ;

చంద్రశేఖరపాండ్యుఁడశక్తుఁడగుట,
రాజ్యపరిపాలనాత్రాణ పూజ్యమగుట;
గట్టుదిట్టపుఁ గుదిరిక గాన రాక
తిరుగుబాటమొ విప్లవోద్వృత్తులెల్ల;

చంద్రశేఖరపాండ్యుని జ్ఞాతులమని,
యతని మాతామహునిదాసి యాత్మజులట

పంచపాండవులను పేరఁ బొంద్యులేవు,
రఖిలరాజ్యమ్ములకుఁ జేటునా చరింత్రు;

దేశమంతయునొకని స్వాధీనమందు
లేక, బహునాయకత్వమై తేకువ జెడె;
పూర్వరాజ్యాంగ సౌష్ఠవము నెలకొల్ప
నాకిపుడు తలప్రాణముతోకకుదిగు!

కష్టమునన్ రాజ్యాంగపుఁ
బుష్టికి బాక్కృసమె కాక బోలెడుధనమున్
నష్టపడిపోయితిని; బ్ర
హ్మిష్టోబ్రహ్మాండమయ్యె ధృతి నెలకొలుపన్!

ప్రస్తుతాభ్యర్థి పాండ్యభూపాలునకును
తముఁన వానికి జీవనాంశమునొసంగి,
రాజ్యసంరక్షణార్థము రాజునైతి;
స్వార్థరహిత: ముదారపరార్థమిద్ది!

కానదీని నపార్థముగా గణింప
నగునె? రాజ్యమ్ము వీరభోజ్యమ్ము; మీఁదు
తాతపాదుల నేనేమి నీతిమాలి
జుట్టుకొనలేదు; మద్భుజాస్తోమమిద్ది!॥

3

సభ నిశ్శబ్దము- చక్రవర్తి కుపితస్వాంతోద్గతానేక భా
వభరోద్రేకతఁ గన్నులెఱ్ఱవడెఁ! గంపంబొందె గాఢారుణా
రభటీకోరకితాధరద్వయము! సామ్రాజ్యాంక ఫాలస్ఫుర
చ్ఛుభగమ్మైనవళీత్రయమ్ము భ్రుకుటీక్షోభన్ వెలార్చెన్ గదన్!

గజగజ లాడిపోయిరి మొగమ్ము మొగమ్ములు చూచుకొంచు ది
గ్గజములవంటివీరు; లరికాలునమంట శిరమ్ములెక్కఁ ది
గ్విజయముఁ గాంచు రాజవిజిగీషులకెల్లఁ; దదన్యులెల్లర
క్కజపడిపోయిరుత్తరముఁ గాంచి, తిరస్కృతినెంచి యొంతయున్.

ఆజ్ఞోల్లంఘనఁ జేయుపాటిమగవాడా? నాగమాశుంఠ! లే,
కజ్ఞానంబగుఁ గండకావరము చే నల్పంబు రాజాధిరాట్

ప్రజ్ఞాక్షాత్రవమంచు నెంచెనో? ప్రభుత్వద్రోహమావన్న? లో
కజ్ఞానమ్మది శౌర్యమే? చెడునహంకారమ్మె సంపూజ్యమే
పులిముందా గిరి? యాంజనేయునెదుటంబో కుప్పిగంతుల్? చల
చ్ఛల భార్భాటము వహ్నికడ్డెదురె? పక్షుల్ క్ష్వేళముల్ వైనతే
యులసాన్నిధ్యమునందునా? అణుడుణుల్, యోగంబులా పాణిసీ
యఃలవాగంజలి సమ్ముఖంబుననె? నాగా! స్వామికే పాఠమా?

చెదపురుగునకుఁ రెక్కల
విధమున; జిఱుపాము పడగవిప్పినగతి, నే
రెదురీదుగొంగళీవలె,
మదమణగునుగాక, నాగమద్రోహునకుఁ;

కరుడుగట్టిన రాజభక్త్యాగ్రణుండు
నాగమాత్మజుఁడల విశ్వనాథుఁడదిగొ!
కత్తివాటుయు నెత్తురుగానకుండ
వెల్లనై స్వామిఘాతకుఁ దల్లడిల్లు!

ద్రోహిని, స్వామిఘాతుకుని, తుచ్ఛుని, నాగమనేసి; బాహిమాం
పాహియనంచుఁ బాదములపైఁ బడి వేఁడుచుఁ బ్రాణభీతుఁడుఁ
దేహి 'యనన్నఁ' జూడకవధించి, శిరమ్మును నాకుఁజూపి, దా
సోహముఁజేయు భృత్యుఁడొకఁడైనను నున్నచో లేచినిల్వు; ఁడా
సాహసరాజభక్తున కొసంగెద బంగరు సింహపీఠముఁ॥

అంచుఁ బ్రభుఁడంత లేచి, గర్జించె! గాఢ
కోపఘూర్ణితభావప్రకోపదంత
ఘట్టనాపీడ్యమిశ్రకర్కశరవాన!
వణకినారు సమస్తసభాజనమ్ము!!

నిముసము, రెండుమూడు, పదునేనరగంటయుగంటదాటె; నా
గమువధియింపఁ బూనుకొనుగండడొకండును లేఁడయ్యె; రో
షమునఁ బ్రభుండుచూచెసభ చక్కి నలుంగడ; రాజభక్తివి
క్రముఁడొకఁడైన లేఁడుకదరా! సకలాంధ్రము గొడ్డువోయెనా?

లే; దల విశ్వనాథుఁడదె లేచెను; "తండ్రితోఁగూడియేకమై
పోదువె?" యంచు వానిఁ బ్రభుముఖ్యుఁడు మేలములాడె; నెన్నఁడుఁ
గాదది; రాజభక్తినముఖంబున నిల్చునె? తండ్రిప్రేమః మీ

ఎప్పుడూ ఇంతే...చలాకీ ఉండేనా ?

పొద్దున్నా ఒక మాదిరిగానే చూస్తాడు తన్ను.

రాత్రీ ఒక మాదిరిగానే చూస్తాడు.

అంతే కాదు, మాట్లాడటానికి వచ్చిన పాలేళ్లు, రైతులతో ఎలా మాట్లాడుతాడో, తనతోనూ అంతే. వాళ్లంతో, తనూ అంతే.

పెరడుదారిన చెట్టూ, కొమ్మలన్నీ చిగిర్చి, కోకిలలు కూ, కూ మంటున్న పచ్చని చెట్టూ, అతనికి రెండూ ఒకటే.

ఎవరైనా తను ఇంటికి వచ్చినప్పుడు, హఠాత్తుగా తను అగపడితే, మెఱుపు తగిలినట్టు, నిశ్చేష్టులై తనకేసి చూస్తారు. ఈ మనిషికి మెఱుపూ లేదు. పాడూ లేదు.

అందుకే తానంతటి రసమయమైన విషయం ఎత్తినా, అతనిలో చలనం ఏమీ కన్పించట్లేదు.

అత నడిగాడు.

"మా నేనాడేం చెప్పటం...ఎందుకు వచ్చిందావిడ ?"

"ఎందుకు రావటం ఏమిటి? అప్పుడే మజ్జిగా.. ఇంకోసారి పులుసు కలుపుకోండి" అని పులుసు వడ్డించింది.

ఎందుకు వచ్చిందని అడుగుతాడేం? అసలా మనిషి ఎలా ఉంటుంది? మొగుడు ఎలాంటివాడు? మొగుణ్ణి ఎందుకు విడిచిపెట్టింది? మళ్లీ పెళ్ళిచేసుకుందా? లేక...?

మొదటి ప్రశ్నలన్నీ ఒక ఎత్తు. ఈ చివరి అసమాప్త ప్రశ్న ఒక ఎత్తు. "లేక...?"

ఆహా! ఆ అవ్యక్త ప్రశ్నలో ఎంత మాధుర్యం ఉంది ?

"సరస్వతిని చూసిపోదామని వచ్చిందట. ఏ ముఖంతో ఇలా ఊళ్ళు తిరుగుదామని...పాపం ఆ సరస్వతికి తెలియదట ఈ అమ్మవారు వస్తున్నట్టు... నీతా జాతా...ఇంక దానికి ఓ హద్దేమిటి? ఎన్ని ఊళ్ళయినా తిరుగుతుంది. ఏమై...నా" అని ఆగిపోయింది.

అతను కుతూహలంతో ఆమెకేసి చూశాడు.

"మరి ఆ సరస్వతి మొగుడు ఎలా రానిచ్చాడు" అని అడిగాడు.

ఇప్పటికి భర్త ముఖంలో ఆమెకు కొంచెం జీవం కన్పించింది. కాని ఈ ప్రశ్న ఏమిటి? ఇదుగో ఇదే ఏదో ఒక అవకతవక ప్రశ్న. ఆమె గురించి కాదు. ఆమె నెందుకు రానిచ్చారని గుమ్మంలో కాలు పెట్టేదాకా తెలియకపోతే, ఆ పెద్దమనిషి మటుకు ఏంచేస్తాడు.

"సిగ్గులు లేకుండా ఇంటింటికూ కూడా వస్తోందట. మనింటికి రానీయండి చెప్తా..."

అతను కంగారుగా అడిగాడు.

"ఏం చేస్తావు ?"

"ఏం చేస్తానా ? చేసి చూపిస్తా !...అయ్యో రామా...ఏమిటంత భయపడుతున్నారు...మొహం వాచేట్లు చివాట్లుపెట్టి పంపిస్తా" అన్నది.

అతను కంపితస్వరంతో అన్నాడు. "ప్రతి ఇంటికీ ఆవిడ వస్తుందేమిటి? వచ్చినా నువ్వు మర్యాదగా..."

అని అతను మళ్ళీ పొలం పోవటానికి సన్నాహం చేస్తున్నాడు.

"ఏం దుప్పటి తీస్తున్నారు...ఈ రాత్రికూడా పొలం..." అంది ఆవిడ. భోజనంముందు భర్తమీద ఆరంభమైన అసహ్యం ఇప్పటికి సంపూర్ణమైంది.

చంద్రకిరణాలు గుమ్మంముందు దోబూచు లాడుతున్నయ్. తాను పెట్టిన సంపెంగపూల వాసన ఇల్లంతా కమ్ముతోంది.

చల్లనిగాలి మెల్లగావీచి తన జుట్టును రేపుతోంది.

అతను దుప్పటిని భుజానవేసుకొని, తాచేటి కాయలో నీళ్ళు పొయ్యమన్నాడు.

ఆమె నడుం వంచగానే, తలంటి పోసుకున్న జుట్టుముడి ఊడి, ఆ పొడుగాటి జుట్టు నేలంతా కమ్మింది.

అతను దూలంలోంచి చేతికర్ర తీసుకుంటున్నాడు.

ఆమె నుంచొని, జుట్టు ముడేసుకుంటూ, "ఈ రాత్రికి వెళ్ళకపోతే ఏం లెండి" అంది.

"వెళ్ళే...పాపం సోమన్నను కళ్ళంలో ఉంచి వచ్చా...నే వెళ్లి వాడిని అన్నానికి పంపాలి. పూర్తిగా పాలేళ్ళమీదే వదిలేయకూడదు" అన్నాడు.

అంతే...అంతకన్న [అతనికి ఇం కెక్కువ విమీ తట్టదు తన్ను చూస్తున్నా!

పట్టి అడివిగోడు! ఎక్కడా చదీ చప్పుడు లేంది మనిషిలో...అతను తాబేటికాయ అందు కున్నాడు.

ఎంత త్వరలో అతను ఇక వెళ్ళిపోతే తన కంఠపోయి అనుకుంది ఆమె.

ఇంకా నుంచుంటావేం ?

అబ్బ...ఆ చూపు, ఆ ముఖం చూస్తుంటే ఆపుకోలేని అసహ్యం కలుగుతోంది.

“మరి వెళ్ళండి..ఆలస్యమైతే, దార్లో ఎవ్వరూ తోడు ఉండరు...జాగర్త...పొలాలు... పురుగు... పుట్ర” అని అతని శ్రేయస్సుగురించి, భద్రతగురించి ఎంతో శ్రద్ధచూపిస్తూ అంది.

తన సామర్థ్యానికి తానే ఆశ్చర్యపోతుంది. అంతటి తీవ్ర అసహ్యాన్ని చక్కగా భక్తిశ్రద్ధలతో ఎలా అలంకరించ గలిగానా అని ఆమె ఒక్కొక్కప్పుడు నివ్వెరబోతుంది.

నిజానికి ఆ ప్రజ్ఞ ఉండబట్టే ఈ కాపురాన్ని ఈడుస్తోంది. లేకపోతే...? మనస్సులో ఎక్కడో ఆ సరస్వతి చుట్టం మెదిలింది.

అతను ఆమెకేసి చూసి “జాగ్రత్త...ఇంకా మా అమ్మవాళ్ళింట్లో కబుర్లు చెపుతూనే ఉంది గావును...కేకవెయ్యి ... చిన్నపాలేరు ఇంటిదగ్గరే పడుకుంటాడు” అని చెప్పి సమ్మంవైపు తిరిగాడు.

ఈసారి ఆమెకు అసహ్యం మరింత తీవ్రమైంది. అంత పెద్ద నుదురు, ఆ ఉబికళ్ళు, ఆచూపు... ...అబ్బ...ఎలా ఇచ్చాడంట తనను ఈ శుద్ధమొద్దుకు తన తండ్రి!

అతని చెప్పుల చప్పుడు ఆమెకింకా వినబడు తోంది. సమ్మం ముందుకువచ్చి బైటనుంచొన్న ఆమెపై చంద్రుడు వెన్నెలవర్షం కురిపిస్తున్నాడు. భుజంమీదినుంచి జుట్టును పమిటమీదుగా తీసు కొంది. వక్షస్సంతా జుట్టు కప్పివేసి, మోకాళ్ళ దాకా వేలాడుతోంది. అతనప్పుడే బజారులోకి వెళ్ళిపోయాడు.

ఒక్కసారికూడా, దొడ్లోంచి వీధిలోకి అడుగు పెట్టేదాకా, ఒక్కసారి కూడా వెనక్కు తిరిగి తన కేసి చూడలేదు. తర్వాత తనతో నిమిత్తంలేకుండా శూన్యంలో కలసిపోయాడు.

చంద్రకిరణాలు ఆమె కన్నీళ్ళను తుడిచినయ్.

ఇంత ప్రబ్బుకు తన్ను ముడివేశారేం ?

తన కర్మ!

తనతోటిది సీతకు ఎంతచక్కని సంబంధం కుదిర్చారు. బస్తీలో ఉద్యోగం చేస్తున్నా డతను. చిలకా గోరింకల్లా ఆ దంపతులు ఎంతో ముచ్చటగా ఉన్నారు.

తన ప్రారబ్ధం...ఈ శుద్ధస్తబ్ధు, మొద్దు తనకు దాపరించాడు.

ఎంతసేపూ పొలమూ, గొడ్లు, పాలేళ్ళు, పురుగు...ఈ గోలే...నుడ్డివాడికి దీపం చూపించి నట్టు, అతనికి తన్ను కట్టారు. తను అనే వ్యక్తి యొక్క వ్యక్తిత్వం అతనికి తెలియదు. అతని కనవసరం.

అత్తగారిని మెల్లగా నడిపించుకుంటూ, పొరు గింటి కోమలు వచ్చింది.

“మీ...వారు”

“ఆ! మావారు పొలం వెళ్లారు...మీ..వారు ?

“అమ్మో ఇప్పటిదాకానా ... పొద్దూకక మునుపే వెళ్ళిపోతే” అని పొరుగామె తీరికగా వంటింట్లో పీటవేసుకు కూర్చొని, “చూశావా...ఇదిగో ...అది...ఆ సరస్వతి చుట్టంఉందే...అది ఇంక పెళ్ళిచేసుకోదట, పతిత్తు” అంది.

సుశీల కిప్పుడా సరస్వతి చుట్టం పతిత్తు అవునా కాదా అనే ప్రశ్నగాని, కుతూహలంగాని మన స్సుకు పట్టలేదు. తీవ్రమైన అసంతృప్తి మనస్సును మొద్దుచేసి, పెదవులను మూగపఱచింది.

పొరుగింటి కోమలు మళ్ళీ అందుకుంది.

“ఏమే...మాట్లాడవే మాట్లాడవు ?”

ముసలి నక్కాడు నీళ్ళుకూడా ఈ రాత్రి తాగ లేనని చెప్పి, మెల్లగా వసారాలోకి వెళ్లింది.

పొరుగింటి కోమలికి పెండెం దగ్గఱనుంచి అత్త గారి పిలుపు వినబడింది. అబ్బ...ఒక్క క్షణం కూడా ఎటూ పోనీయదు? భర్త ఇంట్లో లేనప్పుడు

కూడా తను ఒక నిమిషంకూడా ఎక్కడకూ వెళ్ళటానికి వీల్లేదు.

చత్వారం కమ్మినా, ఆ ముసలి అత్తగారి కళ్లు రెండూ తనమీదే ఉంటయ్. ఇంతలోనే తను ఏ పరాయి మగాడితోనైనా...? ఛీ! వీళ్ళ అనుమానాలు వీళ్లూను.

ఈ ముసలి అత్తగారే తన ప్రాణం తీస్తోంది. ఆ భర్తకు అంతకన్న అనుమానం. విధవ అప్పగార్ని ముసలి తల్లిని తనకు కాపలాగా పెట్టాడు. ఎప్పుడైనా బస్తీకి వెళ్లినా, మళ్ళీ చీకటి పడేటప్పటికే ఎంత చీకటైనా సరే, వానావంగడైనా సరే, కాలి నడక అయినాసరే వచ్చేస్తాడు. లేకపోతే అరాత్రే తా నెవరితోనైనా...?

"సుశీలా! అదృష్టం బతికిపోయావు...నీ కీ అత్తగారిపోరు, అనుమానాలు లేవుగదా!" అంటూ పీటమీంచి లేచింది.

"సరే...నా అదృష్టమే చెప్పుకోవాలి...చెప్పకోక...చెప్పుకోక..." అని విస్తరి మడిచింది సుశీల.

"అదేమిటే అప్పుడే లేచావు? ఏం కంట్లో బాగాలేదా?" అంది పొరుగుకోడలు.

"ఆ...ఎప్పుడూ ఉన్న తంతేగా...ఇంతకన్న ఏమున్నా ఉంది కనక నా...ఈపూట తినకపోయినా, రేపు మధ్యాహ్నం ఇంతకిఇంత చెల్లించవచ్చు" అంటూ లేచింది సుశీల.

పొరుగింటి అత్తగారికేక ఈసారి పెంజెం దగ్గఱనుంచి వినబడలేదు. పావుల్లోకే వచ్చింది. అత్త, కోడలూ కలసి వెళ్లిపోయారు.

సుశీల వంటింటిపని అంతా ముగించుకొని, వసారాలోకి వచ్చింది. ముసలి అత్తగారు అప్పుడే గుర్రు కొట్టుతోంది.

పందిరికింద నుంచోంది సుశీల. పిల్లగాలికి సన్నజాజి పిల్లతీగెలు ఆమె కోమల ముఖాన్ని ముద్దాడినయ్. ఆ సువాసనకు ఆమె మేను గగుర్పొడిచింది.

మళ్ళీ మనస్సులో ఆ సరస్వతి చుట్టం మెదిలింది...ఆమె...భర్తను విడిచిపెట్టిన ఆ పాడుకష్టం, పదేపదే కళ్లెదుటకు వస్తోంది.

మొగుడిని ఎందుకు విడిచిపెట్టింది? కురూపిట. మొగుడు...చదువుసంధ్యలు లేని మొద్దుట...తనను ఎవరితోనూ మాట్లాడనీయట్ట...ఏమీ చదవనీయట్ట...తన కిటికీలు మూసి గదిలో పడిఉండాలట...అందుకని ఆ సరస్వతి చుట్టం మొగుడిని వదిలేసిందిట!

ఇదివరకు తను అనుకుంది.

ఇంతకన్న వెర్రితనం ఉందా? ఇంతకన్న హాస్యాస్పదమైన విషయం ఇంకోటి ఉందా? తన భర్తకన్న కురూపి ఇంకెవరైనా ఉంటారా? తన భర్తకన్న చదువుసంధ్యలు లేనివాళ్ళు ఇంకెవరైనా ఉంటారా? ఎవరికైనా చెపితేనయినా తెలుస్తుంది. ఈ మొద్దుకు ఎంతైనా చెప్పు...గుడ్లప్పగించి అలా, ఆ తెలివితక్కువ చూపు చూస్తూ ఉంటాడు.

పొద్దుగూకుతున్నా తను గబగబా పనులన్నీ చేసుకొని, తలంటిపోసుకొని, ముడిలో మల్లెపూలు పెట్టుకొని వస్తుంటే, ఆ పచ్చడి, అన్నం వాటిమీదే ఉంటయ్ ఆయన కళ్ళు! పొద్దున పొలం వెళ్లేటప్పటికి తా నెలా ఉంది, ఇప్పుడు తా నెలా వెలిగించిన దీపంలా ఉందీ, అతనికి ఆ తేడా ఏమీ తెలియదు. తన కళ్ళకేసిగాని, తన జుట్టుకేసిగాని చూడడు...చూడలేం...చూస్తాడు...గుడ్డిచూపు...

ఈ తన భర్తకన్న అసహ్యం కలిగించేమగాడు ఇంకోడు ఉంటాడా? తన కొక్కొక్కప్పుడు ఎంతెంత తీవ్రఅసహ్యం కలుగుతోంది? ఎంతద్వేషం? ఎంత అసంతృప్తి?

ఇలాంటి పున్నమిరేయిలో, ఈ పూలవాసనను, ఈ చల్లనిగాలిని, తనను విడిచివెళ్ళి గడ్డివరకలపై పడుకునేవానికన్న గుడ్డివా డింకెవడైనా ఉన్నాడా?

కళ్ళులేని కబోదులు కొంతమంది. కళ్ళున్న కబోదులు కొంతమంది.

అయినా తను విడిచిపెట్టిందా?

ప్రేమ ఉండబట్టే విడిచిపెట్టలేకపోయిందా?

ఆ భ్రాంతి ఎప్పుడూ లేదు. ఈ అయిదేళ్లలో ప్రేమ అన్నది తన కేమీ తెలియదు. చూస్తేనూ, వింటేనూ, తలచుకుంటేనూ అంత అసహ్యం ఉత్తుంగతరంగాల్లా పొంగివచ్చే మనిషిపై ప్రేమ ఎలా ఉంటుంది? ప్రేమకాదు తను విడిచిపెట్టలేక పోవటానికి కారణం...

మరి...?

బాపుంది...ప్రశ్నలకు అంతులేదేమిటి?

మరి...అంటే?

వలుసరితోపాటు నారాయణ. తనొకత్తే నేమిటి ఈ ప్రశ్నలకు జవాబు చెప్పవలసింది?

మెల్లగా పక్కమీది కొరిగింది.

సంపెంగవాసన, సన్నజాజివాసన కలసి మత్తెక్కిస్తున్నయ్. వళ్ళు పులకరిస్తోంది. కళ్ళలోకి సూటిగా చూస్తున్నాడు చంద్రుడు.

వెన్నెల పమిటనుదాటి వక్షస్సును హత్తుకుంటోంది.

మలయమారుతం వంటిని జోకొట్టుతోంది.

ఆమె విశాల ఆకాశంలోకి చూసింది. నల్దిక్కులా మనోహరంగా ఉంది.

చంద్రుడు తొందర తొందరగా పాకిపోతున్నాడు.

మళ్ళీ ఆ ప్రశ్న హృదయంలో ప్రతిధ్వనించింది.

"తనకీ సంబంధం చేశాడేం తండ్రి!"

వంట్లో అణువు అణువును చీల్చుకుంటూ మారుమోగుతోంది ఆ వ్యర్థప్రశ్న...పదిగ త్తిన ఘాటుగా ఈ ప్రశ్న కళ్ళలో మెదులుతోంది.

తన కర్మ! ఇప్పుడెన్ని అనుకుంటేం, ఎంత విచారిస్తేం...?

అంతే...అంతేనా? లేక...ఒహ్!

తను ఎంత అసహాయురాలు! మెడకురితాడు బిగిసిన ఖైదీమాదిరి తాను...ఈ జన్మకింతే...ఇంతే.

ఏదో వెర్రిఊహ చురుకుగా లీలా వీచి, ఆమె శరీరం కంపించింది. పక్కకుతిరిగి మెల్లగా కళ్ళు మూసింది. ఆ మెరుగు బారిన లే చెక్కిళ్ళపై అశ్రువులు ధారగా ప్రవహించినయ్.






# కలగూరగంప

## తెలుగులిపి

సంస్కృత భాషలో నలభైతొమ్మిది అక్షరాలున్నవి. వైదిక భాషలో హ్రస్వ ఎకార, ఒకారములు కన్పించటంచేత ఇచట యాభైఒక్క అక్షరములున్నవి. ఇవి కాక "ౘ, ౙ, ఱ, ళ" అనేవి అధికంగా తెనుగులో ఉన్నవి. ఈ లెక్కలో అనుస్వారము, విసర్గ గ్రహించ బడుతున్నవి. "క్ష" అనేది సంయుక్తాక్షరం కావటంచేత దీనిని ప్రత్యేక అక్షరంగా లెక్కించ నక్కరలేదు. కాగా తెనుగులో యాభైఐదు అక్షరాలున్నవి. ఇవి గాక గుణింతాలు, ఒత్తులు వేరు వేరుగా ఉన్నవి. వీటి నన్నిటినీ నేర్చుకోవటానికి పిల్లలకు ఎంత కాలము పట్టుతున్నదో మన కందరకు తెలిసిన విషయమే. అచ్చువేసే వారికి కూడా ఇన్ని అక్షరాలుండటం అతి ప్రయాసగానే ఉంటుంది ఇక "టైపు" చేసేవారికి ఎంత ఇబ్బంది కలుగుతుందో చెప్పనక్కర లేదు.

ఇన్ని అక్షరాలున్నా మనకు లౌకిక భాషలో కన్పించే రెండక్షరాలు లేనేలేవు. ఆంగ్లాక్షరాలలో ఆరవదగు 'F' ను తెలుగులో వ్రాయాలంటే 'ఫ'ను వాడుతున్నాము. తద్వారా 'ఫ' కు 'F'కు గల భేదం తగ్గిపోతున్నది. 'చేప' అనే మాటను 'చాప' అని ఉచ్చరించటంలో ఆంగ్లమున కన్పించే 'ఞు' అనే దానిధ్వని వస్తుంది. ఈ ధ్వనిని సూచించటానికి అక్షరం మనకు లేదు. దీనికి సన్నిహితంగా వచ్చే ధ్వని 'యా' అనే అక్షరంలో అప్పుడప్పుడువినిపిస్తుంది.

కాని భాషలభివృద్ధి పొందాలంటే అక్షరాలు ఎక్కువగా ఉండటం ఒక విఘ్నమైన ఆటంకమే. ఆంగ్లములో ఇరవైఆరు, లాటిన్‌లో ఇరవైనాలుగు అక్షరాలున్నవి. కచటతప వర్గలలోని మన ఇరవైయే అక్షరాలకు బదులు అరవంలో పదకొండే కన్పించుచున్నవి. ఇలా అక్షరాలను తగ్గిస్తే ఉచ్చారణకు, వ్రాతకు భేదమేర్పడుతుంది. అందుచేత లిపి సంస్కారము చేయదలచినవారు ఉచ్చారణలో కన్పించే ధ్వనులనన్నిటిని తీసికోక తప్పదు. కాని ఉచ్చారణ సామ్యము కల అక్షరాలను అత్యంత భిన్నములుగా చూపరాదు. 'క ఖ' లకు కొంత సామ్యమున్నది. కాని రెండు అక్షరాలు. వీటిని వ్రాసిచూస్తే వీటిలో ఏ మాత్రము పోలిక కన్పించదు. కాని 'చఛ' లు, 'డఢ' లు, 'దధ' లు చూడండి. క్రింద ఒక గీతగీస్తే ఒత్తక్షరం వచ్చేస్తున్నది. ఇలాంటి మార్పులను 'చటతప' వర్గలలో మనం చేయటానికి వీలున్నది. కాగా మనకు లభించే అక్షరాలివి—

"చ ౘ ఛ జ ౙ ఝ
ట ఠ డ ఢ
త థ ద ధ
ప ఫ బ భ"

ఇచట 'చ ౘ ఛ' లు ఒకే ఒక అక్షరము యొక్క రూపాంతరాలు కావటంచేత 'చ' వ్రాయటంవస్తే మూడక్షరాలు వెంటనే రాగలవు. 'ఠ' కు బదులు 'ట', 'థ' కు బదులు 'త' వ్రాస్తే సరిపోతుంది. కాగా పది అక్షరాలను తగ్గించి, మిగిలిన ఎనిమిదింటిని నిలపవచ్చు. 'చ, ట, డ, త, ద, ప, బ' అను ఎనిమిదింటిని నేర్చుకొంటే మిగిలిన పది వచ్చినట్లే ఔతుంది.

అనునాసి కాక్షరాలలో 'ఙ, ఞ, ణ' లు, అనుస్వారము తప్ప మిగిలిన రెండు మన కవసరము లేదు. ఇక కవర్గలో 'క ఖ' లను 'ఖ ఖ' లుగా వ్రాసి, 'గ ఘ' లను మార్చకుండా ఉంటే ఈ వర్గ అంతా మూడక్షరాలమీద నడుస్తుంది. కాగా 'క' నుంచి 'మ' దాకా మనము పద్నాలుగు అక్షరాలను నేర్చుకొంటే ఈ ఐదు వర్గలను తేలికగా వ్రాయగలము, నేర్చుకోగలము కూడా.

'య, ర, ల, వ, శ, ష, స, హ' అను ఎనిమిది అక్షరా లున్నవి. ఇవి గాక 'ఱ, ళ' అని రెండు వ్రాస్తున్నాము. వీటిని వదలివేస్తే లౌకిక వ్యవహారానికి ఏవిధా ఇబ్బంది రాదు.

ఇక మిగిలినవి అచ్చులు. విసర్గను, అనుస్వారమును వదలితే పదహారున్నవి. ఇవి గాక గుణింతాలున్నవి. హల్లులకు అచ్చులను జేరిస్తే వచ్చేవి గుణింతాలు. ఉచ్చారణలో ఈ సామ్యము మనకు కన్పిస్తున్నది. కాని వ్రాతలో అచ్చులకు, గుణింతాలలో కన్పించే అచ్చులకు ఏమాత్రము పోలికా కన్పించటం లేదు. దీనితో కలిగే ప్రయాస వర్ణనాతీతము. గుణింతాలలో ఉన్న అచ్చులకు విడివిడిగా ప్రయోగము కన్పించటంచేత అచ్చుల నన్నిటిని ఒకే ఒక అక్షరము యొక్క రూపాంతరములనుగా దిద్దటానికి వీలున్నది. ఇందు కుపయోగించే ప్రధానమైన అక్షరము అకారము. ఈ అక్షరముతో అచ్చుల నన్నింటినీ 'అ' అక్షరమునకే గుణింతపుసంజ్ఞలను కలుపుకొనుచు వ్రాసికొనిపోవచ్చును.

ఇలా వ్రాస్తే పదహారక్షరాలను ఒక అక్షరము ద్వారా వ్రాయవచ్చును. తద్వారా వేరే గుణింతమును నేర్చుకోవలసిన అవసరం పోతుంది.

ఈ లిపి సంస్కారము నంగీకరించితే "అ, బ, గ, ఘ, చ, జ, ట, డ, ణ, త, ద, న, ప, బ, మ, య, ర, ల, వ, శ, ష, స, హ" అనే ఇరవైమూడు ప్రధానాక్షరాలు రాగలవు. 'ఱ' ను 'ర' గాను, 'ళ' ను 'ల' గాను వ్రాయవచ్చును. విసర్గానుస్వారాలను చేరిస్తే మొత్తము ఇరవైఐదు అక్షరాలు వస్తున్నవి. ఇట్లులిపిని సంస్కరిస్తే వ్రాయుట, నేర్చుకొనుట, టైపు చేయుట, అచ్చు వేయుట అనేవి అన్నీ అతితేలిక కాగలవు. కనుక ఈ రీతిగా సంస్కరింపబడిన లిపిని గ్రహించవలసి యున్నది.

లిపిని సంస్కరిస్తే వచ్చే ప్రమాదమేమీ లేదు. మనదేశంలో అనేక లిపులు ఇదివరకు వచ్చినై. వాటిని అనేకమంది సంస్కరించారు. కొన్ని మన కిప్పుడు అయోమయంగాకూడా ఉంటవి. పదకొండవ శతాబ్దంలో నన్నయ నారాయణులు తెలుగు లిపిని సంస్కరించినారు. తర్వాత తొమ్మిది శతాబ్దాలదాకా ఈలిపిని ధరించి ఉన్నాము. ఇప్పుడైనా దీనిని సరి చేయకపోతే మన భాష మనకే కష్టమౌతుంది.

(కాపీరైట్ రిజర్వ్డ్)

**పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి.**

---

# 'నారాయణభట్టు'

వేణీసంహార కర్తృత్వమును గురించి "ఏప్రిల్" నెల భారతిలో నొక వ్యాసము వ్రాసియున్నారు—సెప్టెంబరు నెల భారతిలో శ్రీ బులుసు వారి వ్యాసమును శ్రీ కిడాంబి రాఘవాచార్యుల వారు విమర్శించి యున్నారు. మరల వద్దానికి సమాధానముగ గ్రిందటి నెల (అక్టోబరు) భారతిలో నొక వ్యాసము వ్రాసియున్నారు. శ్రీ బులుసువారి వ్యాసములలో మాకు శంకలున్నవి. అయ్యవి యిట ప్రతిపాదింతుము.

మొట్టమొదటి వ్యాసములో శ్రీ వేంకటేశ్వర్లు గారు "భారత రచనలో నన్నయ కుంతోడ్పడిన" నారాయణభట్టే "భట్ట నారాయణుననువు" సుక్తిమును బాహుల్యరచిరి. తిరిగి మొన్న వ్యాసములో "వేణీసంహార కృతికర్త" భారత రచన కుంతోడ్పడిన నారాయణభట్టు తానైన "నారాయణభట్టై" యుండునని వల్లడించిరి.

"హారీతగోత్రే హరిమూర్తి
రాపస్తంబద్విజశ్రేష్ఠ విభుర్వినీతః
సదాపురోడాశ పవిత్రవక్త్రో
విద్యావధూత్కంఠిత సోమయాజీ
తస్య శ్రీమాన్ హిమకరకర
ప్రస్ఫుర త్కీర్తిరాశే
దాసీత్సూనుః సకలవిదుషా
మంచితః కంచనార్యః
యం మన్యం తే యమమరిగణాః
కామధేనుం కవీంద్రాః
క్రీడారామం పరమసుహృదో
జీవితం బంధువర్గాః ॥
తస్మాత్మజో మహాత్మ
సమజని కౌచాంబ నేయ ఇతివిదితః
ప్రజ్ఞాజిత వాచస్పతి
రకలంకో శంకనామాఖ్యః ॥
తస్య చ సుధర్మ పత్న్యాగుణ
శాలిన్యాశ్చ నామె కాంచాయాః
అభవదను క్షితిజగ
దుపకరణో నారాయణ స్తనయః" ॥

అను నందంపూడి శాసన భాగమువలన "భారత భారతీశ మద్రము దరియంగ నన్నయభట్టున కుంతో

దృఢీన నారాయణభట్టు వంశము గురించి యిట్లు తెలియుచున్నది. తల్లి, "సామెకాంబ"—తండ్రి కౌచాంబ నేయుండెను నామాంతరము గల "శంకనామాత్యుడు" —పితామహుడు. "కంచెనార్యుడు" —ప్రపితామహుడు. కంచెన సోమయాజి" —కంచెనయు గంచెన సోమయాజియు గొప్ప పండితు లైనట్లు శాసనములవలన స్పష్టము—నారాయణభట్టు యొక్క తాత "నారాయణభట్టు" అనుట కిసుమంతేనియు సందు కొనరాదు—నందంపూడి శాసనమువలన "నారాయణభట్టు పితామహుడు "కంచెనార్యుండు" ని ప్రత్యక్షమగుచుండ నాతని నామము "నారాయణభట్ట" నుట యసంగతము—అట్లుగాక "నారాయణభట్టు" మాతామహుండైన "నారాయణభట్టై" వరైన నున్నారేమో చూతమన్న నది యిసుమంతయుం దెలియదు. "సామెకాంబ" యొక్క తండ్రి వంశమును గూర్చి నందంపూడి శాసనమువలన నిసుమంతేనియుం దెలియరాదు. అట్టిచో "నారాయణభట్టు" మాతామహుండు "పండితుండో యపండితుండో" చెప్పజాలము సరికదా యాతని పేరు "నారాయణభట్ట" నుట మరింత యసంగతముగాక మానదు. కాగా "నారాయణభట్టు తాత నారాయణభట్టనియు నాతని పేరే మనుమనికి వచ్చినదనియు జెప్పిన దోషము లేదు. నందంపూడి శాసనమునుబట్టి నారాయణభట్టు తాతకూడ మహా విద్వాంసుడని మనకు దెలియును—కావున నారాయణభట్టే వేణీసంహార నాటక కృతికర్త యనుట సత్యము" అని వ్రాసిన శ్రీ బులుసువారి వాక్యములు సత్యదూరము లని స్పష్టము—నారాయణభట్టు పితామహుడు "కంచెనార్యుండని"యు నాతండు మహా విద్వాంసుడనియుం దెలియుచున్నది. ఇంక నారాయణభట్టు మాతామహుడు నారాయణభట్టని తెలియుట సరిగదా చివరికి "మహా విద్వాంసుడో, విద్వాంసుడో, అవిద్వాంసుడో" యేమాత్రమును దెలియదు—

"పాయకపాక శాసనికి
భారతఘోర రణంబునందునా
రాయణునట్లు దానసుశ
రామరవంశ విభూషణుండునా
రాయణభట్టు"—

ఇందున్న "తానను" మారుగా "వాసవ" అని యొక ప్రతిలో గన్పట్టుచున్న దనియు నయ్యది "వాసవ" అని యైయుండు ననియు శ్రీ చాగంటి శేషయ్యగారు వ్రాసినారు. కాని ౧౯౫౦ జూలై నెల "భారతి" లోని "అప్పకవీయము, క్రొత్తతాళప్రతి" అను వ్యాసమువలన "వాసవ" అని స్పష్టముగ నున్నట్లు తెలియవచ్చినది. కాని శ్రీ బులుసువారు "తానిశ" "తానిసి" అను పాఠము లాధారముగా నారాయణభట్టు గృహనామము "వీకట్ల" వారనియు నూహించిరి. నిసి నిశకి దద్భవమనిరి. తెలుగువారి యింటి పేరులను సంస్కృతీకరించుట సమంజసము. సంస్కృతీకరింపంబడి కన్పట్టుచున్నవి. కాని సంస్కృతీకరింపంబడిన పదమునకుం దద్భవమున్న నర్థాని నుపయోగించుట సమంజసముగాదు. అయ్యది యప్రసిద్ధము. ఉన్న దున్నట్లు తెలుగు పదము వాడవలె. లేదా అర్థానిని సంస్కృతీకరించవలె—అంతియ కాని సంస్కృతీకరించి యర్థానికి దద్భవరూపంబు నెంచి ప్రయోగించుట యంతగా సమంజసమని తోచుటలేదు. "వాసవ" కు "తానిశ" "తానిసి" యనువానికి మిక్కిలి భేదముగలదు. "తానును" అనునది "తానిశ" గామారుటలో నక్షర విన్యాస వ్యత్యాసము లోపమై యుండవచ్చు. ఎట్లైనను "దానిశ ధరామర వంశవిభూషణుం" డనుటకన్న "వాసవ ధరామరవంశ విభూషణుండ" నుటలోనే స్వారస్యమున్నదేమో!

నిష్కృష్టార్థ మియ్యది. వేణీసంహార నాటక కర్త భట్టనారాయణుడు—వామనుని కావ్యాలంకార సూత్రవృత్తియందు వేణీసంహారమందలి "అస్తంభావ్య" నిత్యాది శ్లోకపాద ముదాహరింప బడుటను నాతడు (వామనుడు) ౮౦౦ (క్రీ. శ) ప్రాంతమున నున్నవాడని స్పష్టపడుట చేతను భట్ట నారాయణుం డంతకు బూర్వుండగును. నన్నయ భారతమునకు సహాయపడిన "నారాయణభట్టు" తాత (మాతామహుడు గాని పితామహుడుగాని) "నారాయణభట్టు" అనుట కెందును నాధార మిసుమంతయుం గానరామిని "భట్ట నారాయణుడును" "నారాయణ భట్టును" భిన్నవ్యక్తులే గాని అన్యముగాదు. ఇంక నింత దనుక చరిత్ర కందకయుండిన కవి యెవ్వండైన గావచ్చును (భారత రచన కుండోడ్పడిన నారాయణ భట్టునకు సంబంధము లేనివాడు.) గాని యదియు నిరాధారమై యూహాలోకమున విహరింపం దగిన విషయ మగుటను దుష్టమే యగు—భట్ట నారాయణుడను వాడు నారాయణభట్టై యుండవచ్చు (ఇదియు నాధారములేనిదే) గాని యాతడు తెలుగువాడనుటకును, నన్నయకు సహాయపడిన నారాయణభట్టు సంబంధీకు డనుటకును నిసుమంతయు సావకాశము కావరాదు—

"కళాకృష్ణులు."

# గ్రంథవిమర్శనము

## కన్నవీ - విన్నవీ

౧. మొదటి భాగం. వెల ౧-౮-౦, ౨. రెండో భాగం వెల ౧-౮-౦, ౩. మొక్కుబడి [నాటికలు] ౨-౦-౦.

రచయిత : మొక్కపాటి నరసింహశాస్త్రి.

చిరునామా : మొక్కపాటివారు, అక్మీరాలిటీ హవుస్. మైలాపూరు. మద్రాసు ౪.

కథాసంపుటాలు రెండిటిలోను మొదటిది హాస్యదృక్పథంతో వ్రాసిన రచనల సంపుటి. ఈ సంపుటిలో 'గాజుపాలెం గాంధీ' వేషభాషల్లో మాత్రమే గాంధీని అనుసరించే ఒక ఉత్సాహవంతుని చిత్రణం. ఈ చిత్రణం ఈ రచన అన్నిటిలోను ఉత్తమమైనది. ఆ తరవాత ఎన్నదగినవి 'మా బావమరిది పెళ్లి' ఈ రచనలో సామాన్యంగా పెళ్లిళ్లలో జరిగే హాస్య సన్నివేశాలన్నీ శ్రీ శాస్త్రిగారు సున్నితమైన హాస్యంతో చిత్రించారు. దీని తరవాత ఈ సంపుటిలోని 'రంగగ్రామ సింహరత్తయ్య,' 'అదే మొదటిసారి,' 'అనుకోని అవాంతరం' అనే మూడు రచనలు ప్రత్యేకంగా ఎన్నదగినవిగా ఉన్నాయి.

నాటకాల్లో వేషాలు వేస్తూ నిత్యజీవితంలో కూడా నాటకాల్లో వేషాలు వేసినట్లు నటిస్తూ అపహాస్య పాత్రుడయిన ఒక వ్యక్తి చిత్రణమే 'రంగగ్రామ సింహరత్తయ్య,' ఈ వర్గంలో మిగిలినవి రెండు సినీమా పరిస్థితులను గురించి రచించిన హాస్యచిత్రణాలు.

ఇక మిగిలిన వాటిలో 'బండిసుబ్బడు'లో హాస్యం చాలా అతిశయోక్తి పూరితంగా ఉన్నది. లాభసాటి బేరాల హాస్యంలో మార్దవము, స్వాభావికత తక్కువ. రచనకు అక్కడక్కడ పొటుదనం కూడా వచ్చింది.

ఈరచనలన్నీ చిత్రణాలే. వీటిలో కథాశిల్పం చాలాతక్కువ.

మొత్తంమీద ఈసంపుటిలో అంతటా అంతే గర్భితమైన శాస్త్రిగారి హాస్యంవల్లనే పుస్తకం అంతా ఏకధాటీలో నడిచిపోతుంది. ప్రసిద్ధులయిన నేటి హాస్యరచయితలలో మొక్కపాటివారు ముఖ్యంగా పేర్కొనదగినవారు. ఈసంపుటివల్ల వీరి హాస్యదృక్పథం అవగాహన చేసుకోవచ్చును.

### రెండో భాగం

ఈకథా సంపుటాల్లో మొదటి దానికీ రెండవ దానికీ ఒక ముఖ్యమైన భేదం ఉంది. మొదటి సంపుటిలో కనిపించిన హాస్యదృక్పథం ఈ సంపుటిరచనల్లో ఎక్కడా కనబడదు. రచయిత ఈరచనలన్నీ ఒక తీవ్రమైన అభినివేశంతోను, సాంఘిక దృక్పథంతోను రచించారు. ఈకథలలోని కొన్ని కొన్ని శీర్షికలనుబట్టిఆయాకథావిషయాలు గ్రహించవచ్చును.

'పద్మ' అనే కథలో అన్ని విధాలా సౌశీల్యవతులయిన కన్యకకు అనురూపుడయిన వరుడు లభించకపోవడంవల్ల విషాదాంతమయిన జీవితగాథ వర్ణించబడ్డది. 'న్యాయం'లో అన్యాయంగా శిక్షించబడిన ఒక రిక్షావాలా జీవిత గాథ వస్తుంది. 'అగ్నిపరీక్ష' లో హిందూ మహమ్మదీయ మతకలహాల్లోని ఘోరాలు కనిపిస్తాయి.

ఈభాగం రచన లన్నింటిలోను కథా శిల్పం అంతగా కనబడకపోవచ్చును. కాని వీటిలో ఉండే నిశితమయిన నిజాయితీవల్లనే ఇవి పాఠకుల హృదయాలను ఉద్వేగపరుస్తాయి. ఈ విధమయిన ఈ సంపుటి రచనలలో 'ఆఖరుమాట' 'న్యాయం' 'అగ్నిపరీక్ష' ప్రశస్తంగా ఉన్నాయి.

మొత్తంమీద ఈలాంటి రచనలు కథలనడం కంటె చిత్రణా లనడమే సముచితంగా ఉంటుంది.

### మొక్కుబడి

ఇది నాటికల సంపుటి. దీనిలోని ౧ మొక్కుబడి, ౨ అభ్యుదయం, ౩ పెద్దమామయ్య ౪ అసాధారణ సమావేశం ౫ వారసత్వం అనే అయిదు చిన్న రూపకాలలోను, వారసత్వం, అసాధారణ సమావేశము, ఉత్తమనాటికలు. మొక్కుబడిలో రచయిత విశ్వాసులు, అవిశ్వాసులు అయిన రెండు తరహాల

వ్యక్తులభావ సంఘర్షణ సహజంగా చిత్రించారు. దీనిలో దైవవిశ్వాసం కల వెంకటేశ్వర్లు చేసిన వెంకటేశ్వర స్తుతితో నాటికముగించనందువల్ల నాటిక కేవలంగా ముగిసిపోతుంది. అంతకంటె చివరవరకు సంఘర్షణే వ్యంగ్యంగా సూచించి ఉన్నట్లయితే ఇది ఇంకా ఉన్నతస్థాయికి వెళ్లి ఉండేది.

'పెద్దమామయ్య' కేవలం స్వభావచిత్రణాత్మకమైన రూపకం. దీనిలో పెద్దమామయ్య స్వభావం సున్నితంగా వకిచిపోతుంది.

'అభ్యుదయం' ఈ రోజుల్లో శాంతికాముకులందరు తప్పక పఠించవలసిన నాటిక. దీనిలో ఒక విజ్ఞానవేత్త మారణాయుధాలకోసం తీవ్రంగా పరిశోధన చేస్తూంటే అతని సోదరి అనేకవిధాలుగా అతనిని ఆ పని చెయ్యవద్దని హెచ్చరించి ఎంతకీ వినకపోతే చివరి కాతన్ని తుపాకీతో కాల్చి చంపి వేస్తుంది. ఇక 'వారసత్వం'లో బద్ధకంగా ఇంట్లో కూర్చుని అస్తమానమూ ఏదుపు కవిత్వం నెమరువేసుకుంటూ కాలక్షేపంచేసే 'భావకవి'ని శాస్త్రిగారు చాలా సహజంగా చిత్రించి సున్నితమైన హాస్యధోరణిలో అవహేళన చేశారు. ఇంతేకాక శాస్త్రిగారు పీఠికలో సూచించినట్లు ఈ వ్యక్తి చిత్రణం కేవలం పోమరిపోతులై అంతా అనాయాసంగా, అయాచితంగా తమ ఒళ్ళో ఒదగాలని పగటికలలు కనే వ్యక్తుల స్వభావానికి కూడా ఒక చక్కని ఉదాహరణమే.

'అసాధారణ సమావేశం' కేవలం ఉత్సాహవంతులై క్రియాశూన్యులైన 'ఆంధ్ర వీరకుమారుల'ను అవహేళనచేసే రూపకం.

ఈ రూపకాలలో 'అసాధారణ సమావేశం' వారసత్వం, అభ్యుదయం ప్రదర్శనానికి కూడా ఉపయోగిస్తాయి.

---

## తైత్తిరీయ వార్తికమ్

ఉపనిషత్ భాష్య వ్యాఖ్యాన సహితము. వ్యాఖ్యాత: రాయప్రోలు లింగన సోమయాజి బి. యే. బి యల్. చిరునామా—రాయప్రోలు లింగ సోమయాజి. లలితాపురం. గుంటూరు. వెల: ౫ రూపాయలు.

ఇది, సురేశ్వరాచార్యులు తైత్తిరీయ శాంకర భాష్యానికి వ్యాఖ్యానరూపంగా రచించిన తైత్తిరీయ వార్తికానికి శ్రీ రాయప్రోలు లింగన సోమయాజిగారు సంస్కృతభాషలో రచించిన సరళ వ్యాఖ్య. అయితే రచయిత ఈ వ్యాఖ్యతోబాటు, తైత్తిరీయోపనిషత్తు, శంకరభాష్యము, సురేశ్వర వార్తికము కూడా కలిపి నాగరిలిపిలో ముద్రించారు.

ప్రాచీన కాలంలో వ్యాఖ్యాతలు మూలార్థ వివరణకేగాక, స్వమతస్థాపనానికి కూడా భాష్యాలు వ్రాయడం ఒక పరిపాటి. అయితే ఈ భాష్యాలు కూడా దురవగాహము లైనప్పుడు మళ్ళీ వ్యాఖ్యానాలు వ్రాయడం కూడా ఆ కాలంలో ఆచారంగా ఉండేది. సురేశ్వరాచార్యులు తైత్తిరీయ శంకరభాష్యానికి వ్రాసిన తైత్తిరీయ వార్తికం శ్లోకరూపంలో ఉన్న ఇలాంటి వ్యాఖ్యానమే.

అయితే శ్రీ లింగన సోమయాజిగారు వ్రాసిన వ్యాఖ్యానం ఈ తరగతికి చెందినదిగాదు. ఇది సంస్కృతభాషలో స్వల్పపరిచయం కలవారికి కూడా సులభంగా వార్తికార్థం వివరించే వ్యాఖ్యానం.

గ్రంథకర్త తమ 'నాఖ్యముఖం'లో సూచించినట్లిది సాంప్రదాయికమైన వేదాంతశాస్త్ర విజ్ఞానం లుప్తప్రాయమైపోతున్న ఈ రోజుల్లో వేదాంత జిజ్ఞాసులకు సహాయకారియైన గ్రంథము. పుస్తక ముద్రణాదికాలు ప్రశస్తంగా ఉన్నాయి.

---

## అమరసింహ చరిత్ర

శ్రీ దుర్భాక రాజశేఖర శతావధాని. చిరునామా. దుర్భాక రాజశేఖర శతావధాని. ప్రొద్దుటూరు. వెల: మూడురూపాయలు.

ఇది ప్రతాపసింహుని కుమారుడైన అమరసింహుని జీవితగాథ ఆమూలాంతంగా వర్ణించే చారిత్రిక కావ్యము.

శ్రీ దుర్భాకరాజశేఖర శతావధాని గారింతకు పూర్వము రాణా ప్రతాపసింహచరిత్ర, పుష్పావతి మొదలైన పద్యకావ్యములు రచించి చారిత్రిక కావ్యరచనంలో ఆరి తేరిన సుప్రసిద్ధులైనారు.

ఇది వీరు రచించిన కావ్యాలలో చాలా ఇటీవల రచించినది. అమరసింహుని పరిపాలనతో ప్రారంభించిన ఈ కావ్యము అతని కుమారుడు కర్ణుని పట్టాభిషేకం వరకు దరిదాపు రెండువేల పద్యాలలో నడిచిపోతుంది.

రాజస్థాన చరిత్రనిబట్టి చూస్తే అమరసింహుని చరిత్ర ప్రతాపసింహునిచరిత్ర అంతటి ఉజ్జ్వల చరిత్రకాదు.

రాజ్యాధికారం చేపట్టగానే ఇతడు భోగపరాయణుడై సదా అంతఃపురంలోనే నివసిస్తూంటే సలుంబ్రా కృష్ణసింహుడు ఇతని శయనాగారం ప్రవేశించి బలవంతంగా ఇతన్ని రాజ

కథకు ఈదృక్కు రావలసిన గతి పట్టింది. చారిత్రకంగా చూస్తే చివరకు ఇతడు ఢిల్లీ చక్రవర్తికి లోబడ్డాడనే చెప్పాలి. అసలీతనితోనే మేవాడరాజ్యపతనం ప్రారంభించినదని అనవచ్చును. అది భ్రాంతిగా ఇతని కుమారుడు కర్ణునితో సమాప్తమవుతుంది.

యుద్ధంలో చిరకాలం పోరాడినా అమరసింహుడు చివరికి సంధి కంగీకరించి ఆ విన్నమైన అపజయంతోనే కుమారునికి రాజ్యం అప్పగించి వేస్తాడు.

అందుచేత దీన్ని వీరపురుషచరిత్రకావ్యంగా కాక కేవలచరిత్రకావ్యంగానే తీసుకోవలసి ఉంటుంది. అయితే—తన పక్షం బలహీనమైనా బలవద్విరోధి అయిన ఢిల్లీ చక్రవర్తితో చిరకాలం ఆత్మగౌరవంకోసం పోరాడిన ఇతని అభినివేశం హర్షింపదగినదే. సలుంబ్రాకృష్ణుని ప్రోత్సాహంవల్ల ఉత్తేజితమై నివురు గప్పిన నిప్పులా ఉండిపోయిన ఇతని శౌర్యాగ్ని ఒక్కసారిగా ప్రజ్వరిల్లినది. కాని దైవగతివల్లనైతే నేమి, బలాధిక్యంవల్ల నైతే నేమి చివరికి ఢిల్లీ చక్రవర్తికే జయం దక్కింది.

అదనుచూచి ఢిల్లీచక్రవర్తి జహంగీరు, సంధిద్వారా చల్లగా మేవాడరాజ్యం తన సామంతరాజ్యంగా చేసుకోగలిగాడు.

ఈవిధంగా చారిత్రికంగా విషాదాంతమైన ఈ చరిత్ర హైందవ ప్రాభవదృక్పథంతో గాక విషాదాంత దృక్పథంతో రచించి ఉంటే—హైందవ ప్రాభవం ఇంతకంటె ఎక్కువ వ్యంగ్యంగా సహృదయాలకు స్ఫురించి ఉండేది.

పీఠికాకర్తలు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు సూచించినట్లీ కావ్యం మొదటినుంచి చివరిదాకా ఒకేవిధమయిన ఉదాత్త రచనా నైపుణితో సాగిపోతుంది. కథా కథనంలో ఈ రచయిత శక్తి ప్రత్యేక ప్రశంసార్హము.

ఈ కావ్యంలో మహమ్మదీయులు చాలాచోట్ల సంభాషించినప్పుడు తమ వీరులను హైందవ పురాణపురుషులతో పోలుస్తూ సంభాషించడం స్వాభావోచితంగా లేదు.

ఈ క్రింది 'సంభావన'లోని ౧౬౦ వ పద్యం ఈపై అనౌచితికి ఒక ఉదాహరణ. ఇది ఖానజీను అనే మహమ్మదీయుని సంభాషణలోనిది—

"వీరాగ్రగణ్యుడౌ ఖూరుము యువరాజు
శ్రీరామచంద్ర సుశ్రీవెలార్ప
సమవర్తి మూర్తియాసఫ్ ఖాన్ చమూపతి
సౌశీల్యఘనుడు లక్ష్మణుడుగాగ
నఖిల సేనాధీశు డసమ మహాబత్ఖాను
ఘనభుజా వీర్య డంగదుడుగాగ
భువనముల్ ద్రిమ్మరు నబ్దుల్లా చమూనాయ
కోత్తంసు డాంజనేయుండు గాగ
నంత మెరుగనట్టి యా ఘనసైన్యముల్
క్షితినిబట్టని కపిసేనగాగ
సమరసింహ రావణాసుర విభుడు క
థావశేషుడగుచు నణగిపోడె."

చివరి ఆశ్వాసంలో కర్ణుని మాట్లాడించడానికై జహంగీరు చక్రవర్తి అతన్ని నూర్జహాను శయనాగారంలో ప్రవేశపెట్టడం అవిశ్వసనీయమైన అతిశయోక్తిలా కనిపిస్తున్నది. ఒకవేళ ఇది చారిత్రకంగా సత్యమే అయినా అటు జహంగీరు స్వభావానికిగాని, ఇటు కర్ణునిస్వభావానికిగాని ఇది ఏమాత్రము పోషకం గాలేదు.

ఈ కావ్యంలో ప్రత్యేకంగా ప్రశంసింపదగినది కావ్యమంతటా వెల్లివిరిసిన ఉదాత్తరచనాశక్తి. వ్యర్థపదాలు జారనీయకుండా ఒకే బిగువుతో ఆయాకథోచితంగా ఉదాత్తశైలిలో పద్యాలు నడిపించడంలో ఈ కవిసిద్ధహస్తులు. కొన్ని కొన్ని పట్టులలో వీరి కవిత భారతకవుల ఉదాత్తత స్ఫురింపజేసేదిగా ఉన్నది. ఈ క్రింది ఘట్టాలనుబట్టి ఈ విషయం గమనించవచ్చును. ఇదిసలుంబ్రాకృష్ణుడు భోగాసక్తుడైన అమరసింహుడున్న గదితలుపులు బద్దలుకొట్టి లోనికి ప్రవేశించిన ఘట్టములోనిది.

"ఆ పాతాళనభః స్థలాంతమును బ్ర
హ్మాండంబు సర్వంబు న
ప్పైపోవన్, వెనుచప్పుడుప్పతిల నా
ద్వారంబునన్ నిల్చెనన్.
గోపస్ఫూర్తిని వామపాదమున
మున్గల్ మూచమై ప్రాలనా
లోపమొప్పగడన్న వాకిలి యు
బ్బున్ దప్ప్రక్కెందన్ బడెన్"
"వరశైలోపల నిండియుండిన సుగం
ధద్రవ్యపుం ధూమరా
జులు కృష్ణ ప్రభునాసికా పుటములన్
జొత్తేరగా వెనుక క
న్నులు చిట్లించుచు మారెడ్డోపరిలి యం
దున్ నిల్చె; భూమీంద్రుడున్
గలయన్ గన్నులు విప్పి సంభ్రమభయ
గ్రక్రాంత చేతస్కుడై."
"గదిలో నాలుగు మూలలన్ దృశ్యతం
లెసంగన్ క్రేలు నద్దంబు ల
య్యెదనంతోచిన, కృష్ణసింహ విభుడా
హా! కామినీలోలుడా!

యిదియా ! నీపనియందు గ్రిందగల
రాయిన్ దీసి యద్దంబులన్
సుదియన్ మోదిన యట్లుపై విసరి
సుగ్గున్ జేసె వత్సుగ్రుడై"

"శివ యంకంబున బండియున్న పతి
విద్దంబౌ కళోబంబు పైనను
మూర్ధాంచునుండి భూరమణుడా
వాళీ శిరం బెత్తి సా
మ్యవ బొందించుచు బ్రక్కనున్న
యడిదంబున్ గొంచు దెల్లాక తె
త్తిన హార్యాసుకుకో రకంబునగ మంత్రిన్
దాయగా దూకుచున్"

"సంఘర్షము"లోని ఈయుద్ధవర్ణన పద్యాన్ని బట్టి వీరి వస్తువర్ణన చాతుర్యం గ్రహింపవచ్చును.

కత్తుల బల్లెక త్తేల
గత్తెర భుంజగి ప్రోవులన్ బలో
ద్వృత్తములైన కుంతిముల
శ్వేతచ్ఛగద్దగలన్ శిరఃస్థలో
పాత్తములైన వర్మముల
భీవ్యరుచిన్ భటకోటికంఠని
ర్యత్తులు పోకినట్లునుచు
రోదన మాలివడైన్ హతాత్మగన్"

ఇలాంటి రచనకు ఈ కావ్యంలో ఎక్కడ నింపైనా అనేకోదాహరణ లివ్వవచ్చును.

అమరసింహచరిత్ర ఉత్తము కవితాభిమానులందరు తప్పక పరిశీలింపవలసిన కావ్యము.

---

## సంకీర్తన మీమాంస

లేఖకుడు : శ్రీ సుదర్శన్.

అనువాదకుడు : కుందుర్తి వేంకట నరసయ్య. సాధన గ్రంథమండలి. తెనాలి. వెల : ఒక రూపాయి.

సంకీర్తన్ అనే హిందీ భక్తి మాసపత్రికా సంపాదకులైన శ్రీ సుదర్శన్ హిందీలో రచించిన గ్రంథాన్ని శ్రీ కుందుర్తి వెంకట నరసయ్యగారు సంస్కృతి మాత్రాత్మకంగా అనువదించి 'సంకీర్తన మీమాంస' అని పేరు పెట్టారు. దానికే వారు తెనుగులో విపులమైన వివరణం కూడా వ్రాశారు.

ఈ రచయిత కేవలం మూలానువాదంతో తృప్తి పడక నారదభక్తి సూత్రము, మొదలైన సంస్కృతంలోని ఆధ్యాత్మిక గ్రంథాలనుండికూడా నామజపానికి సంబంధించిన విషయాలు కొన్ని చేర్చి తెలుగు పాఠకులకు నామజపవిధానం విపులంగా వివరించారు.

భగవన్నామ జపవిధానము సాంప్రదాయికంగా తెలుసికోగోరేవారందరికీ ఈ పుస్తకం బాగా ఉపయోగిస్తుంది. దీనికి శ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవ స్వామిగారు పరిశీలనాత్మకమయిన పీఠిక వ్రాశారు.

---

## పూదోట

[ఖండకావ్య సంపుటి]

కల్లూరు అహోబలరావు.

శ్రీ కృష్ణదేవరాయ గ్రంథాలయము. ౬౬ పోస్టాఫీసు రోడ్డు, అనంతపురం. వెల : ఒక రూపాయి.

ఇది అప్పుడప్పుడు రచించిన అనేక ఖండ కావ్యాల సంపుటి. ఈ ఖండకృతులలో అంతగా పేర్కొనవలసిన ఉత్తమరచన లేవీ లేవు. చాలావరకీ కావ్యాలన్నీ కేవల పదాల కూర్పులే.

ఈ గ్రంథమాల సంపాదకుల పీఠిక పరిశీలిస్తే వీరికి, నేటికాలపు కవిత్వ పరిణామంగాని, లేక వ్యావహారిక భాషావాదం స్వరూపంగాని సమగ్రంగా బోధపడినట్లు కనబడదు.

ఈ కవి వ్రాసిన ఖండకావ్యాలలో 'అనాథ బాలిక' అనే శీర్షికతో రచించిన శకుంతల చరిత్రమే కొంత పరిగణనీయంగా ఉన్నది. ఈ రకపు రచనలలో వీరు కొంతవరకు కృతకృత్యులైనారు.

ఈ 'అనాథ బాలిక'లోని ఈ క్రింది పద్యాలను బట్టి ఈ రచయిత కవితా స్వభావం గ్రహించవచ్చును.

"బంగరువంటి బాలికను
బాహుల నెత్తుక మానివచ్చి జా
డం గను సంకువయ్యెను; మిటారి మహాయల్
రకుకుల్ అరే! చిరా
వం గనరండు రండని
మనంబున నువ్విళులూరి శిష్యులున్
సంగడికాండ్ర బిల్చిరి; ప్రసంగ ప్రఫుల్ల
వినోద చిత్తులై.

"తాపసకన్య దొక్కతె ముదమ్మున
గణ్వ మహామునీంద్రు సం
తాపము బోవగా శిశువు
దానిరు చేతుల నెల్లనెత్తి, ము
ద్దొపిక బెట్టి, పర్ణకుటి
నొప్పుగ జేరి గృహాంతరమ్మునన్
దీపికవోలె వెల్లుపసికందును
నెల్లన నెల్ల జేర్చగన్."

---

## కృతాంజలి

[ఖండకావ్య సంపుటి]

వేముగంటి నరసింహాచార్యులు. చిరునామా— సీతారామస్వామి దేవాలయము, సిద్ధిపేట. వెల: ఎనిమిది అణాలు.

ఈ కవి రచించిన ఖండకావ్య సంపుటిలో సామాన్యంగా నేటికాలపు ఖండకావ్య రచయితలు వ్రాసే వస్తువిశేషాలన్నీ ఉన్నాయి. రచయిత ఈసంపుటిలో వ్రాసిన ఛందస్సులన్నీ సాంప్రదాయికంగా వాడుకలో ఉన్న మత్తేభాది వృత్తాలే.

ఈ రచనలలో ప్రాథమిక పద్య రచయితలలో కనబడే లోపాలు కొన్ని అక్కడక్కడ కనిపిస్తున్నాయి.

ఈ రకంగా సాంప్రదాయిక ఛందస్సులలో కవితా రచనలు చేసేవారు రచనలో ప్రత్యేకత కనబరిస్తే తప్ప ఇవి పఠితల నాకర్షించడం దుష్కరము.

అయితే ఈ రచయితలో క్రమంగా పరిణతి కలగగలదనే సూచనలు కనిపిస్తున్నాయి. సాంప్రదాయికంగా వృత్తరచన చేసినా అక్కడక్కడ కనబడిన భావనాపటిమ ప్రశంసనీయంగా ఉన్నది. పెద్దన అనే శీర్షికతో రచించిన ఈ పద్యాలు ఈ విషయంలో తార్కాణంగా ఉన్నాయి.

"సంగడమూన భావ సుమి
    రాజితమై, మకరంద మధురల్
పొంగులువారు నీ కవనపుంగిరి
    మెచ్చుచు నీ పదాబ్జముల్
బంగరు గండపెండెరముపట్
    గయిసేసెను కృష్ణరాయ లు
ప్పొంగెడు సందెతోడ కవిభూషణ!
    ఓ కవితా పితామహా!"
కూరిమిమీర రాయ లానమూర్చిన
    చక్కని మందిరమ్ము నం
దూరు రసాన్న భోజనము
    నూరెముల మంచము కమ్మతావి, క
ర్పూరపుదమ్ములమ్ము మనముల్
    దనియింపగ వ్రాసినావు బం
గారు కలమ్ముతోడ నను
    గాథను నిత్యులు పోతపోయుచున్."

---

## శ్రీశైల పండితారాధ్య మూలపీఠము

[ప్రథమ భాగము]

శ్రీ. సు. తి. అక్కులయ్య దీక్షితులు. శ్రీ పత్రిక కార్యాలయము. మదనపల్లి. వెల: ఎనిమిది అణాలు.

ఇది శ్రీశైలపండితారాధ్యమూలపీఠ చరిత్రాన్ని గురించి సంగ్రహంగా వివరించే వచన గ్రంథము.

ఈ గ్రంథంలోని చారిత్రాంశాలేగాక ఈ పీఠానికి సంబంధించిన శైవ సంప్రదాయాలెన్నో ఉన్నాయి.

అయితే విరుమామిడి దేశికేంద్రులకు తదితరులకు, మూలపీఠానికి సంబంధించిన వివాదాంశాలు కూడా ఈ గ్రంథం చివరిభాగంలో ఎక్కువగా కనిపిస్తున్నాయి.

ఈ వివాదాలు న్యాయస్థానాలలో కూడా ప్రవేశించి ఉండడంవల్ల ఈ గ్రంథకర్త వ్రాసిన చారిత్రకాంశాలు కేవలం తమ పక్షం బలపరచుకోవాలనే ఉద్దేశంతో వ్రాసినట్లనిపించక మానదు.

దీనిలో ఈ న్యాయస్థానాలకు సంబంధించిన వివాదాంశాలు చేర్చకుండా కేవలం ఈ పీఠానికి ఉపపీఠాలకు సంబంధించిన ప్రామాణికచరిత్ర, ఆయా కాలంలో ప్రబలిన సంప్రదాయాలు నిష్పక్షపాతంగా వివరించి ఉన్నట్టయితే ఈ గ్రంథం శైవ సంప్రదాయాభిజ్ఞులకు ఇంకా ఉపయోగకారిగా ఉండేది.

---

## శ్రీ లక్ష్మీ చెన్నకేశవస్థల మారికాపుర మాహాత్మ్యము

[వచన రచన]

వారణాసి వెంకటకృష్ణమూర్తి. ప్రకాశకులు: శ్రీ లక్ష్మీ చెన్నకేశవ పబ్లిషర్స్, మార్కాపురం (శ్రీశైల భూమి). వెల: ౧ రూపాయి.

ఈ వచనగ్రంథము కవి ధాటి బలభద్రద్వినాయక ప్రణీతమైన ఆంధ్ర ప్రబంధానికి వచనానుసరణమనీ, ఈ మూల ప్రబంధం మొదటి రెండాశ్వాసాలు తప్ప మిగిలినవి పూర్తిగా లభించాయనీ, ఇది మారికాపుర (మార్కాపుర) స్థల మాహాత్మ్యానికి సంబంధించిన గ్రంథమనీ రచయిత పీఠికలో తెలియజేస్తున్నారు.

ఈ గ్రంథంలో వచనరచన గ్రాంథికం. రచన నిర్దుష్టంగా సాఫీగా నడిచిపోతుంది.

ఈ రచయిత సూచించిన మూలాంధ్ర ప్రబంధం అసమగ్రమైనా ప్రకటనార్హమైనదిగా కనిపిస్తుంది. రచయిత తామా ప్రబంధానికి చేసిన వచనానుసరణంతోనే తృప్తిపడక మూల ప్రబంధం ప్రకటిస్తే ఆంధ్రవాఙ్మయానికి ప్రశస్తమైనసేవ చేసినవారవుతారు.

వీరు రచించిన ఈ వచనగ్రంథం పాఠకులకు మూల ప్రబంధంలోని విషయాలన్నీ సమగ్రంగా తెలియజేస్తున్నది. ఇది మార్కాపుర చరిత్ర పరిశోధనాసక్తులందరు చదవవలసిన పుస్తకము.

---

## అల్లాద్దీన్

[మాజిక్ లాంతరు బొమ్మలకథ]

బుజ్జాయి. బుజ్జాయి పబ్లికేషన్సు, 3ఎ, హారీ బుల్లారోడ్, మదరాసు. వెల: ఆరణాలు.

ఇది బొమ్మల కథల పుస్తకం. పిల్లలకు ఇలాంటి పుస్తకాలు చక్కని పఠనాసక్తి కలిగిస్తాయి. ఈ రకమయిన పుస్తకాలు తెలుగులో వేళ్లమీద లెక్కపెట్టవచ్చును. దీనిలోని అల్లాఉద్దీను కథ పిల్లలందరికీ బాగా పరిచితమయిన కథ.

దీనికి కథావేశం చెడకుండా బుజ్జాయి వేసిన బొమ్మలు చిన్నపిల్లల మనఃప్రవృత్తికి తగినవిగా ఉన్నాయి. ముఖచిత్రమే కాక లోపలి బొమ్మలు కూడా వేర్వేరు రంగులలో వేస్తే ఈ పుస్తకం ఇంకా ఆకర్షకంగా ఉండేది. రచయితముందు ప్రచురణలోనైనా ఈ జాగ్రత్త తీసుకోగలరని ఆశిస్తున్నాము.

---

## విప్లవ సందేశము

రచయిత: కె. వి. రావు. ప్రతులకు: కె. వి. రావు. మోదుకూరు, వయా పొన్నూరు.

ఇది రాయల్ సైజులో సుమారు ౨౩౦ పేజీల గ్రంథం. పుస్తక ముద్రణాదులు ప్రశస్తంగా ఉన్నాయి.

విప్లవ సందేశం అనే పేరును బట్టి చూస్తే ఇదేదో విప్లవానికి సంబంధించిన పుస్తకంఅని అనిపిస్తుందిగాని, దీనిలో రచయిత బౌద్ధ మహాయుగం మొదలుకొని బ్రిటీషు మహాయుగం దాకా నడిచిన చరిత్రం అంతా ఒక్క గుక్కలో సమీక్షించివేశారు. ఇల్లాగే బౌద్ధమతము, వేదమతము, మహమ్మదీయమతం మొదలయినమతాల ఖండనమండనాలన్నీ జరిగిపోయాయి.

అల్లాగే ఆస్తికత్వము, నాస్తికత్వము, విగ్రహారాధన, బ్రాహ్మణులు, అబ్రాహ్మణులు, పిండోత్పత్తి మొదలు, బ్రహ్మాండోత్పత్తిదాకా గల సమస్తవిషయాలూ అక్కడక్కడ స్పృశించుకుంటూ వెళ్లిపోయారు.

అయితే ఈ రచయితకు ఈ విషయాలలో వేటిని గురించీ కొంచెమయినా స్పష్టాభిప్రాయాలు లేవు. అంతా అయోమయం. గందరగోళం. కాని ఒక్క సంగతి ఈ రచయిత మనస్సులో గట్టిగా పట్టుకుంది. అది బ్రాహ్మణులవల్ల భారతదేశం అంతా అనేకరకాలుగా అధ్వాన్నమై పోయినదన్న విషయం. రచయిత ఈ పుస్తకంలో అన్నిచోట్లా ఈ విషయం పల్లవి పాడుతూంటారు. రచయితకున్న ఈ సంకుచిత కులతత్వం వల్లనే ఈవిధమయిన దారీ తెన్నూ లేని పుస్తకం బయలుదేరినట్లు కనిపిస్తుంది.

కులతత్వం ఖండించేటప్పుడు కులతత్వాతీతమైన ఏదైనా ఒక అభ్యుదయగామి సిద్ధాంతం ఆరోగ్యవంతులయిన రచయితలందరు అవలంబిస్తారు. కాని ఈ రచయిత ఇలాంటి పద్ధతి జోలికిపోక ఈ సంకుచిత కులతత్వమే ఆశ్రయించడం విచారకరమైన విషయం.

ఈ రచయిత విజ్ఞానానికి ఈ పుస్తక ప్రారంభంలోని రెండుమూడు వాక్యాలుచాలు." ఆదిలో మనం చూస్తూవున్న ప్రకృతి లేదు. ఈ ప్రకృతి ఏయిలా పరివర్తన చెందినదో తద్దానినిగూర్చి తెలుపునది పరిణామ వాదము.

సైంటిస్టు పదార్థాన్ని విభజించునప్పుడు విభజించుటకు వీలులేని పదార్థాన్ని పరమాణువు అందురు. ఇట్టి పరమాణువులే ప్రకృతి.

వీరి భాషా రచనకు ఈ క్రింది వాక్యాలు చాలు ననుకుంటాను. "ఆదియందు ప్రాకృతా వలయాకారమున కొన్ని చీకపురుగులు యుద్భవించినవి. దరిమిలా కొన్ని లక్షల యేండ్లదాకా మొదటి ప్రాణులకన్నను హెచ్చువేగ బలములుగల సముద్రపు తేళ్లు బయలు వెడలినవి."

ఇలాంటి పుస్తకాలు జాకోబిన్ పబ్లిషింగ్ కంపెనీ వంటి సంస్థలు ప్రచురించడమే చాలా ఆశ్చర్యకరమైన విషయం:

---

## సూర్యనమస్కారములు

కందాళ వెంకటాచార్యులు, కాపీలకు: సప్త విద్యామండలి, విజయవాడ. వెల: ఎనిమిది అణాలు.

సూర్యనమస్కార విధానం ప్రాచీన సంప్రదాయానికి సంబంధించినది. ఇటీవల ఈ విధానంలో బాగా అభిరుచి కలుగుతున్నది. ఈ చిన్న గ్రంథంలో రచయిత సూర్యనమస్కార విధానము, వాటి ఉపయోగాలు సులభశైలిలోను అందరికీ అర్థమయ్యేటట్లు వివరించారు.

పుస్తకంలో అక్కడక్కడ ముద్రించిన బొమ్మలు సూర్యనమస్కారాలు ప్రారంభించగోరే పాఠకులకు సహాయకారిగా ఉన్నాయి.

